# దుర్గాదాసు

నాటకరచనా ధురంధరులగు

శ్రీ ద్విజేంద్రలాల్ రాయల

(బంగాలీ నాటకమునకు)

తెలుఁగులో

అనువాదకర్తలు:

శ్రీయుత జంధ్యాల శివన్న శాస్త్రిగారు



ప్రకాశకులు:

కురుకూరి సుబ్బారావు అండ్ సన్

ప్రొప్రయిటర్సు:- సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

రెండవ కూర్పు 100 ప్రతులు

బెజవాడ శ్రీ ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

 1940 [ వెల 2-0-0

సమర—అట్లేల? సార్వభౌముఁడు యశోవంతసింహుని పుత్రుఁడగు పృధ్వీసింహుని యుసురులఁ గొని, యాఋణమును తీర్చికొనిరి గదా!

ఔరం—నే నతనియుసురుల హరించితినా? ఓయీ యువకుఁడా! నీ వేమనుచుంటివో నీకు తెలియునా? నేను అతనిప్రాణముల హరించితినా? నేను పృధ్వీసింహుని నా పుత్రునివలె ప్రేమించువాఁడను. స్వయముగ నాచేతులతో నతనికి బహుమానపు ఉడుపులను దొడిగితిని.

సమర—సార్వభౌమా! తెలియని యాపిల్లఁడు నట్లే యనుకొనెను, పాప మమాయకుఁడగు ఆకుఱ్ఱనికి అవి విషవస్త్రములని యేమి యెఱుక?

శ్యామ—సమరదాసూ! నీ వెవరితో ముచ్చటించుచుంటివో నీ కేమేని జ్ఞాన మున్నదా?

సమర—ఎఱుఁగుదును; బికనేరుమహారాజా! తమప్రభువుతో ముచ్చటించుచుంటిని. మాప్రభునితోఁగాదు.

(ఔరంగజేబు కొంచె ములికిపడును. తన ముఖ మెదుట తనను ఒక్కఁడు ఈ విధముగా దూషించుచుండఁగా వినుట కతని కభ్యాసము లేకుండెను. అతఁడు కనుబొమలు చిట్లించెను, కాని వెంటనే తన యాకారమును గప్పిపుచ్చెను.)

ఔరం—అవి విషవస్త్రములని యెవ్వఁ డనును?

దుర్గా—లేదు సమ్రాట్! దీని కేమియు ప్రమాణము లేదు. ఆ వస్త్రములు విషదిగ్ధములని లోకులయనుమానము.

సమర—(క్రోధముతో) అనుమానమా? దుస్తులను ధరించిన కొద్దికాలములోనేకదా పాప మాబాలుడు విషవేగముచే గిలగిల కొట్టుకొని మరణించెను. నేను పృధ్వీసింహుని మృత్యువును కన్నులారఁ గాంచలేదా? అనుమానమా? అగుచో యశోవంత సింహుని ఆఫగనిస్తాను పంపి చంపించుటయు ననుమానమే? నేఁడు అతనిరాణిని, అతనిచిన్నకొడుకును ఢిల్లీలో నాపియుంచుటయు ననుమానమే? ఇంక

నీవు ననుమానమే? నేను అనుమానమే? ఔరంగజేబు బాదుషాయు ననుమానమే? మొగల సామ్రాజ్యము ననుమానమే? ఈవిశ్వమంతయు ననుమానమే? ఇది అనుమానముకాదు. దుర్గాదాసూ!—ఇది ధ్రువము, స్థూలము, ప్రత్యక్షము.

దుర్గా—సోదరా! శాంతించుము. ఏమి ప్రతిజ్ఞ చేసి వచ్చితిమో స్మరించుము.

సమర— మంచిది. ఇదిగో ఊరకుంటిని. (చక్రవర్తితో) కాని ఒక్కమాట చెప్పియుంచెదను. సమ్రాట్! మేము కేవలము పాలు త్రాగు పసికూనలము, ఏమియు నెఱుంగము అని యనుకోనకుఁడు. ఇంచుకంత ఎఱుఁగుదుము.

దుర్గా—రాజేంద్రా! మాతమ్ముని పెడసరి తనమును క్షమింపుఁడు. సార్వభౌమా! నేఁడు మేము ప్రభువులసన్నిధి ఒకమనవి విన్నవించుకొనుటకు వచ్చితిమి.

ఔరం— మంచిది! చెప్పుము.

శ్యామ—దుర్గాదాసూ! చెప్పుము. భయ మేల? ప్రభువులుదారులు. వారు నీతమ్ముని దుర్వ్యవహారమును క్షమించిరి. నీవు భయపడుట కేమియు హేతువు లేదు.

దుర్గా—మావిన్నప మిదియే. స్వర్గస్థుఁడగు జోధిపురరాజేశ్వరునిరాణిపిల్లలను దీసికొని తనరాజ్యమునకుఁ బోఁగోరుచున్నది. ఈవిషయమై ప్రభువులయాజ్ఞ వేఁడుచుంటిని.

ఔరం—దీనికి నాయాజ్ఞ యేల?

దుర్గా—అది నాకును తెలియదు. కాని మొగలసేనాపతియగు తహవ్వరఖాను దేవర హుకుము లేకుండ మహారాణిని పోనీయఁ గోరుట లేదు.

ఔరం— ( తహవ్వరఖానువంక తిరిగి చూచును ) ఏల తహవ్వర్ఖా?

తహ— ఏలినవారియాజ్ఞ యట్లే యని వింటిని.

ఔరం—ఓహో — అవును. నేను చెప్పితిని. యశోవంత సింహుని రాణిని ఢిల్లీనుండి పోవ్రలోపల సన్మానింపఁగోరుచున్నాను. యశోవంతునివిషయమై యే యనుగ్రహమును జూపించుటలో నేనెట్టి కొఱఁతను జేయలేదో యీతనిరాణిపైఁగూడ నాయనుగ్రహమును జూపఁగోరుచున్నాను. (శ్యామసింహునితో) ఏమి మహారాజా?

శ్యామ—ప్రభువుల కాదినుండియు యశోవంతుని కుటుంబముపై నపారదయకదా!

సమర— సమ్రాట్!—నే నూరకుండఁజాలను, దుర్గాదాసూ! సమ్రాట్! తా మనుగ్రహము చూపకుఁడు. ఇదియే పరమానుగ్రహము. తాము కనుబొమలు చిట్లించిన మాత్ర నేను వెఱవను. ఏలయన దాని భావ మెఱుఁగుదును. కాని తమ నగవును గాంచి మిక్కిలి భీతి కల్గును. ఏలయన దాని భావము తెలియదు— స్పష్టముగా జెప్పుడు! మీరు యశోవంతసింహుని సర్వనాశనము చేయగోరుచున్నారా? ఆయన నెట్లు చంపించితిరో, ఆయనపెద్దకొమరు నెట్లు చంపించితిరో, అట్లే ఆయనరాణిని, ఆయన చిన్నకొమరునిగూడ జంపనెంచితిరా? స్పష్టముగాఁ జెప్పుడు. యశోవంతసింహుని వంశములో నింక నెవరిని నుంచరా? చెప్పుడు. మేము తెలిసికొందుము. మిమ్ము నీభిక్షయే కోరుచుంటిని. మీ రనుగ్రహము చూపకుఁడు. మీతోడివైరముకన్న స్నేహము భయావహము.

దుర్గా—సోదరా! నీవు నా ప్రార్థనను వమ్ముచేయుటకే వచ్చితివా? నీవు వెడలిపొమ్ము.

సమర—వెళ్ళుచున్నాను. దుర్గాదాసూ! మరియొకమాట— ఒక్కటేమాట చెప్పెదను. ప్రభువుల పూర్వపురుషుఁడగు అక్బరునికన్న ప్రభువుపై ఒక్కవిషయములో నాకెక్కువ గౌరవముకలదు. ఏలయన, వీరు వారివలె తేనెబూసిన కత్తిగారు, వీరు అసలైన మహమ్మదీయులు. సరలగ్రామీణ ధార్మిక మహమ్మదీయులు. వీరు వారివలె వివాహమను నెపమున హిందువుల హిందూత్వమును నష్టముచేయరు. సరలము, పరిష్కృతము, నిశాతమునగు సనాతన మహమ్మదీయపద్ధతిచే స్వధర్మ

ఔరం—ఓహో — అవును. నేను చెప్పితిని. యశోవంత సింహుని రాణిని ఢిల్లీనుండి పోవ్రలోపల సన్మానింపగోరుచున్నాను. యశోవంతునివిషయమై యే యనుగ్రహమును జూపించుటలో నేనెట్టి కొఱఁతను జేయలేదో యీతనిరాణిపైఁగూడ న్యాయనుగ్రహమును జూపఁగోరుచున్నాను. (శ్యామసింహునితో) ఏమి మహారాజా?

శ్యామ—ప్రభువుల కాదినుండియు యశోవంతుని కుటుంబ ముపై నపారదయకదా!

సమర— సమ్రాట్!—నే నూరకుండఁజాలను,దుర్గాదాసూ! సమ్రాట్! తా మనుగ్రహము చూపకుడు. ఇదియే పరమానుగ్రహము. తాము కనుబొమలు చిట్లించిన మాత్రి నేను వెఱవను. ఏల యన దాని భావ మెఱుఁగుదును. కాని తమ నగవును గాంచి మిక్కిలి భీతి కలును. ఏలయన దాని భావము తెలియదు— స్పష్టముగా జెప్పుడు! మీరు యశోవంతసింహుని సర్వనాశనము చేయగోరు చున్నారా? ఆయన నెట్లు చంపించితిరో, ఆయనపెద్దకొమరు నెట్లు చంపించితిరో, అట్లే ఆయనరాణిని, ఆయన చిన్నకొమరునిగూడ జంపనెంచితిరా? స్పష్టముగాఁ జెప్పుడు. యశోవంతసింహుని వంశ ములో నింక నెవరిని నుంచరా? చెప్పుడు. మేము తెలిసికొందుము. మిమ్ము నీభిక్షయే కోరుచుంటిని. మీ రనుగ్రహము చూనకుఁడు. మీ తోడివైరముకన్న స్నేహము భయావహము.

దుర్గా—సోదరా! నీవు నాప్రార్థనను వమ్ముచేయుటకే వచ్చి తివా? నీవు వెడలిపొమ్ము.

సమర—వెళ్ళుచున్నాను. దుర్గాదాసూ! మరియొకమాట— ఒక్కటేమాట చెప్పెదను. ప్రభువుల పూర్వపురుషుఁడగు అక్బరునికన్న ప్రభువుపై ఒక్కవిషయములో నాకెక్కువ గౌరవముకలదు. ఏలయన, వీరు వారివలె తేనెబూసిన కత్తిగారు, వీరు అసలైన మహమ్మదీయులు. సరలగామీరాణ ధార్మిక మహమ్మదీయులు. వీరు వారివలె వివాహ మను నెపమున హిందువుల హిందూత్వమును నష్టముచేయరు. సరలము, పరిష్కృతము, నిశాతమునగు సనాతన మహమ్మదీయపద్ధతిచే స్వధర్మ

దుర్గా- -సమ్రాట్టున కిట్టి కోరిక యుండుటబట్టియే ఆమె సమ్మానిత యయినది ఇంక ననుమతి యీయుఁడు.

ఔరం—(శ్యామసింహునితో) మహారాజా! మీరేగి నా యేకాంత భవనమున ఉండుడు. నే నిపుడే వచ్చెదను.

(శ్యామసింహుఁడు నిష్క్రమించును)

ఔరం—(దుర్గాదాసుతో) దుర్గాదాసూ! నీవు కేవలము ప్రభుభక్తిగల సేవకుఁడవే కావు, రాజతంత్రమునందును చతురుఁడవుగాఁ గనుపట్టుచున్నావు. నీతో చాతుర్యము పనికిరాదు, యథార్థము జెప్పెద విను. నేను యశోవంతసింహుని రాణిని, నతని చిన్న కొమరుని కోరుచుంటిని.

దుర్గా—అది నేను మున్నే యెఱుఁగుదును రాజేంద్రా! కాని దీని కేమియు కారణము కనుపట్టదు. మహారాణి యాఁడుది; యశోవంతునికొమరుఁడు పసివాఁడు. ఏలికకు వారితో నేమి ప్రయోజనము?

ఔరం—దుర్గదాసూ! ఇది నీ వెఱిఁగియే యుందువు. భారత సార్వభౌమునకు ప్రతివానికిని తన ప్రతికార్యోద్దేశమును చెప్ప బాధ్యత లేదు!

దుర్గా—(కొంచెముసేపు విచారించి) రాజేంద్రా! అగుచో నా ప్రార్థన కేవలము నిరర్థకమే గదా?

ఔరం—ఆఁ కేవలము నిరర్థకమే.

దుర్గా—ఇంక నే నేమియు చెప్పనక్కఱలేదా?

ఔరం—నీవు యశోవంతుని భార్యా పుత్రులను నాకు సమర్పించుటకు సంసిద్ధుఁడవు కావా?

దుర్గా—ప్రాణ ముండువఱకు కట్టు కాఁజాలను.

ఔరం—వినుము దుర్గాదాసూ! నీవు యశోవంతసింహుని రాణిని యతనిపుత్రుని నాకిమ్ము. నీకు గొప్పబహుమాన మొసఁగెదను.

దుర్గా—(నవ్వి) సమ్రాట్! నే నాతరగతికన్న కొంచెము మిన్నను. దుర్గాదాసు తన జీవితకర్తవ్యమునే పరికించును. దుర్గాదాసు జీవించియుండఁగా నతని స్వర్గస్థప్రభువు యశోవంతసింహుని కుటుంబ

ములో నెవ్వనిపైఁగాని చేయి వేయుట కెవరికి వీలులేదు— మంచిది పోవుచుంటిని. సలాము.

శా. కార్యా కార్య వివేకశూన్య నృపచక్రం బాహావోర్వీద్విష
చ్ఛౌర్యజ్వాలల మ్రగ్గుదాక, నిజహస్తన్యస్తఖడ్గంబు ని
ర్వీర్యంబై పడుదాక, నమ్మఁడు సమర్పింపండు మార్వాడరా
డ్భార్యాపుత్త్రిల, దుర్గదాసు, చపలప్రాణావనోత్కంఠుఁడై.

ఔరం—ఆగుము. దుర్గాదాసు జీవించియుండగా నట్లు కాక పోవచ్చును. కాని యతఁడు మరణించిన పిమ్మట నట్లగుట కభ్యంతరము లేదుగదా. తహవ్వర్ఖాన్!—పట్టుకొనుము.

(తహవ్వర్ఖాను ముందుకు వచ్చును)

దుర్గా—(కత్తి దిప్పుచు) ఖబర్దార్!— ఇందుకును నేను సంసిద్ధుఁడనయి వచ్చితిని.

(అని నడుమున వ్రేలాడు ఈల మ్రోగించును. వెంటనే అయిదుగురు రాజపుత్రులు ఆయుధపాణులై దర్బారులో ప్రవేశింతురు.

దుర్గా—సార్వభౌమా! ఈ యయిదుగురిని చూచితిరా? ఈమారు ఈల వేసినచో అయిదువందలమంది ఇచట హాజరయ్యెదరు-తెలిసి ప్రవర్తింపుడు.

ఔరం—పొమ్ము.

(దుర్గాదాసు రాజపుత్రులతో నిష్క్రమించును.)

ఔరం—(క్షణము స్తంభితుఁడైయున్న పిమ్మట) దుర్గాదాసూ! నీవు ప్రభుభక్తియు, సాహసము, చాతుర్యముగల వీరుఁడ వనియే యనుకొంటిని. కాని ఇంత స్పర్ధగలవాఁడవనియెఱుఁగను.(తహవ్వరుతో) తహవ్వర్ఖాన్ !

తహ—ఖుదావంద్ !

ఔరం—సేనాపతియగు దిలేర్ఖానుతో ఇప్పుడే స్వసైన్యముగఁ బోయి యశోవంతునియిల్లు ముట్టడింపుమని నాయాజ్ఞగాఁ జెప్పుము. పొమ్ము. (తెర వ్రాలును)

## ద్వితీయదృశ్యము.



స్థానము—ఢిల్లీరాజభవనములో బేగము గులనారుగది.

సమయము—మధ్యాహ్నము.

గులనారు—(గదిలో పచారు చేయుచు తనలో) జోధపురపు రాణీ! నీ వొకనాడు పొగరుచే నన్ను క్రీతదాసియగు యవనరాజ్ఞి యంటివి. ఇపుడు నీపొగ రణంచితినా లేదా? నీమగనిని కాబూ లంపి చంపించితిని. నీపెద్దకొడుకును విషముపెట్టి చంపించితిని. ఇపుడు నీయెదుటనే నీచిన్నకొడుకును చంపించెదను. నీచే నాపాదోదకమును త్రావించెదను. మఱియు నిన్ను ప్రాణముతో పాతిపెట్టించెదను. జోధపురపు రాణీ! నేఁ డీక్రీతదాసియగు యవనరాజ్ఞియే సువిస్తృతమగు మొగల సామ్రాజ్యమును శాసించుచున్నది. ఔరంగజేబో? నావ్రేలిపైనాడు కీలుబొమ్మ. లోకు లన్యథా తలఁచినచో నది వారి మూర్ఖత. అట్లే కాకున్న నిప్పుడౌరంగజేబునకు యశోవంతసింహుని భార్యాశిశువులతో నేమిప్రయోజనము? ఎవఁడును మనస్సులో నీసంగతియే విచారించఁడు.

(ఔరంగజేబు ప్రవేశించును.)

గుల—ఎవరు? సార్వభౌములా?—సలాము సమ్రాట్!

ఔరంగ—గులనార్! ఏల నీ విచట నొంటిగ నుంటివి?

గుల—జోధపురపు రాణికై వేచియుంటిని. ఏది ఆమె?

ఔరంగ—ఇంతవఱకు పట్టుపడ లేదు.

గుల—ఇంతవఱకు పట్టుపడ లేదా?

ఔరంగ—దుర్గాదాసు ఆమె నిచ్చుట కంగీకరించక దర్బారు నుండి వెడలిపోయినాఁడు.

గుల—బ్రతికియే?

ఔరంగ—ఆఁ అతనివెంట సైన్య మున్నది.

గుల—మొగలసామ్రాజ్యమునకు సైన్యము లేదా?

ఔరంగ—ప్రేయసీ—

గుల—రాజేంద్రా! నే నిపు డేమాటను వినను. నేఁడు ప్రొద్దు గ్రుంకకమున్న జోధపురపురాణిని నాకు తెచ్చి ఈయవలెను.

ఔరం...గులనార్! రాణియింటిని ముట్టడించుటకుగా దిలేర్ఖాను నంపితిని.

గుల...మంచిది. సాయంకాలములోపల ఆమె నాకు కావలయును. మఱవవలదు. (నిష్క్రమించును.)

ఔరం—(పోవుచు, పోవుచు తనలో) ఎట్టిసాహసి యీదుర్గాదాసు! నే నిదియే యూహించుచుంటిని. నిండుదర్బారులో నా యెదుటఁ గత్తిదూసి చివాలున గుఱ్ఱముపై నెక్కి పోయెను! - ఇట్టి సాహసు మిదివఱ కెవ్వనికిని లేదు. ఇతనిప్రభువగు యశోవంతునకును ఇట్టిసాహసము లేదు. (మెల్లగ నిష్క్రమించును.)

తృతీయదృశ్యము.

స్థానము... మొగలసేనాపతి దిలేర్ఖాను ఇంటివెలుపల

సమయము—అపరాహ్ణము.

(దిలేర్ఖాను సైనికవేషము ధరించుచుండును. ఎదుట నతని ప్రధానసైనికోద్యోగియగు తహవ్వర్ఖాను నిలఁబడియుండును.)

దిలేరు...ఏమంటివి ఖాఁ సాహెబ్? రాథోరు దుర్గాదాసు బాదుషా ముక్కుముందు కత్తి తిప్పిపోయెనా?

తహ...ఆఁ.

దిలే—నీవు నిలఁబడి చూచితివా?

తహ—అవును.

దిలే—తిన్నగనుండియే?

తహ—వీలైనంతవఱకు.

దిలే—వీలైనంతవఱకా? దీనియర్థము?

తహ—ఇదియే. బాదుషాముక్కుపై నతఁడు కత్తి త్రిప్పెను గదా—

దిలే—ముక్కుపై త్రిప్పెనుగ?

తహ—త్రిప్పుటయనిన త్రిప్పుటయా! —చాల బాగుగా దిప్పినాఁడు.

దిలే—అప్పుడు నీవు కొంచెము వెనుకకు ఒఱిగితివి కాబోలు?

తహ—ఆఁ ఒఱిగితిని. నేనుగనుక ఒఱిగితిని. మఱియొకఁ డగుచో వెలికిలఁ బడవలసినదే.

దిలే—నీవు కత్తి నెందుకు దూయలేదు?

తహ—అవకాశము కలుగనిదే!

దిలే—అవకాశమే కలుగలేదా?

తహ—ఓహో! ఆ రాజపుత్త్రుఁడు ఏపెద్దమానిసియు దూయ లేనంత త్వరగా కత్తిదూసెను. తర్వాత అతఁడు వెళ్ళిన పిమ్మట—

దిలే—నీవు కత్తిదూసితివి కాబోలు?

తహ—అప్పుడు కత్తి దూసి యేమి చేయను?

దిలే—అతఁడు వెళ్ళినపిమ్మట మఱి యేమి చేసితివి?

తహ—ముక్కుఉన్నదో ఊడినదోయని ముక్కుపై వ్రేలిడి చూచితిని.

దిలే—సందేహము కలిగెను కాబోలు.

తహ—సందేహ మవశ్యము కలిగెను. ఏలయన ఆతఁ డంత వేగముగాఁ గత్తి త్రిప్పెను. అప్పుడు ముక్కు కొంత చెక్కు ఎగురుట వింత గాదు.

దిలే—(నవ్వి) ఇది క్రొత్తసంగతియే. అయితే దుర్గాదాసు చూడఁదగినవాఁడే.

తహ—ఆతనిఁ జూచుటకే బాదుషా నిన్ను పిల్వనంపినది. నీ కింక దుస్తులు ధరించుటయే ముగియలేదు.

దిలే—ఓయీ! ఆగుము. ఇప్పుడే కొంచెము విశ్రమింపవలయు ననుకొంటిని. ఇంతలో నొక పిచ్చివాని వెంట బడుమని యాజ్ఞ వచ్చినది. ఈసామాన్యకార్యమును నీవు చేయఁజాలవా?

తహ—కాదు. అతనితో నెక్కున పొత్తు పెట్టుకొనుట నా కిష్టము లేకున్నది. అదియునుగాక--

దిలే...అదియునుగాక?

తహ... అదియునుగాక రాజపుత్రజాతి యనిన నాకొక విధమగు నసహ్యాము. ఆ జాతి యుద్ధము చేయుటయే మెఱుఁగదు.

దిలే... ఎట్లు?

తహ... ఓయీ! వారు యుద్ధము చేసెదరు. కాని ఏయుద్ధనియమమును బాటించరు. తటాలునఁ గత్తి దీయుట, తల నఱకుట, తమ తలనింక లక్ష్యమే చేయరు. వానిచూపంతయు నా నెత్తిపైనే యుండెను. ఇట్టి మూర్ఖులతోడనా యుద్ధము చేయుట?

దిలే... చూపంతయు నీ నెత్తిపైనే యుండెనుగా?

తహ... అవును. ఓయీ! తమతలకు ముప్పుము లేకుండ యుద్ధము చేసెదరు. ఇతఁ డాధ్యానము లేకయే కత్తి త్రిప్పసాగెను. పగతురశిరములో, ఇంక చేమగడ్డలే యనుకొనినాఁడు.

దిలే... రాజపుత్రులసైన్య మెంత యుండును?

తహ... రెండువందల యేఁబదివఱ కుండవచ్చును.

దిలే... పొమ్ము, తహవ్వర్ఖా! ఐదువేల మొగలసైన్యమును సిద్ధముకమ్మని యాజ్ఞాపించుము. ప్రాణముల నరకుగొనక పోరాడుజాతి నొక భయంకరజాతిగా నెంచవలయును. అట్టివారితో జాగరూకతతో యుద్ధముసేయవలయును. ఐదువేలు మొగలఆశ్వికులు. తెలిసినదా?- పొమ్ము. (తహవ్వరుఖాను పోవును)

దిలే... (తనలో) ఈరాజపుత్రజాతి నిశ్చయముగ అసమసాహసముగలది. కాని సార్వభౌమునియీయాజ్ఞ కేమియు హేతువు తెలియుటలేదు. ఈయన యశోవంతసింహునకు వెఱచియే యీయనను జంపించెను. కాని యిప్పుడామహారాజు భార్యాశిశువులపై ఈ క్రోధము-ఈఅన్యాయము-ఏలొకో? నే నీయుద్ధమునుండి తిరిగి రాక పోవచ్చును ఇంటిలోనికిఁ బోయి ఒకమాఱు భార్యాపుత్రులఁ గలిసి వచ్చెదను. (నిష్క్రమించును.)



## చతుర్థదృశ్యము.



స్థానము... మేవాడరాణా రాజసింహుని యంతఃపురము.

సమయము... అపరాహ్ణము.

(జయసింహుని నవోఢయగు రెండవభార్య కమలాదేవి ఒంటరిగా నిలఁబడి యుండును,

కమలా—(తనలో) స్వామీ! ని న్నెట్లు పంజరమునఁ బెట్టితిని! ఏ విం దేయుండును. ఇంక పెద్దరాణి మెదల లేదు. పాప మెంత దుఃఖ వార్త! ఇంత కొలఁదికాలములోనే ఒక కొత్తమానిసి వచ్చి యాపెనోటి ముందటి ముద్దలాగుకొనెను--హాహాహా--మంత్రి మెఱుఁగుదును పెద్ద రాణీ! మంత్రి మెఱుఁగుదును!- బాగుగనైనది. ఇట్టిస్వామి--ఇట్టిస్వామి-రాణా రాజసింహుని పుత్రుఁడు--ఇట్టిస్వామిని నీ వొంటిగా దాచికొని సుఖము జూరకొనఁదలఁచితివా పెద్దరాణీ? సిగ్గు లేదా?--రాజకుమారు లలో నీయనయే మేవాడకు రాణా యగును. నీవు ఒంటరిగా రాణివి కావలయు ననుకొంటివి కాబోలు! ఇది ఎప్పటికిని కాఁజాలదు. పెద్ద రాణీ! గ్రద్ద తన్నుకొని పోయినట్టు లితనిని నేను వశపఱచుకొంటిని--ఏమి! రాణి వయ్యెదవా? అయితివా! రాణా తనచేతులతో నానాథుని చేతికే రక్షాసూత్రము గట్టెరి. నీ వెఱుఁగుదువా? బావగారూ! ఇది మీ కేమేని తెలియునా? ఇదియునుగాక నానాథుఁడె రాణాకు ఇష్టుఁడు. భీమసింహా! ఏమి చేసెదవు? అన్నదమ్ము లిద్దఱికి బాగుగాఁ గయ్యము బెట్టితిని. భీమసింహుఁ డిప్పుడే పోవును. దూరముగా పొమ్ము. ఇట్టి దియే యుద్ధము. నీ విందులో ఓడెదవు. తర్వాత మహారాణా జయ సింహుఁడు మేవాడకు రాణాయగును. శ్రీమతి కమలాదేవి మేవాడకు మహారాణి యగును. పెద్దరాణీ! తొలఁగిపొమ్ము. పెద్దరాణివా? తొలఁగిపొమ్ము.

(అఱచుచు ఒక దాది ప్రవేశించును.)

దాది... అరే! బాబో!

కమలా...ఏ మయినది?

దాది... బాబో! ఒక్కమాఱుగా కురుక్షేత్రము--బాబో! ఇట్టి దెన్నడును జూడలేదు.

కమలా ...చావు ముండా! జరిగిన దేమో చెప్ప వేమి?

దాది... బాబో! ఒక్కమాఱుగా దక్షయజ్ఞము. ఇంకేమున్నది? ఒక్కమాఱుగా నిశుంభవధ!

కమలా... ఓసీ! జరిగినది చెప్పుము,

దాది...జరిగిన దేమున్నది? ఒక్కమాఱుగా లంకాకాండము, బాబో!

కమలా...చెప్పవా?

దాది—ఇదియె కనిష్ఠ రాజపుత్రుఁడు—జయసింహుఁడు నీ నాథుఁడు.

కమలా...అవును, వా రేమి చేసిరి ?

దాది...ఆయన జ్యేష్ఠరాజపుత్రుఁడు భీమసింహునికాళ్ళపై కత్తితో నొక్కదెబ్బ--బాబో! నెత్తురు గంగాప్రవాహము!

కమలా...ఏమి! తర్వాత?

దాది...తర్వాత నేమున్నది? భీమసింహుఁడు జయసింహుని కుత్తుక పట్టుకొనినాఁడు. ఈ సమయమున రాణాగారు వచ్చిరి. వచ్చి పెద్దకొమరుని ఎక్కువ కసరికొని రామాయణ మేదుకాండలు నొక్కమాఱుగా వినిపించిపోయిరి. భీమసింహుఁ డేమియు పలుకలేదు. మెదలక బయటికి బోయెను. పాప మాయన మొగము వాడిపోయెను.

కమలా—బాగుగ నైనది!

దాది...ఏమి యట్లనెదవు ? జ్యేష్ఠరాజపుత్రుఁడు చాలమంచి స్వభావముగలవాఁడు. దేశములోనివా రెల్లరు నాయనను మంచిగా చెప్పికొందురు. కనిష్ఠరాజపుత్రుఁడును యోగ్యుఁడే! నేను నాచేతులతో నాయనను పెంచితిని. ఈజగడము లన్నిటికి నీవే కారణమవు.

కమలా...నోరు మూయుము తొత్తుముండా!

దాది... బాబో! ఇది సాక్షాత్తు తాటకగా నున్నదే! (పాఱిపోవును.)

కమలా...ఏమీ! ఇంతవఱకు వచ్చినదా? ఇంతవఱకు వచ్చు నని నే ననుకొనలేదు! మంచిది. ఇందు చెఱు పేమున్నది? మొదటనే నిశ్చయము కావలెను.

[సరస్వతి ప్రవేశించును.]

సర—కమలా! ఇది నీకు తగినపనియేనా? అమ్మాయీ, నేఁ డేమి జరిగెనో ఎఱుఁగుదువా?

కమలా...ఎఱుఁగుదును. కాని ఇందు నే నేమిచేసితిని?

సర—నాథుని క్రమముగా నన్నగారికి విరుద్ధముగాఁ బురి కొలుపుచు ఆవేశముఁ గూర్చుచుంటివి.

కమలా...ఎవ రందురు?

సర...నేను.

కమలా—వట్టిది బావగారే కయ్యమునకు కాలు దువ్వు చున్నారు. చిరకాలమునుండి వారిదృష్టి మేవాడసింహాసనముపై నున్నది. ఇది వారితప్పు.

సర...కమలా! ఇది నేను బాగుగ నెఱుఁగుదును. వా రీసింహా సనమును గోరుటలేదు. ఒకవేళ కోరినను తప్పేమి? వారే జ్యేష్ఠ పుత్రులు గదా!

కమలా...ఆఁ ఒకటి రెండుగంటలకాల మాయనయే పెద్ద యనుకొనుము కాని రాణాగారు స్వయముగా జన్మదినమున చిన్న కొడుకునకే రక్షాసూత్రము గట్టిరికదా! ఇదియే జగడమునకు హేతువు.

సర...ఇదియే యగుచో మన మీయన్నదమ్ముల విరోధమును మాన్పి యొండొరులలో ప్రేమ ఎందుకు కలిగించఁగూడదు? దానిచే నీ కాలమేఘము పిడుగుల వర్షింపక నీరై కురియునుగదా? దానిచే నీ యగ్ని సర్వమును దగ్ధము చేయక రెండు హృదయములను గరఁగించి యొకటిగా పోతపోయునుగదా?

కమలా...నే నీవిషయమై నీతో సంవాదించఁగోరుటలేదు. నానాథుని సంగతి నేనే తెలిసికొందును.

సర...సోదరీ! ఆయన నీకే నాథుఁడా? నా కేమియు కారా?

కమలా...అగుచో నీవే యాయనతో బోధించి చెప్పికొనుము. నాతో జగడమాడ నేల వచ్చితివి? (నిష్క్రమించును.)

సర...నేను ఆయనకు బోధించి చెప్పుదాననా? ఆహా! వారు ఒకప్పుడు నామాట వినెడురోజు నుండెడిది. కాని నీవు వచ్చినపిమ్మట వారిపై నేమి మచ్చు చల్లితివో, అది నీవే యెఱుఁగుదువు చెల్లెలా!

(జయసింహుఁడు ప్రవేశించును.)

జయ...ఎవరు? సరస్వతియా? కమల యనుకొంటిని.

సర...నిజముగా ననుకొంటిరా? ఇంత పొరపాటు చేసితిరా? కాని యా పొరపా టింతత్వరలో నేల తెలిసినది? పొరపాటని తెలియక ముందు నన్ను కమల యనుకొని ఒకమాఱు ప్రాణేశ్వరీ యని యేల పిలువ లేదు? పొరపాటుననే న న్నొక్కమాఱు పిలుచుచుంటి రను కొందునుగదా. పిదప ఆపొరపాటు తెలిసినను పొరపాటుగనే యొక క్షణముసేపు స్వర్గసుఖము ననుభవించుదానను గదా?

జయ...సరస్వతీ! నే నిపుడు పోవుచుంటిని. నా కొక తొందర పని యున్నది.

సర...కొంచె మాగుడు. నేను నాహృదయావేశమును దెలుపుట్టకై మిమ్ము నిలుపుట లేదు. పోయినది తిరిగిరాఁజాలదు. వినుఁడు. నే నొకమాట యడిగెదను. అన్నగారితో నేఁడు మరల జగడ మాడితిరా?

జయ...అందు నా తప్పేమి యున్నది?

సర...వారితప్పేనా?

జయ...నేను కోపావేశముచే నతనికాళ్ళపైఁ గత్తితోఁ గొట్టితిని. అతఁడు నామెడ పట్టుకొనినాఁడు.

సర...అగుచో నిందు వారిదోషమే నిశ్చయించితిరా? అసలు తమ రిట్టివారు కారు. చిన్నరాణి మిమ్ము యిన్ని ఆటలాడించుచున్నది. అన్నదమ్ము లిరువురు పోరాడరాదు! బావగారు మేవాడసింహాసనము

కోరుచుండిరని కమల చెప్పినచో అది పొరపాటు. బావగారు ఔదార్య ముగల యొక మహాపురుషుఁడు.

జయ—ఇంక నేను నీచుఁడను!—మంచిది.

సర—నే నట్లన లేదు. మీ చెవిని పరుషమాటలే నీచము లను చుంటిని. అవి మీహితము కోరి చెప్పినవి కావు. అవి మీకు సర్వనాశ మును చేయుచున్నవి. అదిగో! బావగారు వచ్చుచున్నారు. నేను పోవుచుంటిని. మీయందు మనుష్యత్వ మేమేని యున్నచో ఇప్పుడేని అన్నగారిని క్షమాపణ కోరుఁడు (నిష్క్రమించును.)

(భీమసింహుఁడు ప్రవేశించును.)

భీమ—(మృదువుగా) తమ్ముఁడా! జయసింహా!

(జయసింహుఁడు పలుకఁడు)

భీమ—తమ్ముఁడా! జయసింహా! నేనే తప్పుచేసితిని. నన్ను క్షమించుము.

(జయసింహుఁడు పలుకఁడు.)

భీమ—తమ్ముఁడా! చిన్నవాఁడ వగు నిన్ను క్షమించుట నా విధియే. కాని అప్పుడు కోపము నాపుకొనఁజాలకపోతిని. తమ్ముఁడా! నన్ను క్షమించుము.

(రాణా రాజసింహుఁడు ప్రవేశించును.)

రాణా—(భీమసింహునితో) ఏమి భీమసింహా! జయసింహుఁడు నిన్ను ఖడ్గముచేఁ గాయపఱచెనా?

భీమ—లేదు నాయనా! గాయము గొప్పది కాదు.

రాణా—నా కిది తెలియదు. దాది చెప్పినది. పిదప అచ్చట రక్తమును గాంచి నిజమనుకొంటిని. గాయ మెచ్చట? చూచెదను.

భీమ—పెద్దగాయము గాదు తండ్రీ!

రాణా—చూచెదను.

(భీమసింహుఁడు కుడికాలు చూపును.)

రాణా—(ఔరా! భీమా! కుమారా! నేను చూడకయే విచారించితిని. నా విచారణము న్యాయ్యము కాదు.) శిక్ష నీకు కాదు.

జయసింహునకే యొసఁగవలయును. ఇదిగో ఖడ్గము. తీసికొనుము. నాకుగా నీవే వీనిని శిక్షింపుము.

భీమ—లేదు తండ్రీ! అన్యాయము నేనే చేసితిని, జయసింహుఁడు పసివాఁడు

రాణా—కాదు. భీమసింహా! నేను అన్యాయము చేయఁజాలను. జనులు నేను జయసింహుని ప్రేమించెద ననుకొందురు. కావచ్చును కాని విచారణములో నేను న్యాయమే చేసెదను.

భీమ—నేను వానిని క్షమించెదను.

రాణా—కాదు భీమసింహా! శిక్షించుము. మఱియు నే నొక సంగతి చూచుచుంటిని. కొన్నిరోజులనుండి మీయుభయులకు నేలొకో పడుటలేదు. ముందుముందును మీ యీవైరము పోకపోవచ్చును. మీ రిద్దఱును రాజ్యమునకై యుద్ధముచేసెదరు. నేను చనినపిమ్మట ఇట్లగుటకన్న నేను జీవించియుండగనే ఈ యుద్ధము జరుగుట మంచిది. ఇందువలన రాజ్యమునకు హాని గలుగదు. ఇదిగో కత్తి. యుద్ధము చేయుము.

భీమ—తండ్రీ! నేను రాజ్యమునుగోరుట లేదు. రాజ్యమునకై నేను జయసింహునితోఁ బోరాడనని శపథము చేయుచున్నాను.

రాణా—దీనికి ప్రమాణము?

భీమ—నే నిప్పుడే యీరాజ్యమును విడిచిపోవుచుంటిని. ఈ రాజ్యము లోపల నీరు త్రావినను నేను మీపుత్రుఁడను గాను.

ఉ. అక్కఱ లేదు రాజ్యధన, మక్కఱ లేదిక దాయయుద్ధ మీ
క్రిక్కినకూటి కాసవడ; రమ్మని మీహుకు మందుదాక, నే
నిక్కడఁగాలువెట్ట, నిక నీపొలిమేఱను నీరు ద్రావ, నా
వాక్కుయథార్థ మా శశిదివాకరసాక్షిగ నమ్ము! భూపతీ.

రాణా—(కొంచెముసేపు నిస్తబ్ధుఁడై యుండి) భీమా! నేఁడు నీవు చాల కఠినప్రతిజ్ఞ చేసితివి. నీవు నిర్దోషుఁడవు. జయసింహుని దోషమునకై నీవు స్వదేశమునుండి జీవితాంతమువఱకు వెడలిపోవు చుంటివి. నేను పొరపాటున జయసింహుని చేతికి రక్షాసూత్రము గట్టి

తిని. రాజ్యక్షేమమునకై ఇప్పుడు నీవు రాజ్యము విడిచి పోవుటయే బాగుగ నున్నది. కాని భీమా! జ్ఞాపక ముంచుకొనుము. నీ వీస్వార్థత్యాగమును సామ్రాజ్యశుభచింతనచే చేయుచుంటివిగదా?

భీమ—నేను రాజ్యకల్యాణమునకై ప్రాణము లర్పింప సంసిద్ధుఁడను. నమస్కారము తండ్రీ! (జయసింహునితో) తమ్ముఁడా! ఆశీర్వాద మిచ్చుచుంటిని. విజయి, యశస్వివి కమ్ము.

(నిష్క్రమించును.)

రాణా—నాపుత్త్రుఁడవే యగుదువు. జయసింహా! వీరత్వమన నేమిటో చూడుము. నేర్చుకొనుము.

(ఒకప్రక్కనుండి రాణా, రెండవప్రక్కనుండి జయసింహుఁడును నిష్క్రమించెదరు.)

పంచమదృశ్యము.

స్థానము—ఢిల్లీలో యశోవంతసింహుని యింటి పంచపాళి.

సమయము—అపరాహ్ణము.

(సమరదాసును, జోధపురసామంతులును ఉద్రేకభావముతో నిలచియుందురు.)

విజయసింహుఁడు—(సమరదాసుతో) అగుచో నీవు మా యుద్దేశమును భంగపఱచివచ్చితివా?

సమర—కోపము నాపుకొనుటయు, కపటపుమాటలు చెప్పుటయు నేను నేర్చుకొననే లేదు.

ముకుందసింహుఁడు—ఇఁక నీ వచటికి ఏల వెళ్ళితివి?

సమర—నే నొకయుద్దేశముతో వెళ్ళితిని. ఆపాపిష్ఠనరపిశాచము నొక్కమాఱు ఎదుటఁబడి కన్నులారఁ జూడఁగోరితిని. నేను బాదుషాతో నేమియు విన్నవించుకొనుటకు పోలేదు. ఆ పని దుర్గాదాసు చేయును. నాయం దాకుశలత, ఆచతురత లేదు. నాకు సహాయకు లాభగవంతుఁడు, నీఖడ్గమే.

సుబలదాసు—సేనాపతి దర్బారునుండి ఇంక రాలేదేల?

విజయ—బాదుషా మోసముచేసి ఖైదుచేయలేదు కదా?

సమర—(గర్జించుచు) ఏమి? అదియు సంభవమే?

సుబల—ఎన్నటికిని కాదు. మన సేనాపతి యాలోచింపక ఏపనియు చేయఁడు.

ముకుంద—ఈదుర్దినములలో మనకతఁడొక్కఁడే యాధారము ఇదిగో తూర్యధ్వని—ఇదిగో సేనాపతి గుఱ్ఱమును వడిగా నడపించుచు వచ్చుచున్నాఁడు.

విజయ—అదిగో వచ్చినాఁడు. క్రిందకు నడవుఁడు. సమాచార మేమో విందము.

సుబల—తొందర యేల? సేనాపతి నిచటికే రానిండు.

(తెరలో దుర్గాదాసుమాట వినఁబడును.)

"సంసిద్ధులగుఁడు, సంసిద్ధులగుఁడు."

సమర—సంసిద్ధులా? దేనికి?

సుబల—అదిగో దుర్గాదాసు పైకే వచ్చెను.

(చెమట గాఱ్చుచు దుర్గాదాసు ప్రవేశించును.)

దుర్గా—అందఱు సంసిద్ధు లగుఁడు.

సమర—ఎందుకు?

దుర్గా—ఆత్మరక్షణమునకు.

విజయ—ఏమి సమాచారము? వినెదము.

దుర్గా—విస్తరించి చెప్పుట కిప్పుడు సమయము లేదు. యశోవంతసింహునిరాణిని బాదుషా విడువఁడు, అతఁ డామెను బట్టఁగోరుచున్నాఁడు. మహారాణిని, ఆమెబిడ్డలను రక్షింపవలయును.—ఇప్పుడే మొగలసైన్య మీయింటిని ముట్టడించును.

విజయ—ఇంక నుపాయ మేమి?

దుర్గా—ఒకటే ఉపాయము. మన మందఱము ప్రాణము లర్పించుటకు సిద్ధము కావలయును. సోదరులారా! మహారాణికై ప్రాణ మర్పించుట కెవ్వ రెవ్వరు సంసిద్ధులు?

అందఱు—మే మందఱము సంసిద్ధులమే.

దుర్గా—మనము కేవలము ప్రాణ మర్పించుట చాలదు. మహారాణిని, యీ పెబిడ్డలను సురక్షితస్థలమునకుఁ జేర్చవలెను.

(రాణి ప్రవేశించును.)

రాణి—(స్థిరస్వరముతో) యశోవంతసింహునిరాణి కేమియు భయము లేదు. ఆమెకై చింతింపకుఁడు. దుర్గాదాసూ! ఆమెపుత్రుని-యోధపురరాజకులదీపకుని--రక్షింపుఁడు. ఈ వంశమును నిలఁబెట్టుడు. రాణి కేమియు భయము లేదు. ఆమె మరణించుట యెఱుఁగును. పిల్లవానిని రక్షింపుము దుర్గాదాసూ!

దుర్గా—ఆవిషయమై ఏమియు లోపము చేయము---అమ్మా! అబ్బాయిని తీసికొనిరండు. (రాణి నిష్క్రమించును?

దుర్గా—విజయసింహా! కాసిమును పిలువుము.

(విజయసింహుఁడు నిష్క్రమించును.)

దుర్గా—సోదరా! బయట నొక మిఠాయిగంప నుంచితిని. దానిని తెమ్మ.

సమర—మిఠాయిగంపయా? ఎందుకు?

దుర్గా—సోదరా! తర్కించుట కిది సమయముగాదు. పొమ్మ, తీసికొనిరమ్మ. (సమరదాసు పోవును.)

దుర్గా—ముకుందదాసూ! ఇదిగో కాసిము వచ్చినాఁడు.

(విజయంసింహునివెంట కాసిము ప్రవేశించును.)

కాసిము—(దుర్గాదాసునకు సలాముచేసి) హుజూర్! ఏమిసెలవు?

దుర్గా—కాసిమ్! నీ వొకపని చేయవలయును. రాజకుమారుని రక్షింపవలయును. మొగలసైన్యము రాకొమరుని కొంపోవుట కిప్పుడే వచ్చును. నీ వతనిఁ గాపాడవలెను.

కాసిము—తమ సెలవుప్రకారము సంసిద్ధుఁడను.

(గంప తీసికొని సమరదాసు ప్రవేశించును.)

దుర్గా—నీ వీమిఠాయిగంపలో రాకొమరు నుంచుకొని పైన వస్త్రము గప్పి యీ దేవాలయమునకు దోడ్కొనిపొమ్ము. నీవు మహమ్మదీయుఁడవు. నీపై నెవ్వరికి ననుమాన ముండదు-- తెలిసెనా?

కాసిము—అయ్యా! ఈయన నెచ్చటకు గొంపోవలయును?

దుర్గా--అదిగో దూరముగా దేవాలయశిఖర మగపడుచున్నదా?

కాసిము—ఆఁ! అగపడుచున్నది.

దుర్గా—ఆ యాలయపుపూజారివద్ద రాకొమరుని డించిరమ్ము. తదుపరి కర్తవ్య మాతఁ డెఱుఁగును. మొగల సైన్యము వచ్చుచుండును. నీ విపుడే పొమ్ము.

కాసిము—మంచిది. అయ్యా! నేను రాకొమరునికై ప్రాణ మీవలసి వచ్చినను వెనుదీయను.

దుర్గా—అది నే నెఱుఁగుదును, కాసిమ్!—లేనిచో నీ కీపని చెప్పను.

(కుమారుని తీసికొని రాణి ప్రవేశించును.)

దుర్గా—మహారాణీ! కొమరుని కాసీముచేతి కిమ్ము. ఏమియు భయము లేదు, అమ్మా!— నేను చెప్పుచున్నాను.

రాణి—దుర్గాదాసూ ! నీవు చెప్పినచో నా కేమియు భయము లేదు. కాసిమ్ ! నీకును ధర్మము.

కాసిము—అమ్మా! ఏమియు భయము లేదు. నేను రాకొమరుని నాప్రాణముకంటె నెక్కుడుగాఁ జూచెదను.

(కాసిము రాణిచేతినుండి శిశువును దీసికొనును.)

రాణి—(మరల కాసిముచేతినుండి కొమరుని తీసికొని ముద్దు వెట్టుకొని గద్గదస్వరముతో) నాముద్దుబిడ్డా!

మ. అలకల్దిద్దుచు, వెచ్చనీళ్ల జలకం బాడించి, బాలిచ్చి, యు
యాలలం దూపుచుఁ బెంచి,చూచికొను భాగ్యం బా విధాత్రుండునా
యలికస్థాని లిఖింపలేదు సుకుమారా! సుందరాకార! ము
ద్దులతండ్రీ! నిను బాసి యెవ్విధి భరింతుస్ ప్రాణ మేకాకినై.

దుర్గా—ఈయుఁడు. ఇప్పుడు సమయము కాదు.

రాణి—(మరల ముద్దువెట్టుకొని కొమరుని కాసిమున కిచ్చి) ధర్మము సాక్షి కాసిమ్!

చ. సురలును, సిద్ధసాధ్యులును, సూర్యుఁడు, చంద్రుఁడు, దిక్కు, లశ్వినుల్కురువలి, యగ్ని,దిక్పతులు కంటికి తెప్పగఁగాచి తేబవ
ళ్లరయుచు నుందురిగాత! భవదన్వయ ధర్మతపఃఫలంబు, నీ
కురుతరభద్రహేతు వయి, యొాయుత! కూర్మి నజస్ర మాత్మజా

కాసిము—ధర్మమే సాక్షి తల్లీ! ఏమియు భయములేదు.

(శిశువును గంపలో నుంచి కాసిము తలపై పెట్టికొనును.)

నమర—దారిలో నెవరేని కాసిమును బట్టికొన్నచో?

రాణి...ఎవ్వరేని పట్టుకొన్నచో ఈకత్తితో కుమారుని గుండెలో పొడువుము. జీవితావస్థలో కొమరుని ఔరంగజేబువద్దకుఁ గొంపోవఁజాలరు (కత్తి ఇచ్చును)

దుర్గా...ఏమియు భయము లేదు, అమ్మా!-పొమ్ము కాసిమ్! ఈవెనుక ప్రక్కనున్న థొంగదరవాజానుండి పొమ్ము. రమ్ము దారి చూపెదను.

(గంప దీసికొని కాసిము నిష్క్రమించును. అతనివెంట దుర్గాదాసును, రాణియు పోవుదురు.)

విజయ...దుర్గాదాసూ! నీసమయస్ఫూర్తి చాల మెచ్చదగినది.

సుబల—ఈ యేర్పాటంతయు దుర్గాదాసు బాదుషావద్దకు వెళ్ళక పూర్వమే చేసియుంచెనని నా నమ్మకము.

ముకుంద—అదిగో! మొగలసైన్యము వచ్చుచున్నది.

విజయ—ఇది లెక్కకుమిాఱిన సేనగా నున్నది.

సుబల— సాక్షాత్తు సేనాపతి దిలేర్ఖాను వెంట వచ్చినాఁడు.

దుర్గా—(మరల ప్రవేశించి) ఇంక నేమియు విచారము లేదు. మొగలసైన్యము ముట్టడించినది. మీారు మరణించుటకు సిద్ధమగుడు.

విజయ—మఱి యాఁడువారు?

దుర్గా—వారికిని ఉపాయము చేయుచున్నాను. బాదుషావద్దకు వెళ్లక పూర్వమే యీవిషయ మెందు కాలోచింపలేదు?—సోదరా! స్త్రీలను చితు లెక్కడని చెప్పుము. (నమరదాసుపోవును.)

ముకుంద—అదిగో! చూడుము. మొగలసేన వచ్చినది.

విజయ—తుపాకులు పేలుచున్నవి.

సుబల—తలుపులు బ్రద్దలుచేయుచున్నారు.

ముకుంద—మంటలు వెట్టుచున్నారు బహుశః ఈ యింటికి నిప్పుపెట్టెదరు.

దుర్గా—ఇప్పుడు మనము స్త్రీల కేమియు నేర్పాటు చేయఁజాలము. సమయము లేదు.

(స్త్రీలతో సమరదాసు ప్రవేశించును)

దుర్గా—అమ్మలారా! సోదరీమణులారా! నేఁడు మీకు చాల కఠిన విధానము చేయవలసివచ్చినది. నేఁడు మీ రందఱును అగ్నికి ఆహుతి కావలసి యుండురు.

ఒకప్రౌఢస్త్రీ—ఇది మా కేమియు క్రొత్తసంగతిగాదు. సేనాపతీ! క్షత్రియాంగనలమగు మేము మరణించుట యెఱుఁగుదుము.

దుర్గా—అమ్మా వేఱొం డుపాయము లేదు. మేము చచ్చుటకు పోవుచుంటిమి. మీ రందఱును పొండు. ఈగదిలోనికి పొండు. ఈ గదిలో తుపాకిమందు నింపబడియున్నది. అందులో మీరు నిలిచి యుండుటకు మాత్రము చోటున్నది. మీరు మందుపైకిఁ బోయి నిలఁబడుఁడు. ఆ పైసంగతి యేమి చెప్పుదును. అమ్మా—

ఒకస్త్రీ—ఆపిదప మాచేతులతో మేము నిప్పు అంటించుకొందుము. అందఱు నడవుఁడు.

(తల విరియఁబోసికొని రాణి ప్రవేశించును.)

స్త్రీలు—మహారాణికి జయము.

రాణి—జయమా? నాకు జయము మృత్యువే. మరణించుటకు పోవుచుంటిరా? పొండు. స్వర్గమునకు పొండు. నేను నేఁడు మీతో రాఁజాలను. వీలగుచో నేఁడు నన్ను రక్షించుకొందును. నేను నిప్పుడే చావనెంచితిని. కాని దుర్గాదాసూ! నేనిప్పుడే చావను. ఆకాశమునుండి యెవ్వరో నాతో ఇంక సమయము రాలేదు నీకర్తవ్యమింక నున్నది అని చెప్పుచున్నట్లు లున్నది. నే నుండ వలయును. దుర్గాదాసూ! వల్లనుపడినచో నేఁ డొక్కరోజు నన్ను రక్షింపుము

(మోఁకటిలఁబడి చేతులు జోడించి) ఈశ్వరా! నేఁడు నన్నురక్షింపుము. (లేచి) ఆపిమ్మట--ఆపిమ్మట-- దేశములో నిప్పు నంటింతును. ఏడు సముద్రము లావ్వఁజాలని నిప్పు నంటించెదను.

దుర్గా—ప్రీ లగుచో మేము నేఁడు ప్రాణము లర్పించి మహారాణిని రక్షింతుము. అమ్మా! మీరు పొండు. కవాటము శత్రుపాదాహతిచే తునియలు గాఁగోరుచున్నది.

(రాణిదక్క తక్కినస్త్రీలు నిష్క్రమించెదరు.)

రాణి—అగుచో నడవుము. దుర్గాదాసూ! ఆగుము. నేను నాకూతుని తీసికొనివచ్చెదను. దానిని విడిచిపెట్టను, రొమ్మునకు గట్టుకొని తీసికొని పోదును. మీరు నడవుఁడు. (నిష్క్రమించును.)

దుర్గా—తమ్ముఁడా!

సమర—అన్నా!

దుర్గా—మరణించుటకు పోవుదము రమ్ము.

సమర—రమ్ము.

దుర్గా—కొంచె మాఁగుము. స్త్రీల యవసానము చూచి పోవుదము. (దూరముగా భయంకర శబ్దము వినఁబడును) సర్వము సమాప్తమైనది. ఇంక రమ్ము.

సమర—రమ్ము.

దుర్గా—తమ్ముఁడా! బహుశః ఇదియే అంతిమసమాగమము. రమ్ము ఒక్కమాఱు కౌఁగిలించుకొందము. (ఇద్దఱు కౌఁగిలించుకొందురు.)

(తెర వాలును)

షష్ఠదృశ్యము.

స్థానము—ఔరంగజేబు అంతఃపురము.

సమయము—ప్రాతఃకాలము.

(ఔరంగజేబు ఒంటరిగా పచారు చేయుచుండును)

ఔరంగ—ఏమి! యశోవంతసింహుని రాణి కేవల మిన్నూ ఱేఁబది రాజపుత్రుల సాయమున ఐదువేల మొగలసైనికుల వ్యూహ

మును ఛేదించుకొని వెడలిపోయెనా! ఆసైన్యమున కధిపతి సాక్షాత్తు దిలేర్ఖాను—ఇం దేదియో తప్పక రహస్య మున్నది. — దర్బార్

తెరలో—ఖుదావంద్!—

ఔరం—సేనాపతి దిలేర్ఖానును రప్పింపుము.

తెరలో—చిత్తము.

ఔరం—(తనలో) ఇప్పుడు నారాణి కేమొగముతో గనుపడుదును? అవమానముచే నాయొడలెల్ల దగ్ధమగుచున్నది.

(గులనారు తటాలున ప్రవేశించును.)

గుల—సమ్రాట్! నేను విన్నది నిజమేనా?

ఔరం—ఏమి వింటివి?

గుల—యశోవంతునిరాణి ఇన్నూరేబదిసైనికులసహాయముచే ఐదువేల మొగలులమధ్యనుండి వెడలిపోయినదా?

ఔరం—ఆఁ! ఔను.

గుల—నీవు, నీ యీసైన్యము, ఈ సేనాపతి, ఈ బలముచేతనే భరతఖండమును శాసింపఁదలకొంటివి?

ఔరం—ప్రియసీ—

గుల—రాజేంద్రా! ఇప్పుడు ప్రేమముద్దులు, ప్రేమలు అట్లుండుడు. నే నొక సాధారణవాంఛితమును దీర్చుడని చెప్పితిని. దానికి ఫలిత మిది.

ఔరం—యథాశక్తిని ప్రయత్నించితిని.

గుల—యథాశక్తిని ప్రయత్నించితివా? నీ శక్తి యింతియే? నీవు చెప్పెదవా— నేఁడు మొగలసామ్రాజ్యలక్ష్మి నీచేతిలోఁబడి ఇంత దుర్బల యయినది. ఒక్క-యాఁడుది—కేవల మిన్నూరేబది రాజపుత్రులను వెంట దీసికొని—భారతసార్వభౌముని రొమ్ముపై నొక్క-తన్ను తన్నిపోయినది—ఛీ! సిగ్గు!

ఔరం—(పలుకడు)

గుల—జోధపురపురాణి యిప్పు డెచట నున్నది?

ఔరం—బహుశః ఆమె రాణారాజసింహుని యాశ్రయమున మేవాడలో నుండును.

గుల—మేవాడపై దాడి వెడలుము. నాకు యశోవంతుని రాణియు కొమరుఁడును కావలెను.

ఔరం—గులనార్! ఈవిషయ మాలోచింపఁబడును.

గుల—ఆలోచనయా? మహారాణి గులనారు చెప్పినమాటయే ఔరంగజేబు చక్రవర్తికి ఆలోచనీయమా? వినుము. నాయొకమాట వినుము. యశోవంతునిరాణి నాయెదుట హాజరయి తీరవలయును. ఆమె స్వర్గమర్త్య పాతాళములలో నెచ్చటనేని యుండుగాక! నాకామె కావలయును. మేవాడపై దండెత్తుము.

ఔరం...రాణీ...

గుల...నే నేమియు వినను. మేవాడపైకి దండెత్తుము. (గులనారు గంభీరాభిమానభావముఁ జూపి వెడలిపోవును. ఔరంగజేబు ఇటునటు ఒంటరిగా తిరుగుచుండును.)

ఔరం...(తనలో) నా కీమాటపై నమ్మకము లేకున్నది. కేవల మిన్నూరేబది రాజపుత్రులైదువేల మొగలసైన్యమునుండి వెడలిపోయిరి. ఇందు తప్పక మోసమున్నది. కాని సేనాపతి దిలేర్ఖాను విశ్వాసఘాతము చేయునని ఎట్లు లనుకొందుము! నాకు బాల్యమిత్రుఁడు, యౌవనమున సహాయకుఁడు, వార్ధకమున మంత్రి యగు దిలేర్ఖాను నన్ను మోసముచేయునా! నేను విశ్వసింపజాలను. కాని ఇన్నూరేబది రాజపుత్రులు ఐదువేల మొగలసైన్యమును చీల్చుకొని వెడలిపోయిరి. మఱియు మొగల సేసాపతి ఉత్సాహి, నిర్భీకుఁడు, వీరశిఖామణియగు సాక్షాత్తు దిలేర్ఖాను! ఇది మాత్రమెట్లు నమ్ముదును? తప్పక యిందేదియో గూఢరహస్య మున్నది! అదిగో దిలేర్ఖాను వచ్చుచున్నాఁడు.

దిలే...(ప్రవేశించి) సలాము భారతచక్రవర్తీ!

ఔరం—దిలేర్ఖాన్! నిన్ను పిలువనంపినది యిది తెలిసికొనుటకే. నేను వినిన ఈవార్త నిజమా అసత్యమా?

దిలే...సామ్రాట్టు వినినది కేవలము సత్యము.

ఔరం... నన్ను మాట పూర్తిగాఁ జెప్పనిమ్ము... ఈవార్త నిజమా, అసత్యమా? కేవలము ఇన్నూరేఁబది రాజపుత్రులు ఐదు వేల మొగలులను జీల్చుకొని మధ్యగా వెడలిపోయి రఁట?

దిలే... ఆఁ... రాజేంద్రా! ఈమాట అక్షరశః సత్యము.

ఔరం—మఱియు నా సైన్యమునకు నాయకుఁడవు సాక్షాత్తు నీవేనా?

దిలే—అవును రాజేంద్రా!

ఔరం—యుద్ధము జరిగినదా?

దిలే—సార్వభౌమా! జరిగినది. ఈయుద్ధములో మనఐదువేల మొగలులకు దాదాపు ఐదువందలు మిగిలియుందురు. రాజపుత్రులలో నైదుగు రుందురు.

ఔరం—యశోవంతునిరాణి?

దిలే—ఆమె సర్దారులవెంట ఉదయపురమార్గమున వెళ్ళినది.

ఔరం—ఆమెపిల్లవాఁడు?

దిలే—పిల్లవాఁ డాసైన్యములో నగపడలేదు. రాజేంద్రా! మూఁడేండ్ల ప్రాయముగల యొకబాలికనుమాత్రము రాణి తనరొమ్మున గట్టుకొనెను.

ఔరం—మొగలసైన్యము మేకలమందకన్న తీసిపోయినదా! ఐదువేల యువకులు ఒకఆఁడుదాని నాపలేకపోయిరి! ఆమె వెంట కేవల మిన్నూరేఁబదిమాత్రమే సైన్యము.

దిలే—తెలియదు రాజేంద్రా! కాని యామె మొగలసైన్యమున కెదురుగ నిలిచియున్నపుడు ఆమెమొగముపై ముసుగులేదు. వెండ్రుకలు విరియఁబాఱియుండెను, రొమ్ముపై పిల్ల నిద్రించుచుండెను. అప్పు డామె యిన్నూరేఁబదిసైన్యమును లక్షగాఁ గనుపడసాగెను. మొగలసైన్యమను కాలమేఘపటలముపైనుండి యారాణి మెఱుపువలె వెడలిపోయెను. ఆమెను స్పృశించుట కేరికిని సాహసము లేకుండెను.

ఔరం—మఱి నీవు?

దిలే—నేను దూరమున నిలఁబడి యద్భుతమగు నా మాతృస్వరూపమును జూచితిని. "పట్టుకొనుఁడు యశోవంతుని రాణిని" యని పలుకఁబోతిని; కాని నోట మాట రాలేదు. కత్తి యెత్తఁబోతిని, అది లేవలేదు. పిస్తోలు దీసితిని, అది చేతినుండి పడిపోయెను.

ఔరం—దిలేర్ఖా! నీ కేమేని యున్మాదము గలిగెనా?

దిలే—అట్లే కావచ్చును. తెలియదు కాని యాక్షణమే నేను వేరొక మనుష్యుఁడ నయినట్లు తోఁచినది. నిమేషమాత్రములో ఎవఁడో నా హృదయద్వారముపై గుద్ది తలుపును తెఱచినట్లుండెను. నాకు నూతనజగత్తు కనుపట్టెను.

ఔరం—కనుకనే నీవు ఐదువేలసైన్యమును బెట్టుకొని రాతివలె నిలఁబడి చూచితివి?

దిలే—ఔను సార్వభౌమా! చూచితిని. అది యొక మహిమాపుంజమగు దృశ్యము! ఏమి యామహిమ! ఆశ్చర్యము! వెండ్రికలు విరియఁబోసికొనిన యామహిళ! రొమ్ముపై నిద్దురవోవుశిశువు! ఏమి యాదృశ్యము, రాజేంద్రా! ఆమాతృమూర్తి నిర్మేఘంబగు నుషఃకాలముకంటెను నిర్మలము; వీణాఝంకారము కంటెను శ్రావ్యము, ఈశ్వరనామముకంటెను పవిత్రము. నేను వజ్రాహతునివలె నట్లే నిలువబడితిని.

ఔరం—తర్వాత?

దిలే—ఆమూర్తి యంతర్ధానమైనపిదప నాకు స్మృతి కలిగినది. "పట్టుకొనుఁడు" అని బిగ్గరగ నఱచితిని. వెంటనే మా ఐదువేలకత్తులు ఆసాయంతనపు కనుచీఁకటిలో మిటమిట మెఱసెను. శత్రువులు మరల నిలువఁబడిరి. యుద్ధముసాగెను. భూకంపములో నిసుక దిబ్బలవలె మనుష్యులు నేలఁ గూలఁదొడఁగిరి. యుద్ధము ముగిసినపిదపఁ జూచితిని. మనపక్షమున ఐదువందల సైనికులు మిగిలి, శత్రుపక్షమున నొక్కఁడును లేడు. శవములలో దుర్గాదాసును, ఆతనితమ్ముఁడును గనుపడలేదు.

ఔరం—దిలేర్! నీకన్న అడుది నయము. పొమ్ము.
(ఒకవైపునుండి ఔరంగజేబు రెండవవైపునుండి దిలేర్ఖానును నిష్క్రమించెదరు.)

---

సప్తమ దృశ్యము.

స్థానము—రాణా రాజసింహుని ప్రాసాదబహిర్భాగము.

సమయము—అపరాహ్ణము.

(ఉన్నతాసనమున రాజసింహుడు కూర్చుండును. ఎదుట యశోవంతుని రాణి మహామాయ కొమరుని ఒడిలోఁబెట్టికొని మోకరిలఁబడి కూర్చుండును. కుడిప్రక్క దుర్గాదాసును కాసిమును నిలఁబడియుందురు.

రాణి—రాణాగారు! నా యీపిల్లవానికి తమదుర్గమున నాశ్రయ మొసఁగుడు. చాలదినములవఱకు వలదు; కొలఁదిదినములకే.

రాజ—మహామాయా! నీకొమరుఁడు నా కన్యుఁడు కాఁడు. రాజపుత్రుని రక్షణకై యింత చెప్పనేల?—దుర్గాదాసూ! ఔరంగజేబీ పసివాని యుసురులఁగూడ తీయఁగోరుచున్నాఁడా?

దుర్గా—లేనిచో నీతనిఁబట్టుకొనుట కేమి యుద్దేశము మహారాణా!

రాణి—రాణాగారు! ఒకకొడుకు ఒకకూతురు—కేవల మీ సొత్తుతోడనే నాఁడు ఢిల్లినుండి పయనమైతిని. బాలిక దారిలో చనిపోయినది. ఇప్పుడు నా సంపదలో మిగిలినది యీపసికూనయే. నాసర్వస్వమగు నీతని రక్షింపుఁడు. మహారాణా! ఈశ్వరుఁడు మీకు మేలు సేయును.

రాజ....పుత్రునికై చింతింపకుము. మహామాయా! నేను ప్రాణపణముగ నీతని గాపాడుదును.

రాణి—మహారాణాకు జయ మగుఁగాక!

రాజ...దుర్గాదాసూ! ఔరంగజేబుదురంతములు మితిమీఱుచున్నవి. అతఁడు హిందువులపై మరల జిజియాపన్ను నెలకొల్పుచున్నాఁడు. రెండవది మార్వాడప్రభువగు యశోవంతసింహుని కుటుం

బము పై నిట్టిదారుణకృత్యమా—కమ్మవ్రాసి చూచెదను. బహుశః ఆతఁడు మంచిత్రోవకు రాఁగలఁడేమో?

రాణి—కమ్మవ్రాసియా? బతిమాలి పామాలిరియా? మోకరించి భిక్ష యడిగియా? వలదు మహారాణా! వలదు, ఇప్పు డీయవన రాజన్యుని మొదలంటఁ బెఱికినగాని నాహృదయము చల్లపడదు.

, రాజ—కాదు మహామాయా! నెత్తురుటేఱులు ప్రవహింపక యీకార్యము నెఱవేఱదు. ఒకరాజ్యము నెలకొనియున్నపుడు దానిని పెకలింపఁదలచుట యన్యాయము. ఇందు వ్యర్థముగ వేలకొలఁది జనులు నశింతురు. ప్రజల కెక్కువకష్టములు గలుగును.

రాణి...మనదేశములో పరజాతివారి రాజ్యమును రక్షించుట యా? ఇది యే క్షత్రియధర్మము?

రాజ—క్షత్రియధర్మమన కేవలము హింసచేయుటయే కాదు, మహామాయా! హింసాపాండిత్య మొక గొప్పపాండిత్యము కాదు. ఆర్తరక్షణమునకుగాని, ఆత్మరక్షణమునకుగాని కాక యితరోద్దేశముతో చేయఁబడువధ హత్య యనఁబడును. (కాసిమును చూచి) ఈయన యెవరు?

దుర్గా... ఈయన కాసిముఉల్లా. నాపురాతనమిత్రుడు. ఈతఁడు తన ప్రాణములు సరకుగొనక మనరాజపుత్రుని రక్షించెను.

కాసిము—మహారాణా! నేను వీరిపురాతన సేవకుఁడను. ఒకమాఱు వీరు న న్నొకగొప్పయాపదనుండి రక్షించిరి. నాఁటినుండి నేను వీరి భృత్యుఁడ నైతిని.

రాజ—దుర్గాదాసూ! కాసిమును మహమ్మదీయుఁడే కాదు!

కాసిము ;... మహారాణా! మాజాతిని నిందింపకుఁడు. మాజాతి దుష్టముకాదు. మేము కావచ్చును. అయినను కృతఘ్నులము కాము.

రాజ- లేదు కాసిమ్! నేను మీజాతిని నిందించుటలేదు. బాదుషాతో నిన్ను సరిపోల్చుచుంటిని. బాదుషా ఈ పసివాని యుసురులఁ దీయనెంచెను.... ఇంక నీవు—

కాసిము...ఆహా! కొంచెము చూడుఁడు. ఎంతచక్కనిపిల్లఁడో! ఇంకఁ గన్నులు తెఱవలేదు. ఆహా! బాలుఁడు శీతోష్ణములకు చాలడస్సినాడు. నాబిడ్డా!...ఊఁ...ఇప్పుడు తేరపాఱిచూచుచున్నాడు. ఆహా! కన్నులా—నల్లకలువలు!

రాజ...ఔరంగజేబూ! నీవు ఢిల్లీసింహాసనమునఁ గూర్చుండి యొక నిరీహుఁడగు బాలకునిప్రాణములు దీయుటకై తత్తఱపడుచున్నావు. ఇఁక నీజాతిలోఁ బుట్టిన యీకాసిము వానికై ప్రాణములర్పించియు రక్షించుటకు సంసిద్ధుఁడైయున్నాడు. ఈశ్వరునిదృష్టి కెవరు గొప్ప ఔరంగజేబ్?

రాణి...మహారాణా! నే నీఘోరమగు నన్యాయమునకు ప్రతికృతి చేసెదను—ఇందులకే నాఁడు తోడియాఁడువారితో భస్మము కాలేదు. దీనికొఱకే ఇంతవఱకు జీవించియుంటిని—తాము కేవల మీబాలుని రక్షింపుఁడు.

రాజ—నేను మున్నె చెప్పితిని. వీనికై నీ వేమియు చింతింపకుము, మహామాయా! నీవు నీపిల్లవానితో నిచ్చట నిర్భయముగ నుండుము.

రాణి-కాదు మహారాణా! నే నిచ్చట నుండను. ఇది నాయిల్లు కాదు. నేను స్వర్గస్థుఁడగు నానాథునిరాజ్యమునకు మరలిపోదును. సంపత్తివిపత్తులందును, సుఖదుఃఖములందును, శాంతివిగ్రహములందును, జీవనమరణములందును నాథునిగృహమే స్త్రీ గృహము. పితృగృహము కాదు. నేను మార్వాడకు మరలిపోదును.

రాజ- కాని ఇపుడు నీ వచట నిర్భయముగ నుండఁజాలవమ్మా!

రాణి...నిర్భయముగనా? నేను నాకై నిర్భయస్థానమును వెదకికొని ఇచ్చటికి వచ్చితినా? కాదు రాణాగారూ! నేను దానిని వెదకుటలేదు. నే నిపు డాపదనే వెదకుచుంటిని, ఆపదుత్సంగముననే నేను పెరిగితిని. తుపానులో నాయిల్లు. ప్రళయమేఘములలో నాశయ్య. ఆపదయూ! ఆపదనే నేను నాసఖినిగా జేసికొంటిని, మహారాణా! ఇపుడు నా కింక నేమియాపద రాఁగలదు! పతి చంపఁబడె, పుత్రుఁడు

చంపఁబడె, సర్వస్వము హరింపఁబడె—ఇంక నాకేమి యాపద రాఁగ లదు? మహారాణా! ఒకయాపదవచ్చిన రావచ్చును. అది యీపుత్రుని హత్య. వీనినిరక్షింపుము! నేను మార్వాడకు పోదును. నిప్పు రగులు గొల్పెదను. నిప్పనిన నిప్పు! అందు ఔరంగజేబు లెక్క యేమి? మొగల సామ్రాజ్య మంతయు దగ్ధమై భస్మమై యెగిరిపోవును.

(తెర వాలును)

---

శ్రీ పరదేవతాయై నమః

# దు ర్గా దా సు

## ద్వితీయాంకము.

### ప్రథమదృశ్యము.

స్థానము—ఢిల్లీప్రాసాద బహిరుద్యానము.

సమయము—సంధ్యాకాలము.

(ఔరంగజేబుమనుమరాలు—అక్బరురాకొమరుని కూతురు—రజియా ఒంటరిగా నిటునటు తిరుగుచుండును.)

### గీతిక.

ఎక్కడకో దినమణి! నీ
అక్కడకే గొంపోవు నన్ను
ఎవ్వరుండు రీజగంబున,
ఎవ్వరున్న నుందురు నే
బ్రిదుకుకై సుఖ మనువారలు
ఎద నాశాతుంబిసి బం
జగతిని జీవించుదనుక
ముగియుఁగ నాసుఖసమయము,

వేగద వీగరిమను గొని
నరిగెద నీవెంట నిపుడె||
నిటుల చీకటులు బర్వక
నింక నుండఁజాల నిచట||
వననిధిఁ దూపానునడుమ
ధించుకపడియుందురుగాఁగ||
సౌఖ్యంబునఁ జెలఁగుదు నిఁక
పోదును సర్వము త్యజించి||

(దగ్గఱ నొక పొగడచెట్టుపై కోయిల కూయును. రజియా దాని నేకాగ్ర భావముతో వినును. ఈసమయమున గులవారు ప్రవేశించును.)

గుల... రజియా!

రజియా—మాఁడాడకు—కోయిల కూయుచున్నది.

గుల...ఎంత పిచ్చిపిల్లవు!—కోయిలకూఁత నెప్పుడును విన లేదు?

రజియా—విన కేమి? వింటిని. అందుకని మరలవినఁగూడదా? ఇదిగో విను! మరల... ఊరకున్నది. ఏమి అమ్మీజాన్! ఈ ప్రపంచ మెప్పటికి తెంపులేని యొక రాగాలాప మగుచో బాగుగ నుండును గదా?

గుల—బాగుగ నుండునా! ఇట్లే యగుచో నింక ప్రాణములు దక్కునా? ఒక్కమాటయేని చెప్పుట కవకాశ ముండదు.

రజియా—మాట!—మాటకే యింత యగుచో నింక దానిని తెలిసికొనుట మఱియును గష్టము. ప్రతిమాటకును దాని వెంటనే యర్థ ముండును. అర్థము లేకుండ రెండడుగులును సాగుట యసంభ వము. మాటవెంటనే యర్థములు తిరుగుచుండును.

గుల—ఇంక సంగీతము?

రజియా—అర్థము చెప్పుట—తెలిసికొనుట చాల కఠినము. అది కేవలము మనస్సులో నొకవైరాగ్యమును గలిగించును. దానిని తెలిసికొనుట సులభముకాదు. ఎట్లన మల్లెలు, మొల్లలు, సంపెంగ, జాజులు, దీనియర్థము బాగుఁగ దెలియుచున్నది. అగునా? మల్లె, మొల్ల, సంపెఁగ, జాజి, ఇవి నాలుగు పుష్పములు. కాని (స్వరము మార్చి) "మల్లెలు, మొల్లలు, సంపెఁగ, జాజులు"-దీనికర్థము చెప్పుము.

గుల—నిశ్చయము—దీని కర్థము చెప్పుట కష్టము, చాల మంచియాలాపము.

రజియా—అమ్మీజాన్! నీకు గాన మన నేమియు నిష్టము లేదు. నాకు తెలియును. కాని నేను గానమున లీనమగుచుంటిని. (స్వరములో గొణుగుకొని) "మల్లెలు, మొల్లలు, సంపెఁగ, జాజులు"

గుల... రజియా! నీవు సంగీత మెచట నభ్యసించితివి?

రజియా...నాయనగారి గురునియొద్ద; నాయనగారికి సంగీతమనిన చాలప్రియము. వారు స్వయముగ కొన్ని కీర్తనలుకూడ వ్రాసిరి గురువులు వాని స్వరములు సరిచేసిరి. నే నిప్పుడే వారు రచించిన యొక కీర్తన పాడుచుంటిని. దాని రాగము పూరికల్యాణి. చాల మంచి రాగము. (అస్వరముతో) "తారేనా తోంతోంతోం నాదేరే తోం" వహ్వా! యెంతమధుర రాగము!

గుల...మురబ్బాకన్న మధురమా?

రజియా...నీవు వట్టి మృగమవు. గార్ధభమున కున్నంత స్వరజ్ఞానము కూడ నీకు లేదు. (మంచిది.) అమ్మీజాన్! ఈగాడిద లెట్టి యపస్వరముగా నోండ్రపెట్టును! క్రింది గాంధారమునుండి యొక్కమాటుగ పై కోమల ఋషభమునకు పరుగెత్తును.

గుల...కావచ్చును.

రజియా...అమ్మీజాన్! కోకిలస్వర మంత మధురముగను, కాకస్వర మంత కర్కశముగను ఏల యుండును? నాయుద్దేశము కోకిలస్వరమునుండియే సంగీతము పుట్టినది. సా, రీ, గా, మా, పా,-- సరిగా కోకిలస్వరము--ఇది వినుము--కు, కు, కూ, కూ, కూ.--సరిగా కోకిల స్వరము.

గుల...మీ బంగాలా దేశములో సంగీతప్రచారము బాగుగ కలదు కాబోలు.

రజియా—అవును. కాని బంగాళీయులు కీర్తనల నెక్కువ పాడుదురు. నే నొక కీర్తన నేర్చుకొంటిని- వినెదవా? వినుము--

బంధుయాకి ఆరకహి బలమి!
జీవనేమరనే, జనమేజనమే, ప్రాణనాధ హై యోతుమి!
తోమార చరనే అమారపరానే లాగిలప్రేమేరఫాంసి,
మనప్రాణదియే సబసమర్పియే నిశ్చయహా ఈనూదాసీ!
ఏకులే ఓకులే దుకులే గోకులే కే ఆరఅమార ఆఛే
రాధా బోలే ఆరకుధా ఇలేనామ, దాంరాబే అమారకాఛే!!

ఆపైన జ్ఞాపకము లేదు--బాగుగనున్నది! -- ఏమి? -- మంచిది, అమ్మీజాన్! తాతగారు సంగీతమనిన నంత కోపించెద రేల? -- వారు నన్ను చాల ప్రేమించెదరు. కాని యెప్పుడేని రాగ మెత్తినచో నావంక చూచి "ఆఁ" యని తల పంకించెదరు.

గుల...నీతాతగారు నిన్ను బాగుగఁ బ్రేమించెదరా?

రజియా...ఆఁ! చాల ప్రేమించెదరు. (స్వరముతో) "బంధుయా నిన్ను ప్రేమించెదరా?

గుల...నన్నా?--కొంచెము నీతాతగారి నడిగి చూడుము.

రజియా...(స్వరముతో) "కిఅరకహాబఆమి--" నీవు చెప్పినదే చేయుదురా?

గుల...చేయ కేమి? నీ వెఱుఁగవా, నానిమిత్త మొకయుద్ధమునే తలపెట్టిరి.

రజియా...యుద్ధమా?--యుద్ధమన నేమి అమ్మీజాన్?

గుల---పోరాటము.

రజియా...ఆఁ తెలిసినది. ఇద్దఱుమనుష్యులు కత్తులను దీసికొని యెదురుగ నిలబడుదురు. పిమ్మట ఇద్దఱును కోలాటము వేయుచు వాద్యములలయ ననుసరించి నాట్యముచేయుచు తిరుగుచుందురు. నేను ఈతమాషా బంగాళములో చూచితిని. యుద్ధ మెవ్వరితో అమ్మీజాన్?

గుల---మేవాడతో.

రజియా...మేవాడ పురుషుఁడా, స్త్రీయా?

గుల...పొమ్ము పిచ్చిపిల్లా!---మేవాడ యొక దేశము.

రజియా---బాబో! ఒక దేశముతో యుద్ధ మగునా! ఎందులకు అమ్మీజాన్! యుద్ధ మెందుకు?

గుల---ఒకరాణిని పట్టితెచ్చుటకై.

రజియా---నీవు తాతగారితో నిదియే చెప్పితివా?

గుల---ఆఁ.

రజియా...ఆరాణిని పట్టితెప్పించుకొని ఏమిచేసెదవు? ఆమెను ప్రేమించెదవా?

గుల—గోలఁ బెట్టించెదను.

రజియా—బ్రతికియుండగనే? చచ్చినపిమ్మట నట్లు చేసెదరని వింటిని. అరుగో! తాతగారు, నాయనగారు వచ్చుచున్నారు. ఒక తమాషా చూచెదవా?

(ఔరంగజేబు - అక్బరు - ప్రవేశించెదరు.)

రజియా...(స్వరముతో) "బంధుయా"

ఔరం...ఆఁ...రజియా! మఱల!

రజియా... ఇదిగో వినుము అమ్మీజాన్! హాహాహా...

(నవ్వుచు పారిపోవును.)

ఔరం—అక్బర్! రాజకార్యములు నేర్చుకొనుటకై నిన్ను బంగాళాదేశము నంపితిని. కాని నీవు నృత్యగీతములందు మునిగిపోతివి. తుదకీ పిల్లకుకూడ సంగీతము నేర్పితివి!--నీ విట్టు లయోగ్యుఁడవగుదు వనుకొనలేదు.

గుల—నిజము. సంగీతముదక్క వేఱుమాటయే లేదు. రాత్రి పగలు గొణుగుచునే యుండును, ప్రాణాలు తీయుచున్నది.

ఔరం—దానిజీవితము పాడుచేయుచుంటివి. మంచిది, ఈ విషయ మాలోచించెద. అక్బరు! నీ విపుడు మేవాడపైకి యుద్ధమునకు పొమ్ము. నీ యధీనముగ ఏఁబదివేల సైన్యమును పంపుచుంటిని. మేవాడపై దాడి వెడలుము.

అక్బరు—చిత్తము.

ఔరం—నీవు వట్టి యలసుఁడవు, విలాసివి, భోగివి అయితివని వింటిని. నీకు కొంచెము సంసారకష్టసుఖములు తెలియవలసియున్నది. నిన్ను కేవలము మేవాడపై యుద్ధమునకుఁ బంపుటకే పిలిపించలేదు. నిన్ను సంస్కరించుటకే ముఖ్యముగఁ బిలిపించితిని. పొమ్ము. సంసిద్ధుఁడవు కమ్ము. నీకు సాయమునకై సేనాపతియగు దిలేర్ఖానును నీవెంట పంపుచుంటిని. నేను, ఆజిము దోవారీలో నీవిజయము నిరీక్షించుచుందుము—పొమ్ము.

(అక్బరు మౌనముగ నిష్క్రమించును.)

ఔరం—గులనార్! నీ కోరిక తీర్చుటకై నే నొక గొప్ప యుద్ధము తలపెట్టితిని.

గుల—గొప్ప యుద్ధము!—ఒక చిన్న దేశమగు మేవాడతో తలపడుట చాల పెద్దయుద్ధము!--భారతసార్వభౌమున కిది యొక సామాన్యవిషయ మనుకొంటిని.

ఔరం—బేగమ్! నీ వట్లు తలంచుట పొరపాటు. ఏనాఁడు ఇన్నూరేఁబది రాజపుత్రులు ఐదువేల మొగలసైన్యమును నలగఁగొట్టుకొనిపోయిరో నాఁడే నే నీరాపుత్రజాతి అసమసాహసము కల దని గుర్తించితిని. కనుకనే నే నీయుద్ధమునకై బంగాలాదేశమునుండి ఆజిమును బిలిపించితిని. మేవాడను జయించుట సహజమైన పనిగాదు.

గుల—నేను మేవాడను జయింపవలెనని కోరుట లేదు. నేను యశోవంతునిరాణిని గోరుచుంటిని. ఇంక నేమియు నక్కఱలేదు. ఆమెతో నొక్కమాఱు కలియఁగోరితిని.

ఔరం—ఈమాఱు తప్పక కలిసికొందువు. లోపలికి, బొమ్ము గులనార్! వాన కురియుచున్నది. (ఇద్దరు నిష్క్రమించెదరు)



ద్వితీయ దృశ్యము.

స్థానము—ఆబూపర్వతదుర్గము.

సమయము—మధ్యాహ్నము.

(దుర్గాదాసును, శివసింహుఁడు, ముకుందసింహుఁడు, అను ఇద్దరు రాఠోరు సామంతులును నిలిచి యుందురు.)

దుర్గా—శివసింహా! రాకొమరుని మీ యిరువురకు నప్పగించి పోవుచుంటిని. ఈచోటి చ్చట నున్నదనికూడ ఎవరికిని దెలియఁ గూడదు.

ఇద్దరు—అటులే యుంచెదము సేనాపతీ!

దుర్గా—బాదుషా చాల గొప్పసైన్యముమ దీసికొని మేవాడపై దండెత్తినాఁడు, రాకొమరుఁ డిపుడు ఉదయపురములో నుండుట సరికాదని రాణాగారి వనుపున నిటఁకు దోడి తెచ్చితిని.

ముకుంద—బాదుషా మేవాడపై కెందుకు దండెత్తెను?

దుర్గా—మేవాడ యోధపురరాజ్ఞికిని, ఆపెపుత్రునకును ఆశ్రయ మిచ్చెను. ఇదియే ముఖ్యకారణము. మఱియు ఔరంగజేబు దురాచారములను—విశేషించి హిందువులపై జిజియాపన్ను వేయుటను—ఖండించుచు రాణా యొక జాబు వ్రాసెను. అదియు నొకకారణము. కాని యది యొక నెపము. ఆవ్రాతలో ఉద్రేకము, నిర్భయత కనంబడుచున్నను అందు పవిత్ర, సరలత్వము బాగుగ నున్నవి. అందు బాదుషా కోపించుట కేమియు హేతువు లేదు. నే నాజాబు చదివితిని.

శివ—మీ రీయుద్ధమునకుఁ బోయెదరా?

దుర్గా—నాప్రభున కాశ్రయ మిచ్చుటయే ఈయుద్ధమునకు గారణము. కాన నే నిచట నిశ్చింతముగఁ గూర్చుండుట తగదు. శివసింహా! మీ రుభయులు నీదుర్గములో నుండుడు. ఇచటనుండి మీ రెక్కడకును బోకుఁడు. ఈదుర్గము చాల సురక్షితమైనది. ఐనను దీని కాపునకై రెండువందల సిపాయిలను ఇట విడచి పోవుచుంటిని. ఏమేని ముప్పు గలుగునని తోఁచినచో నాకు వెంటనే కబు రంపుడు.

ముకుంద—బాదుషా మేవాడయుద్ధమునకు పయన మయ్యెనా?

దుర్గా—ఆఁ, బాదుషాసైన్యము మిడుతల దండువలె మేవాడ రాజ్యము నావరించినది. చిత్తోరు, మాండలగఢ్, మందసూర్, జీడర్ దుర్గములు బాదుషాకు వశమయినవి. రాణా తనయావత్సైన్యమును పర్వతప్రదేశమునకుఁ గొంపోయిరి.

శివ—మన మహారాణి యెచ్చట నున్నది?

దుర్గా—మార్వాడలో. ఆమె సేనాపతియగు గోపీనాధుని నాయకత్వమున పదివేలరాతౌరుసైన్యమును మేవాడకు పంపినది. స్వయముగ నింకను సైన్యమును పోగుచేసి తనవెంట తీసికొని వచ్చుచున్నది. మంచిది. మీరు పోయి భోజనాదికమును కానిండు.

(ముకుందసింహ శివసింహులు నిష్క్రమించెదరు.)

దుర్గా—(తనలో) నేఁడు గుప్పెడురాజపుత్రసైన్యమును దీసికొని మొగలసేనాసముద్రమున ఉఱుకుచుంటిని. దీనిపర్యవసాన మీశ్వరునికే యెఱుక. నేఁడు మేవాడయు, మార్వాడయు కలసి, ప్రాణముల

లక్ష్యము చేయక, ఈయుద్ధమునకు సిద్ధముగ నున్నవి. ఇదియే యొక యాశగా నున్నది. నలుప్రక్కల నావరించిన గాఢమేఘాంధకారమున ఈమాత్రము క్షీణజ్యోతిర్రేఖయే కనపట్టుచున్నది. దీనికి తోడు ఒక్కమాఱు మహారాష్ట్రశక్తికూడ సాయపడినచో, ఈ చిందఱ వందఱయగు హిందువుల శక్తి యొక్కమాఱు ఏకత్రితమగుచో, ఆహా! ఎంత అద్భుతజాతి! ముప్పదినంవత్సరముల మధ్య నొక గొప్ప జాతి యుద్భవిల్లినది.

(కాసిము ప్రవేశించును!)

దుర్గా—ఏమి కాసిమ్! రాజకుమారుఁ డెచ్చట?

కాశిము... ఇంతదనుక నాతో ఆడుకొని యిపుడే నిద్దురవోయి నాఁడు. దాదియొద్ద విడిచివచ్చితిని. ఇంక స్నానభోజనములు నిర్వర్తించుకొందునా?

దుర్గా—ఆఁ పొమ్ము. స్నానాదికము కానిమ్ము. వేళయైనది.

కాసిము—మీరు స్నానభోజనములు చేయరా?

దుర్గా—ఉఁహూ. నేఁడు ఒడలు బాగుగ లేదు.

కాసిము... ఇదిగో! ఇదియే మీయందు దోషము. లేనిచో మీరు మంచివారే.

దుర్గా—అవును, ఇది నాయందు దోషమే.

కాసిము—నా బీబీయందు నిదియే దోషము. ఈవేళ దగ్గు, రేపు జ్వరము, ఎల్లుండి శూల. కాని నా కిది పనికిరాదు. జ్వరము వచ్చిన రానిండు. దుక్కవలె నుందును. తినెదను. తిరిగెదను. బాగుగా పని చేసెదను.

దుర్గా—నీ భార్య యేల చనిపోయినది కాసిమ్?

కాసిము—అరే! ఎవ్వ రెఱుఁగుదురు. ఒకనాఁడు ప్రొద్దున లేచి చూచు సరికి చచ్చిపడియున్నది. గుండెజబ్బని వైద్యు లనినారు.

దుర్గా—మఱి నీ కొమరుఁడు?

కాసిము—నాకొమరుని సంగతి యడుగకుఁడు. బాబూ! వాడు మిక్కిలి సుందరుఁడును, దృఢగాత్రుఁడును, వానిఁ జూచిన ఆఁకలిఁ

దప్పిక పోవుచుండెడివి. వానినడక యంధకారమున దీపము వలెను, మాట వంశీనినాదమువలెను, నవ్వు నదీతరంగమువలెను గనుపట్టు చుండెడివి. సరిగా మన రాకొమరునివలె నుండువాఁడు. రంగుమాత్ర మంతపసిమి కాదు. ఒకరోజున నేను పనినుండి ఇంటికి వచ్చుచూచు సరికి ఒడలినిండ సిరా కుమ్మరించినట్టు లుండెను. ఏమని యడిగితిని. జవాబు రాలేదు. పినతల్లిని పిలిచితిని. ఆమె చూచి యేడువసాగెను. వైద్యుని పిలువగా నతఁడు తల యూఁగించిపోయెను.

దుర్గా—ఏ మయియుండును ?

కాసిము—అదియే తెలియదు. అటుపిమ్మట దేశములో నొక జబ్బు వ్యాపించెను. జనులు దానిని కాలజ్వర మనిరి. వెంటవెంటనే జనులు చావసాగిరి. దురదృష్టముచే నేను జీవించితిని. (కాసిము కన్నీళ్ళు తుడుచుకొనును.)

దుర్గా—ప్రపంచమున కిదియే నియమము కాసిమ్!—నీ వేమి చేసెదవు? పొమ్ము. స్నానాదికము కానిమ్ము.

కాసిము—ఇదే పోవుచుంటిని. (నిష్క్రమించును.)

దుర్గా—ఈమహమ్మదీయునితో మాఁడలాడుటచే మనస్సు పవిత్రమగును. సరలమార్గమున నడచుట సులభమగును. ఈశ్వరభక్తి హెచ్చును.



## తృతీయదృశ్యము.



స్థానము—జయసింహునిభార్య కమలాదేవి శయ్యాగృహాంగణము. సమయము—రాత్రి.

(కమల గోడనానుకొని, కూర్చుండును. ఆమెమొగముపై వెన్నెలకాంతి పడు చుండును. నాతిదూరమున జయసింహుఁడు చేతఁ గపోల ముంచుకొని సగము వరుండి కమలవంక తెప్పయార్పక చూచుచుండును.)

జయ—ఎంత చక్కనిరాత్రి కమలా!

కమలా—చాలచక్కనిది. చాలచక్కనిది. చాలచక్కనిది. ఇదిగో ముమ్మాఱు చెప్పితిని.

జయ—ప్రియా!

కమలా—ప్రియతమా! ప్రాణేశ్వరా!

జయ-ఊఁహూఁ. నే నేమియు చెప్పునది లేదు. నీ విటులే కూర్చుండుము. నేను కన్నులతో నీసౌందర్యమును గ్రోలెదను.

కమలా—చూడు. అంతయు నొక్కగుక్కలోనే త్రాగకుడు. నాకును కొంచె ముంచుడు.

జయ—కమలా! సౌందర్యము తప్పక మద్యమే. కానిచో చూచుచు చూచుచు నుండగనే ఈమైక మెట్లు కల్గును? అంగము లెల్ల యేల శిథిలమగును? కన్ను లేల మూఁతపడును?

కమలా—మాసితి యిటులే యున్నదికాబోలు! కాని నాకు కేవలము దీనికి విపరీతముగా నున్నది. మిమ్ము చూడగనే నామైకము పోవుచున్నది.

జయ—అగుచో నీవు నన్ను ప్రేమించుట లేదు.

కమలా—(క్రేగంటితో) ప్రేమించుట లేదా?-మంచిది. అటులే ప్రేమించుట లేదు.

జయ—ప్రేమించుచుంటివి కాఁబోలు. కాని నే నేవిధమున శరీరమందలి రోమ రోమముననను, హృదయమందలి ప్రతిరక్తబిందువునను, సంపూర్ణహృదయావేశముననను, ఇహలోకము--పరలోకము సమస్తము నిన్నుగా భావించి ప్రేమించుచుంటినో—నీవా విధమున ప్రేమించుచుంటివా?

కమలా—ఆఁ. ప్రేమించుచుంటిని. కాని నా కీరితి కవిత్వము చేతగాదు.

జయ—కాదు కమలా! నీ కింత సహృదయత్వము లేదు.

కమలా—లేకపోవచ్చును. కాని ముక్కున త్రాడువోసి నిన్నాడించుచుంటిని కదా.

జయ—ఆఁ, ఆడించుచుంటివి. ప్రేయసీ! నిన్ను పెండ్లియాడినది మొదలీ విశ్వమును నూతనభావముతో చూచుచుంటిని.

కమలా...ఏమి!...చూచుచుంటిరా?

జయ—ఆఁ చూచుచుంటిని... ఒక అవిశ్రాంతమగు ఝంకారమునుబలె, ఒక అనంతవిశ్రాంతినివలె ఒక అసీమమోహామునఁబడిన వానివలె-సగము నిద్దురయు, మెలఁకువయు కలవానివలె—

కమలా—నల్లమందు తినుటచేతను బోలె. అగునా? నేను నా దాదివలన వింటిని.

జయ—నేను ఆ నాస్థితిని తెలుపఁజాలను. ఒక ఆకాంక్షవలె నుండును. కాని యది యేమి యాకాంక్షయో తెలియదు. చిఱునగవు పెదవులపై మొలకలెత్తును. కాని కనుపింపదు. ఎటులన, ఒక గానాలాపము పైకి పోయిపోయి లీనమగునటుల, ఒకవిధమగు బాధారహితమగు సుఖస్వప్నమువోలె, అగాధమగు సౌందర్యమువోలె, అనంతమగు తృప్తివోలె...

కమల—పెద్దరాణియందు నిటులేనా? అదిగో పేరెత్తఁగనే పెద్దరాణి ప్రత్యక్షమైనది.

(సరస్వతి ప్రవేశించును.)

సర—మీరిచ్చటనుంటిరా స్వామీ? మీకై నేను చాలసేపు నుండి వెదకుచున్నాను,

జయ—ఎందుకు సరస్వతీ?

కమల—ఇంక మీరు పెద్దరాణితో మాటలాడుడు. నేను పోవుచుంటిని. (నిష్క్రమించును.)

జయ—వద్దు! వెళ్లవద్దు. వినుము! (లేచి నిలఁబడును.)

సర—నాథా! నేను మీసుఖమునకు భంగము కలిగింపరాలేదు. కొంచెము ఆవశ్యకకార్య ముండి వచ్చితిని.

జయ—ఏమి యాకార్యము?

సర—పతి పడఁతి నడుగఁదగిన ప్రశ్న ఇదియే నాథా? మంచిది, ఆసంగతి యటు లుంచుడు. నే నిపుడు బలాత్కారముగ మీచే ప్రేమింపఁబడుటకు రాలేదు. వాస్తవమునకు కమలకువలె నాకును దానియం దధికారము కలదు. పోనిండు, పోయిన దేదో పోయినది.

జయ—ఏమి యాపని?

సర—అంత తొందరయా? మంచిది. వినుఁడు. మొగలులు మేవాడపైకి దాడివెడలిరి. ఎఱుఁగుదురా?

జయ—లేదు.

సర—అగుచో మీ తండ్రిగారు మీకీవార్త తెలుపఁబనిలే దనుకొనిరి.

జయ—ఆలోచన గలపనియే చేసిరి.

సర—వారీయుద్ధములో పాలుగొనుటకు తమ జ్యేష్ఠపుత్రుని జోధపురమునుండి పిలిపించిరి.

జయ—మంచిది. తర్వాత?

సర—ఇది వినిన మీకు సిగ్గగుటలేదా? మీరు క్షత్రియులరు, రాజపుత్రులరు, మేవాడకు రాణా కాఁబోవువారలు! రాణాగారు మీకు మేవాడయుద్ధపుకబురే పంపలేదు. ఇంక పెద్దకొమరుని దూరస్థమగు యోధపురమునుండి పిలిపించిరి. దీనిచే నేమి విదితమగుచున్నది స్వామీ?

జయ—ఏమి విదితమగుచున్నది?

సర—దీనిచే రాణాగారు మిమ్ము పిరికివారుగను, అయోగ్యునిగను తెలిసికొనిరని విదితమగుచున్నది. యోధపురమునుండి దుర్గాదాసును, రూపనగరమునుండి విక్రమసోలంకి, రాఠోరువీరుఁడు గోపీనాథుఁడు—అందఱును మేవాడకు సహాయార్థమై వచ్చియున్నారు. వారందఱును ఇపుడు రాణాగారి యాలోచన భవనమున నున్నారు. ఇంక మీరు మేవాడకు రాణా కాఁబోవు వార లయ్యు విలాసమందిరమునఁ గూర్చుండి ప్రేమస్వప్నము గాంచుచుండిరి, వినిన సిగ్గగుట లేదా? రక్తమున ఆవేశము గలుగుట లేదా? ఆత్మధిక్కరణమున కిచ్చవొడముట లేదా? ఏమి! యూరకుంటిరి?

జయ—అంతయు నెఱుఁగుదును. కాని సరస్వతీ!—ఎవ్వరో నాయుద్వేగము నణచినట్టులును, ఆఁడు దానికన్న నన్నధమునిగాఁ జేసినట్టులును ఐతిని.

సర— ఈ మాత్రము జ్ఞానమేని మీయందు మిగిలియున్నచో ఇప్పటికేని ఆశ యున్నది స్వామీ! మీరు కమలను ప్రేమింపుఁడు. ఇది తప్పుకాదు—కాని విజాతీయశత్రుసైన్యములు దేశమును ముట్టడించి నపుడు, శత్రువులు తలవాకిట నిలిచియున్నపుడు, కఠోరకర్తవ్య మెదుటఁ గన్పట్టునపుడు కాంతాధరామృతపానమున కాలము గడుపుట క్షత్రియోచితమైన పని కాదు.

జయ ... సత్యము సరస్వతీ! నీవు మొదటినుండియు ఉచితమును, సత్యమును, నీతిసంగతము నగుమాటలనే చెప్పుచు వచ్చుచుంటివి— కాని నేనే వినగోరుట లేదు. కర్తవ్యమార్గము నెఱుఁగుదును. కాని యామార్గమున నడువఁజాలను.

సర ... కర్తవ్యమార్గము నెఱుఁగుచో లెండు. ఒక్కమాఱు ప్రాణ పణముగ ప్రయత్నించి ఈ విలాసిత్వమును చినిగినప్రేఁతవలువను బోలె హృదయమునుండి తొలఁగింపుడు స్వామీ! కర్తవ్యపథ మున నడుచుట సహజముగఁ గన్పట్టును. నామాట విని యొక్కమాఱు కర్తవ్యమువైపునకు నడువుడు. అది చేతులు సాచి మిమ్ము తనవైపునకు లాగికొనును. అది మిమ్ము తనయావరణములోనుంచి రక్షించును. కర్తవ్యము మీ రనుకొనినంత కఠినమైనదికాదు. ఒకమాఱు సాహసము చేసి ప్రయత్నపూర్వకముగ లేచి మీ కాళ్ళపై నిలఁబడుడు స్వామీ!

జయ—నీవు బాగుగఁజెప్పుచుంటివి సరస్వతీ! మంచిది. ఒక్క మాఱు ప్రయత్నించిచూచెదను—న న్నేమిచేయుమనెదవు సరస్వతీ?

సర—ఇదియే నానాథునికి తగినమాట-అగుచో వినుఁడు ప్రాణ నాథా! రండు—వీరోచితవేషము ధరింపుఁడు. పిమ్మట మీతండ్రి గారియొద్దకు పొండు. పోయి వారితో నిట్లనుఁడు. "ఈయుద్ధమునకు న న్నెవ్వరును పిలువలేదు. నేనే స్వయముగ వచ్చితిని." అంత మీ తండ్రిగారు సగర్వ స్నేహముగ వీరపుత్రులరని మిమ్ము కౌఁగిలించు కొనును. మేవాడ యంతయు "ఈయనయే మాకు కాఁబోవు రాణా" యని అభిమానముతో చెప్పికొనును. రాజపుత్రస్థాన మంతయు తల యెత్తి యాదృశ్యమును చూచును. అదియే గౌరవముహూర్తము.

నాథా! ధిక్కారపూర్వముగ బహుదినములు మనుట కన్న ప్రశంస నీయముగ ఒకనాఁడు మనుట సుఖదాయకము.

జయ—సరస్వతీ! నే నీక్షణమే పోవుచుంటిని.

సర—ఆఁ రండు. నేను నాచేతులతో మిమ్ము సైనికవేషము ధరింపఁజేసెదను.

(జయసింహుఁడు నిష్క్రమించును)

సర—స్వామీ! మీ రీయుద్ధములోనికి బొండు. నాసత్య స్నేహము అభేద్యమగు కవచమువోలె మిమ్ము రక్షించును. పగతుఱ ఖడ్గము మిమ్ము స్పృశింపనేని చాలదు.

(వెనుక వెనుక సరస్వతి నిష్క్రమించును)

చతుర్థదృశ్యము

స్థానము - ఉదయపురము - రాణారాజసింహుని యాలోచనగృహము.

సమయము—అర్ధరాత్రి.

రాణా రాజసింహుఁడు, రాణీ, మహామాయ, దుర్గాదాసు, ఇతర రాజపుత్ర సామంతులు కూర్చుండి యుందురు.

విక్రమసోలంకి—మన మెదుటఁబడి యుద్ధముచేసి మొగల సేనను తఱిమెదము.

రాజ—ఇది సరిగా గనుపెట్టుట లేదు. బహిరంగమున అసంఖ్యా మగు మొగలసైన్యమున కెదుట నిలఁబడుట యుక్తిసంగతము కాదు.

గోపీనాథుఁడు—నేను చెప్పునదేమన...కొద్దిసైన్యము ననేక దళములుగా విభజింపవలయును. వారు మొగలులను జీకాకుపఱిచి ముందుకు రానీయరు.

రాజ—గరీబుదాస్! నీయుద్దేశ మేమి? నీ వీకొండదారులను, ఘాటీలను, అడవులను బాగుగ నెఱుఁగుదువు—నీయభిప్రాయమేమి?

గరీబు...నాయభిప్రాయ మిదియే... మొగలులను ఈకొండ దారిలోనికి రానిండు. మనము వారి నేమియు నడ్డగించవద్దు. నేర్పుచే వారిని చిక్కుత్రోవకుఁ గొంపోవుదము. అచ్చట సేనాసన్నివేశము

చేయుటకు వారికి కఠినముగ నుండును. ఇటువంటి కొండదారిలో పగతుఱ పటాలములు పటాపంచలగుడు మనము వారితో తలపడుదము.

దుర్గా... ఇది చాల మంచియుపాయము రాణాజీ! మొగలులతో నేఁడే కాదు ఇంక చాలకాలమువఱకు యుద్ధము చేయవలసి యుండును. వీలైనంతవఱకు మనసైన్యము వృథావ్యయముకాకుండ చూడవలయును.

కోపీ—నేను నీప్రస్తావము నొప్పుకొందును.

విక్రమ—చాల బాగుగ నున్నది. అచ్చట శత్రువులకు దళములు బంధించుట కవకాశము చిక్కదు.

రాజ—అందఱియభిప్రాయము నిదియే? నీ వేమందువు మహామాయా?

రాణి—మీా యందఱి యభిప్రాయమే నాదియును. కాని బాదుషా స్వయముగ నీయుద్ధములో రాలేదా?

రాజ—లేదు. ఆయనయు ఆజిమును 'దోవారీ' లో నున్నారు. బాదుషా పుత్రుఁడగు అక్బరు ఉదయపురమునకు వచ్చుచున్నాఁడు. ఇది నిజమేనా దుర్గాదాస్?

దుర్గా—అవును మహారాణీ! శత్రుసైన్యము మూఁడుగా విభజింపఁబడినది. ఒకటి అక్బరునియధీనమున ఉదయపురముత్రోవలో, ఒకటి దిలేరుఖానునియధీనమున 'దాసురీ' మార్గమున, ఒకటి బాదుషా యధీనమున 'దోవారీ' యందు నున్నవి.

రాణి—నాయుద్దేశము మనము ససైన్యముగ బాదుషాపైకి దాడివెడలిన బాగుగ నుండునని.

రాజ—కాదు. ఇట్లు చేయుటచే అక్బరునిసైన్యము వెనుక నుండిపోవును. ఇది సరికాదు. ఏమి దుర్గాదాస్?

దుర్గా—అవును. ఇది యుచితము కాదు.

రాజ... అగుచో గరీబుదాసుని ప్రస్తావము అందఱకు సమ్మతమే?

అందరు-ఆఁ అందఱకు సమ్మతమే.

రాజ——మంచిది. ఈసైన్యమున కంతకు నెవ్వని నాయకునిగాఁ జేయవలయును?

గరీబు——దుర్గాదాసునే.

రాజ——అందఱియభిప్రాయ మిదియేనా?

అందఱు... అవశ్యము.

రాజ——అగుచో దుర్గాదాస్! నే నీరాజపుత్రసైన్య మంతకును నిన్ను అధ్యక్షునిగాఁ జేయుచుంటిని.

దుర్గా——నేనీ——సన్మానము నాదరపూర్వముగ గ్రహించితిని మహారాణా! అదిగో భీమసింహుఁడును వచ్చె చూడుడు!

భీమ——(ప్రవేశించి రాణాకు నమస్కారము నందరకును యథో చిత శిష్టాచారమును చేయును.)

రాజ——రమ్ము కుమారా!——నిన్ను "రమ్ము" అనిచెప్పుట కును నా కధికారము లేదు.

భీమ——ఏమి తండ్రిగారూ?

రాజ——నేను అన్యాయముగా నిన్ను వెడలఁగొట్టితిని.

భీమ——లేదు తండ్రీ! నేను బుద్ధిపూర్వకముగనే వెడలితిని.

రాజ——నాపై నీకు కోపము లేదా భీమసింహా?

భీమ——తమపైకోపము! తమకోరిక తీర్చుటకు ప్రాణమేని యీయగల్గుదును. భగవానుడగు శ్రీరామచంద్రుఁడు పితృవాక్య పరిపాలనకై వనవాసియయ్యెను. నే నొకక్షుద్రమనుష్యుఁడను. కాని నేను నాక్షత్రియుఁడనే యగుటకు గర్వపడుచున్నాను.

రాణి——భీమసింహా! జన్మభూమిరక్షణార్థమై నిన్ను నీ తండ్రి గారు పిలిపించిరి.

భీమ——ఇది నా కెంతయును గౌరవమైన సంగతి మహారాణా!

విక్రమ——నీవు నీజన్మభూమిను మఱవలేదా భీమసింహా!

భీమ... జన్మభూమిని మఱచెదనా? విక్రమసింహా! నేను పర దేశములలోఁ గడపిన యీ బహువత్సరములలో ఆహార, విహారము లందును, జాగ్రత్స్వప్నములందును, ఎప్పుడును ఈ ధూమ ధూసర

ము, కఠినపర్వతసమాకులమునగు మేవాడభూమి నాకన్నులయెదుట తాండవమాడుచుండెడిది. నేడు ఆజన్మభూమికి వచ్చునపుడు త్రోవలో ఆ చిరపరిచితములగు అరణ్యమార్గములను, పర్వతప్రాంతభూములను, పర్వతమాలలను జూచి నాకన్నులవెంట బొటబొట నీరు కారెను. ఆవేగముచే డగ్గుత్తిక యయ్యెను.

రాణి—(తనలో) సరిగా రాణారాజసింహుని ప్రతిబింబమే!

(సశస్త్రుఁడగు జయసింహుఁడు ప్రవేశించును.)

రాజ—ఎవరు? జయసింహుఁడా!

జయ—అవును తండ్రిగారూ! మీరీయుద్ధమునకు నన్ను పిలువ లేదు—నేనే స్వయముగ వచ్చితిని.

రాజ—(క్షణకాలము విస్మితుఁడై జయసింహునివంక చూచి) జయసింహా ఇది నిజమేనా? నీవు స్థిరచిత్తముతోనే చెప్పుచుంటివా?

జయ... అవును తండ్రిగారూ! నేడు మేవాడ సంకటమున చిక్కియున్నది. నేను మేవాడకు రాణా కాబోవువాఁడను. నే నిపుడు నిశ్చింతముగ నింటిలో కూర్చుండుట బాగుగ లేదు.

భీమ... చిరంజీవివి కమ్ము తమ్ముఁడా! ఇదియే నీకు తగినమాట.

రాజ—భీమసింహునకు నమస్కరించుము జయసింహా!

(జయసింహుఁడు నమస్కరించగా భీమసింహుఁ డతని గౌగిలించుకొనును.)

రాజ—దుర్గాదాస్! నా కొమరుల నిద్దఱను నీ కప్పగించు చుంటిని. వీరు నీకు వశవర్తులై యుద్ధము చేసెదరు.

దుర్గా—నా కెంతయు గౌరవమైనసంగతి మహారాణా!

రాజ-మంచిది. నేఁటి సభ చాలింతము. మీ రందరు పొండు. రాణీ! అంతఃపురములోనికి పొమ్ము,

(రాజసింహుఁడును రాజకుమారులుదక్క నందఱు నిష్క్రమించెదరు.)

రాజ—(మృదుస్వరముతో) భీమా—

భీమ—నాయనగారూ! —

(రాజసింహుఁ డూరకుండును.)

భీమ—ఎఱుఁగుదును తండ్రిగారూ! నే నాప్రతిజ్ఞను మఱవ లేదు. నే నిప్పుడే మేవాడ విడిచిపోవుచుంటిని. మంచిది పోయెద తండ్రి గారూ! పోయెద తమ్ముఁడా!

(భీమసింహుఁడు రాణాకు నమస్కరించి జయసింహు నాశీర్వదించి త్వరగా పోవును.)

రాజ—(కొంచెము సే పూరకుండి) జయసింహా—చేతనైనచో నీవు నీయన్న ననుకరించుము—పొమ్ము, కుమారా! పరుండుము.

(అందరు నిష్క్రమింతురు.)

రాజ—(తనలో) భీమా! భీమా! నీకు నాపై ప్రేమ లేదు. జన్మభూమిమాట చెప్పినతోడనే నీకు కంఠావరోధము గల్గెను. ఇంక నాకు కేవల మొకనమస్కప్రణామము—అకటా! నాదోషముచే నే నిట్టి వీరపుత్రుని పోఁగొట్టుకొంటిని.

(నిష్క్రమించును.)

---

పంచమ దృశ్యము.

స్థానము—చిత్తూరు పరిసరారణ్యము, మొగలుల శిబిరము.

సమయము—అపరాహ్ణము.

(ఔరంగజేబు ఉత్తేజితభావముతో నిలఁబడియుండును. ఎదుట దిలేర్ఖానును, ఆజిమును, ప్రక్క శ్యామసింహుఁడు నిలఁబడియుందురు.)

ఔరంగ—ఏమి దిలేర్ఖా! నీవును యుద్ధములో నోడివచ్చితివా?

దిలేరు—ఔను రాజేంద్రా! కేవల మోడియే రాలేదు. సర్వస్వము పోఁగొట్టుకొని వచ్చితిని.

ఔరంగ—అక్బరో?

దిలేరు—ఆయనవిషయమై విన్నవార్తయు అంత మంచిది కాదు. ఆయన ఆరావలీపర్వతపు సంకటమార్గమున రాణా రాజసింహుని పుత్రుఁడగు జయసింహునిచే బద్ధుఁ డయ్యెనఁట.

ఔరం—బద్ధుఁడు!—అక్బరు!—భరతఖండమునకు కాఁబోవు పాదుషా రాజపుత్రునిచేత—బద్ధుఁడు!—ఈమాఱు మొగలులకు పూర్తిగా పరాభవమైనది.

ఆజిము——(తనలో) ఏమీ! భరతఖండమునకు కాఁబోవు బాదుషా అక్బరా ?

దిలేరు——ఇంక దేవరసమాచార మేమి? దేవర 'దోవారీ'ని వదలి చిత్తోరుదుర్గము నాశ్రయించితిరా?

ఔరం——దిలేర్! రాఠోరుదుర్గాదాసుచేతిలో నాకు సంపూర్ణ పరాజయము కల్గినది. ఈయుద్ధములో తినుబండారములు, ఒంటెలు, ఏనుగులు, గుఱ్ఱములు, ప్రాణాధిక యగు గుల్నార్ బేగము హరింపఁ బడినవి.

దిలేరు... అగుచో చాలభారము తగ్గినది. ఇపుడు ఢిల్లీకి మఱలి వెళ్ళుట చాల సులభము.

ఔరం... ఢిల్లీకి మఱలపోదునా ఈ అవమానమును తీసికొని? (శ్యామసింహునితో) ఏమి మహారాజా?

శ్యామ——ఇది ఎప్పటికి కాఁజాలదు.

దిలేరు——అవమానమును దీసికొనిపోవుచు నిట చాలవస్తువులు విడిచి పోవుచున్నారుగదా——ఒంటెలు, ఏనుగులు, పశువులు, రాణి. ఇప్పుడు తిరిగివెళ్ళుట ఎంతయు సులభము.

ఔరం——ఈ విచారసమయమున నీపరిహాసము బాగుగ నుండదు. దిలేర్ఖాన్!

శ్యామ——అవును సేనాపతీ! పరిహాసమునకును సమయా సమయము లుండును.

దిలేరు——రాజేంద్రా! దుఃఖసమయమందే నాకు పరిహాసము బాగుగ నుండును. అప్పుడే నానోటనుండి పరిహాసోక్తులు వెలువడును.

ఔరం... మొగలుల కెన్నఁడు నిట్టియవమానము కలుగలేదు.

దిలేరు——నిశ్చయము రాజేంద్రా! నేఁడు తమచేతిలో కలిగినట్లు మఱెన్నఁడును కలుగలేదు. నే నొప్పుకొందును.

ఔరం——నాచేతిలోనా? నీచేతిలోనా? దిలేర్ఖాను మాకు సేనాపతి యగుట మొగలుల దురదృష్టము, నేఁడు యశోవంతుడే బ్రతికి యున్నచో——

శ్యామ—అవును సార్వభౌమా! యశోవంతుఁడే బ్రతికి యున్నచో—

దిలేరు...సమ్రాట్టున కట్టి యిచ్ఛయే యున్నచో నేఁ డతఁడు బ్రదికియేయుండువాఁడు.

ఔరం...ఏమిరా! నీ వట్లు తలఁచెదవా?

దిలేరు...ఏమియు తలఁచుట లేదు రాజేంద్రా!—అంతయు నెఱుగుదును. సమ్రాట్టు ఆతని నాఫ్గనిస్థాన మంపి చంపించినది యెఱుగుదును. ఈఅన్యాయమగు హత్యయు, నిష్ఠురతయు నాఁడు మొగల సేనాముఖమున దైవముపై విశ్వాస ముంచి, కన్యాసహితముగ ప్రాణ మర్పించుటకై నిర్భయముగ నిలఁబడిన విద్యుజ్జ్వాలమయి, అనాధయగు నామహారాణిని జూచుటచే నాహృదయమును నిర్భేదమును జేసినట్లు మఱెన్నఁడును లేదు. ఈయశోవంతసింహుని హత్య మొగల సామ్రాజ్యమును సర్వనాశము చేయునని నాఁడే యనుకొంటిని. రాజేంద్రా! మీరే కోరినచో ఈ వీరశిరోమణియగు దుర్గాదాసు శత్రువుగాక మిత్రుఁడగు వాఁడు. మఱియు ఈ రాజపుత్రులు—శ్యామసింహునివలె జాతిగౌరవము, ఆత్మగౌరము లేక దేశద్రోహు లగు కుత్సితరాజపుత్రులు గారు—దుర్గాదాసువంటి సత్యసంధులు, సరళులు, ఉదారులు, వీరులునగు రాజపుత్రులు-మొగల సామ్రాజ్యమునకు ఝంఝామారుతముగాక దానిని నిలఁబెట్టు స్తంభము లగు వారలు.

ఔరం...ఎటులు దిలేర్ఖాఁ?

దిలేరు...ఎటులా? గడచిన భరతఖండేతిహాసపుపుటలు తిరుగ వేయుఁడు. ఎటులో మీకు తెలియును. మానసింహుఁడు, భగవాన్దాసు టోడరుమల్, వీరబలుఁడు మొదలగువారు లేనిచో మొగలసామ్రాజ్యమిచట నుండునదికాదు. మఱియు ఔరంగజేబు ఢిల్లీసింహాసనమున కూర్చుండువాఁడు కాడు. అక్బరుపాదుషా నాటినపోయిన జడమును మీరు ఆత్మఘాతినియగు నీతిచే పెకలించుచున్నారు.

ఔరం—నేను!

దిలేరు—ఔను తాను. జిజియాపన్ను వేయనిచో నచట రాజపుత్రులు నొకటి కారు. ఇచట మహారాష్ట్రులును హుంకరించచురు. రాణా రాజసింహుఁడు మీమంచికొఱకే ఈసంగతి వ్రాసిరి. మీరు వారిమాట వినక బుద్ధిపూర్వకముగ మీసర్వనాశమును మీవద్దకు పిలుచుచున్నారు. రాజేంద్రా! జ్ఞాపక ముంచుకొమఁడు. అదలించి బెదరించి ఈ వీర్యసంపన్నమగుజాతి నెవ్వఁడును శాసింపఁజాలఁడు. వారు ఇచ్ఛాపూర్వముగ నెవరివశములో నేని యుండినచో ఉండ వచ్చును. ఈ జాతి యంతయు నేకమై చెలరేఁగినచో కేవలము దాని వేడినిట్టూర్పులచే మొగల సామ్రాజ్య మంతయు ఊఫున నెగిరిపోవును.

ఔరం—దిలేర్ఖాఁ! నే నీవిషయ మాలోచించెదను. నాకు తల నొప్పిగా నున్నది. ఇప్పుడు నే నేమియు ఆలోచింపఁజాలను.

(నిష్క్రమించును.)

దిలేరు—ఈశ్వరుఁడు నీకు సద్బుద్ధి నిచ్చుఁగాక ఔరంగజేబ్!

ఆజిము....(తనలో) అక్బరు భరతఖండమునకు చక్రవర్తి—ఇది కాదు! ఇది కాఁజాలదు.

దిలేరు—(తనలో) ఆజిముముఖము విచారగ్రస్తముగాఁ గన్పట్టుచున్నది. (ప్రకటము) ఏమి ఆలోచించుచుంటివి ఆజిమ్?

ఆజిము-ఇది నీకు చెప్పునదిగాదు దిలేర్ఖాన్! (నిష్క్రమించును)

దిలేరు—ఊఁ!—ఏదియో కొంచెము విశేష మున్నది. ఇది కేవలము, “దోవారీ” పరాజయము కాదు. రాకొమరునిమనస్సు స్వస్థముగ లేదు.

శ్యామ—నీవు ఓడివచ్చితివా దిలేర్ఖాన్?

దిలేరు—(వెంటనే శ్యామసింహునిదిక్కు) ఔను మహారాజా! నేను ఓడి వచ్చితిని. ఏమి మీకు చాల విచారముగా నున్నది కాఁబోలు! రాజపుత్రుల జయము మీకు బాగుగ లేదు.

శ్యామ—కాదు కాదు. నేను జెప్పున దేమన.

దిలేరు—ఉండనిండు!—ఈశ్వరా! నీసృష్టి చాల విచిత్రము! ఏ జాతిలో దుర్గాదాసువంటివారు పుట్టుదురో, ఆజాతిలో శ్యామ

సింహుని వంటివారును పుట్టుదురు. మంచిది సింహామహారాజా! మీ పేరు శ్యామసింహుఁడుకాక శమ్సుజ్జోహా (గ్రామసింహము) అని యున్నచో బాగుగ నుండునది. ఔనా?

(నేపథ్యమున గోలాహలము వినఁబడును.)

శ్యామ—ఇది యేమి ధ్వని? ఉల్లాసముతోఁ జేయు జయధ్వని! దుర్గాదాసు ఇటకు మనపై దండెత్తి రాలేదుకదా?

దిలేరు—పారిపొమ్ము మహారాజా! ఈపైతృకప్రాణమును రక్షించుకొనుము.

శ్యామ—కాదు. వీరు 'అల్లా! అల్లా!' యని యఱచుచున్నారు—ఇది మన సైన్యము.

దిలేరు—నిశ్చయముగ నిది మీసైన్యమే. మా సైన్యమగుచో 'హర హరా' యని యరచెడిది—ఔనా? మంచిది. మహారాజా! మీకీ ముఖస్తుతివిద్య నెవరు నేర్పిరి?

శ్యామ—ఎందులకు?

దిలేరు...అతఁడు చాల గొప్పయుపాధ్యాయుఁడై యుండును. ఎట్టిలాభకారియగువిద్య నేర్పినాఁడు?—వహ్వా!

(అక్బరు రాకొమరుఁడు ప్రవేశించును.)

శ్యామ—ఇదిగో! రాకొమరులు దయచేసిరి.

దిలేరు...(చూచి) ఆఁ రాకొమరుడే. సలాము రాజకుమారా! మీరు శత్రువులచే పట్టుపడిరని వింటిని. ఏమి ఆసమాచార మసత్యమా?

శ్యామ...అసత్య మనియే తలఁచెదను.

దిలేరు—అవును. తప్పక అసత్యము. మహారాజు అసత్య మనునపుడు తప్పక యసత్యమే. ఏమి మహారాజా! అవునా? కాదా?

శ్యామ—రాకొమరులు తప్పక శత్రువుల నోడించి వచ్చిరి.

దిలేరు—అవును. నేను నట్లే విచారించుచుంటిని— రాజకుమారా! ఏమి మీరు రాణాను ఖైదుచేసి తెచ్చితిరా? లేనిచో నీ జయధ్వని యెందుకు?

అక్బరు—లేదు దిలేర్ఖాన్! నేనే రాణాచే ఖైదుచేయఁబడితిని.

శ్యామ—నేర్పుచే విడిపించుకొని వచ్చిరి.

అక్బరు—లేదు మహారాజా!—రాణా కరుణించి విడిచి నాడు—దిలేర్ఖాన్? రాజపుత్రజాతి యుద్ధము చేయుట యెఱుఁగును.

దిలేరు—నిజము రాజకుమారా!

అక్బరు—కేవలము యుద్ధచేయుటే కాదు. క్షమించుటకూడ నెఱుఁగును.

దిలేరు—ఇది యొకక్రొత్తమాటను మీరు వెదకితెచ్చితిరి.

శ్యామ...ఇప్పుడు తా మెట్లు విడువఁబడితిరి?

అక్బరు...దిలేర్ఖాన్!—వినుము—

దిలేరు—మహారాజుతో చెప్పుము—వారు నాకన్న వినుట కెక్కువ తొందర పడుచున్నారు.

అక్బరు—వినుఁడు మహారాజా! నేను ఆరావళీపర్వతపు సంకట మార్గమునఁ బక్షివలె చిక్కుకొనినపుడు నేనును సైన్యమును తిండి లేక మలమలమాడి శవప్రాయులమైతిమి. అప్పుడు రాణాగారు తమ పుత్రుడగు జయసింహుని బంపిరి- నన్ను చంపుటకుకాదు. ఖైదుచేయు టకు కాదు- నాకు భోజనాదికము నిచ్చుటకు- అచ్చటనుండి విడిపించు టకు- ఇంక నేమి కావలెను?

దిలేరు—రాణాగారు మఱియొకపని చేసిన బాగుగ నుండెడిది. వారు తమపిల్ల నొకదానిని రాకొమరుని కిచ్చి వివాహము చేయవలసి నది- పోండు. ఇంక లోపలికి పోండు. వెళ్ళినవారు వెళ్ళినటుల ఇంటికి తిరిగివచ్చితిరి. ఇదియు గొప్పసంగతియే- పోండు మహారాజా! - కాదు కాదు. నేఁడు మహారాజున కిచట విందు.

(అక్బరు ఒకవైపునుండియు శ్యామసింహుఁడు, దిలేర్ఖాను నొకవైపునుండియు నిష్క్రమించెదరు.)

—♦—

సప్తదృశ్యము.
స్థానము—రాజపుత్రుల శిబిరము.
సమయము—అపరాహ్ణము.

(రాజసింహుఁడును మహామాయయు కూర్చుండియుందురు. ఎదుట మొగలుల జెండాలు పుచ్చుకొని దుర్గాదాసును, ఇతరసామంతులును నిలఁబడి యుందురు.)

రాజ—ధన్యుఁడవు దుర్గాదాస్! నీవు మొగలులను మేవాడ నుండి పారఁదోలితివి.

రాణి—ధన్యుఁడవు దుర్గాదాస్! నీవు యవనరాజ్ఞిని ఖైదు చేసి తెచ్చితివి- నేఁడు పగతీర్చుకొందును.

రాజ—ఏమీ? దుర్గాదాసు! నీవు సార్వభౌముని రాణిని ఖైదుచేసి తెచ్చితివా? ఏ రాణిని?

దుర్గా—కాశ్మీరదేశపుబేగము గులనారును.

రాజ—ఆమెను ఖైదుచేసి తెచ్చితివా? తత్క్షణము విడిచి పెట్ట లేదా?

దుర్గా—మహారాణా! నేను కేవలము సేనాపతిని. యుద్ధములో శత్రుపక్షము వారిని ఖైదుచేయుటకే నాకధికారము. వారిని విడిపించు అధికారము రాజుగారిది.

రాజ...పొమ్ము దుర్గాదాస్! సామ్రాజ్ఞిని వెంటనే విడిపించి గౌరవపురస్సరముగ నామెను బాదుషావద్దకు బంపుము.

రాణి—ఎందుకు మహారాణా?

రాజ—ఆడువారితో మన కేమియు విరోధము లేదు.

రాణి...ఆఁడువారితో విరోధము లేదా? అగుచో నేను వచ్చి తమయాశ్రయమున ఎందుకుంటిని? మహారాణా! నన్ను పట్టుకొనుటకే కదా యీఘోరయుద్ధము తలపెట్టినది? నేనే పట్టువడినచో యవన రాజ్ఞి నన్నేమిచేయునది?

రాజ—మనము మొగలనీతి ననుకరించుటకు కూర్చుండ లేదు.

రాణి—కాదు మహారాణా! నే నీరాణిని ఈవిధముగ విడువను. నేను ప్రతిక్రియ చేసెదను.

రాజ—ప్రతిక్రియయా? దేనికి ప్రతిక్రియ మహామాయా?

రాణి—దేనికా? దేనికి ప్రతిక్రియ చేయనో అడుగుడు. ఈ కాశ్మీరిబేగమే నాపతిపుత్రులను జంపినది. ఈ కాశ్మీరిబేగమే నే నిటుల అడవిమృగమువలె నొకచోటునుంచి మఱియొకచోటికి పరుగెత్తుచు తిరుగుటకు కారణము... దీనికి ప్రతిక్రియ చేసెదను. రాణా! నేను నా గుప్పిలిలోనికి వచ్చినదీనిని విడువను. ప్రతిక్రియ చేసెదను.

రాజ...ఏమి ప్రతిక్రియ చేసెదవు?

రాణి—ఈ విషయ మింక నాలోచింపలేదు. రాణా! ఈవిషయ మాలోచించెదను. ఆలోచించి యేర్పాటుచేసెదను. ఆమెను ముక్కలు ముక్కలుగా కోసికాల్చుటయు చాలదు. ఆమెశరీరమునిండ సూదులు గ్రుచ్చుటయు చాలదు. ఆలోచించి యేర్పాటు చేసెదను. క్రొత్తవిధ మగు వేదనాయంత్రమును గని పెట్టెద. స్త్రీకి తగినశిక్షను స్త్రీ యాలోచింపఁగలదు.

రాజ...మహామాయా! మనకు పాపమునకు దండన విధించుట కేమి యధికారము? ఎవ్వరి దీపనియో వారే...

రాణి—(లేచి)వారా? ఎక్కడవారు? ఎక్కడవారు? వారెక్కడ నున్నారు? వారు చేతులుముడుచుకొని కూర్చున్నారు. ఆకాశమునుండి పిడుగెప్పుడును పాపాత్ముల నెత్తిమీదనే పడదు. మహారాజా! పుణ్యాత్ముల నెత్తిమీదను పడును. భూకంపముచే పాపాత్ముల యిల్లు వాకిళ్ళే నష్టముకావు. పాప మవాయుకులగు జనుల కుటీరములును మట్టిలోఁ గలియుచున్నవి. పెద్ద పెద్దమాఁకు లట్లే తలఎత్తికొని నిలఁబడును. ఈశ్వరనియమము ధర్మాధర్మములను బాటించదు. ఎక్కడ నెవఁడు దుర్బలుఁడు, జీర్ణుఁడు వృద్ధుఁడు గనుపట్టునో వానికంఠమే ముందు పిసుగును.

రాజ—(శాంతభావము) మహామాయా! ఉద్వేగముచే ఈశ్వరునిపై విచారణ సేయకుము... ధ్రువపఱచుకొనుము. ఈశ్వర నియమముచే తుద కధర్మము తప్పక నశించును.

ఉ. ధర్మము, పంచభూతముల స్థావర రూపము, సూర్యచంద్రముల్
ధర్మవిధంబుసద్గతులు దప్పక నిల్తురు, సత్యమూర్తియే
ధర్మము శర్మ మెన్నఁడు నధర్మము గెల్వదు, భారతోర్విపై
ధర్మము! యాలకింప, వసుధావరజాతి జనించె! వీరులై

రాణి...ఎప్పుడగును?—నే నింతదనుక చూడలేదు. రాణా! నేను నేటివఱకు చూచిన దేమన సరలత్వ మెప్పుడును శఠత్వపుపాద ములపైఁబడి తిరిపె మడుగును. శఠత్వ మొక్కమాఱును కన్నెత్తి దానిని చూడదు. సత్య మెప్పుడు నసత్యమునకు దాస్యము చేయును—తనతలను పైకెత్తఁజాలదు. న్యాయక్షేత్రములందు అన్యాయవిజయ పతాకలే ఎగురుచుండుట నే నెప్పుడు చూచుచుందును. నే నెప్పుడును జీర్ణధర్మకుటీరమునందు అధర్మవిజయభేరీనాదమును వినుచుందును. శ్యామల పుణ్యరాజ్యములమీదుగా భయంకరపాపరక్త స్రవంతులు ప్రవహించుట గనుపట్టును. లంచము, దురాచారము, అసత్యము, విశ్వాసఘాతము మొదలగువానిచే భూమియంతయు నిండిపోవుచున్నది. అయినను తుదకు ధర్మమునకే జయమగునని మీా రనుచున్నారు—ఎప్పు డగును? చెప్పుడు, ఎప్పు డగును?

రాజ—శాంతించుము మహామాయా! ఉద్వేగము నాపి కొనుము—ధైర్యము వహించుము.

మ. జితభూపాలసతీమతల్లిని, పరస్త్రీనిం జెఱంబెట్టి, త
త్సతి మర్యాద నలంపనం చొక ప్రతిజ్ఞం బూని, తా జన్మ మా
ప్రతినం దప్పను, స్త్రీలతో మనకు వైరం బేమి! తద్భర్త కీ
స్థితిలో రాజ్ఞని నిచ్చుకంటెను శిరశ్ఛేదంబు వేఱున్న దే?"

రాణి—ధైర్యము! రాణా! మీారే స్త్రీయయి మీాభర్త పరదేశ ములో విశ్వాసఘాతుకునిచేతిలో విషప్రయోగముచే చంపబడినచో, నైష్ఠుర్యముచే సరలుఁడు, సుదారుఁడు నగుమీాపుత్రుఁడు హత్యచేయఁ బడినచో, నావలె అసహాయుఁడు, నిరీహుఁడు నగు శిశువును దీసికొని, ఒక దేశమునుండి యొక దేశమునకు వచ్చి బిచ్చపుదానివలె గడప

గడపక తిరుగుచు నిడుములుపడుచో మీరు తెలిసికొను వారలు—ధైర్యము!—లేదు రాణా!—నే నాపాపినిని విడువను.

రాజ—దుర్గాదాసూ! నేను జీవించియుండగ నొక యబలపై ద్రోహము జరుగుట చూడజాలను. పొమ్ము. నీవు సగౌరవముగ ఆమెను బాదుషావద్దకు పంపించుము.

మ. దయ దాక్షిణ్యము, ధర్మచింతనము, భూతప్రేమ, శాంతంబు, నీ
తియు భూపాల సతీమతల్లుల కనధ్యేయంబు, లీనాడు వ
శ్యయు చింతాభర, యైన రాజ్ఞని భవచ్ఛాతాసి ఖండించెదో!
నయ మొప్పక్ క్షమియించి పంపెదవో! విజ్ఞానాత్మవై సేయుమా?

రాణి—దుర్గాదాస్! నీవు రాణా భృత్యుఁడవు కావు. నేను నీ స్వామినిని.

దుర్గా... క్షమింపుడు మహారాణీ! ఈయుద్ధమున మే మందఱము రాణాగారి యనుచరులము. బేగము నేడు మేవాడ రాణా వశమున కైదీయై యున్నది. మార్వాడరాణీవశమున కాదు. మహారాణీ! యాత్మవిస్మృతి నొందకుఁడు. మిమ్ము రక్షించుటకే రాణాగారీ యుద్ధమును జేసిరి. రాణా మీకు హితచింతకులు. మీకును వారి యానతి మన్నించుట ధర్మము.

రాణి—(కొంచెమునే పూరకుండి నీవు నిజముచెప్పితివి దుర్గాదాస్! (రాణా యెదుట మోఁకజీలఁబడి) రాణాజీ! క్షమించుఁడు. శోకావేగమును బట్టజాలక పిచ్చిదానివలె నయితిని--క్షమింపుఁడు. కాని ఈ తీవ్రవేదనను, ఈదారుణజ్వాలను, ఈప్రగాఢమగు హృదయ దాహమును బట్టజాలక ఉన్మాదిని నగుచుంటిని, క్షమింపుఁడు.

రాజ—నేను మొదటనే క్షమించితిని మహామాయా! నీవు నన్ను గోరెడు క్షమాపణమును బేగమునకు చూపింపుమని కోరుచున్నాను. నేను విచారణార్థము బేగమును నీయొద్ద విడిచిపోవుచున్నాను. ఆమెను క్షమించుము. నీమహత్వమును చూపించుము. మహామాయా! స్నేహము, దయ, భక్తి, క్షమ మొదలగు గుణములచే స్త్రీజాతి పూజనీయమగుచున్నది. ఈగుణములే స్త్రీల శక్తి. నీవు

శిక్షయే విధింపఁగోరినచో విచారించుకొనుము. నీవు నీకు ద్రోహము చేసినవారిని నవ్వుచు నవ్వుచు క్షమించినచో నది వారికి తక్కువ శిక్షయా?

రాణి—మంచిది, బేగమును తీసికొనిరమ్ము దుర్గాదాస్!

(దుర్గాదాసు పోవును.)

రాజ—నే నిపుడు నీదయపై భారము వేసి బేగమును విడిచి పోవుచున్నాను మహామాయా! (నిష్క్రమించును.)

రాణి—ఇదియు బాగుగ నున్నది. ఈన్యాయాసనమున కూర్చుండి నే నామెను విచారించెదను-- ఇదియే చాలును. భారత సమ్రాజ్ఞి, ఔరంగజేబు బేగము, మత్పతి పుత్రఘాతినియగు పిశాచిని, నేఁడు నాయెదుట ఖైదీగా నిలఁబడును. నేను సింహాసనమున గూర్చుండి ఆమె మొగమువంక చూచి యామెకు ప్రాణభిక్ష పెట్టెదను. ఇది యేమి తీసిపోయినదా? ఆమె వచ్చుచున్నది. ఇప్పుడును మొగముపై నదియే దర్పము, చూపులో నదియే గర్వము. నడకలో నదియే యహంకారము!—జగదీశ్వరా! పాపము నింత యుజ్వలముగను, విచిత్రముగను నిర్మించి సిద్ధపఱచితివి.

(బేగము గులవారుతో దుర్గాదాసు ప్రవేశించును.)

రాణి—సలాము బేగము సాహెబా!

గుల ... యశోవంతసింహునిరాణివా?

రాణి—అవును. ఏమి గుఱుతించలేకపోతివా? ఎవతెను బట్టుకొనుటకై నీ వీమహాయుద్ధమును గల్పించితివో, ఆయశోవంతసింహుని రాణిని నేనే. నీవు నా పతిపుత్రులను మ్రింగితివి! అప్పటికి నీరక్కసి పొట్ట నిండలేదు. నన్ను, నాచిన్నకొమరునికూడ మ్రింగఁగోరితివి! ... ఏమి ఇంతలోనే అంతయు మఱచితివా? ఇంత మఱపున్నచో నెట్లు సాగును బేగము సాహెబా?

గుల ... (దుర్గాదాసుతో) నీవే దుర్గాదాసువు?

దుర్గా—ఔను బేగము సాహెబా!

గుల...న న్నిక్కడ కెందుకు తీసుకొనివచ్చితివి?

దుర్గా—ఇచ్చట మీావిచారణ జరుగును.

గుల—నా విచారణమా? ఎవరు చేసెదరు?

రాణి—నేనే చేసెదను—మాట కొంచెము కఠోరముగా నున్నది కాబోలు! ఏమి? పాప మేమి చేసెదవు?—చక్రము తిరిగి పోయినది. బేగమ్! దుర్గాదాసు నింతగట్టిగా చూచుచుంటి వేల? ఈకాఫిరునకు నన్ను ఖైదుచేసి తెచ్చునంతటి సాహసమా యని విచారించుచుంటివి కాబోలు! ఇదియే విచారించుచుంటివి— ఔనా? మంచిది. ఇప్పుడు నీ కేమి శిక్ష కావలయును?

గుల—నేను నీకు ఖైదీ నైతిని. నీయిచ్చవచ్చినది చేయుము.

రాణి—నాయిచ్చవచ్చినది చేయుదునా? బేగము సాహబా! నే ననుకొనినశిక్ష యగుచో నీకు చాలకఠినముగా నుండును. నాయిచ్చవచ్చినశిక్ష యగుచో నీవు సహింపఁజాలవు. అది చాలకఠిన శిక్ష. నరకజ్వాల దానిముందు మలయమారుతమువలె చల్లగా నుండును; వందలకొలది, తేళ్ళకాటువలనిమంటయు దానిముందు సెలయేటినీరువలె చల్లగా నుండును. నా యిచ్చవచ్చినదా? నాయిచ్ఛ యేదియో నీ వెఱుగుదువా బేగమ్?—మంచిది. పోనిమ్ము—నీవు నన్ను ఖైదు చేయించినచో యేమి చేసెడిదానవు బేగము సాహబా?

గుల—ఏమి చేయుదునా? నీచే నాపాదోదకమును త్రావింతును. తర్వాత చంపింతును.

రాణి—ఇంకను పొగరు తగ్గలేదు! విసపుకోఱ పెఱుకఁబడినది. కాని బుస్సు విడువలేదు. భేగము సాహబా! పాపము! నీకోరిక నెఱవేఱలేదు. నేఁడు నేనే నీయెదుట నీరీతి నిలఁబడవలసినది. ఔనా? ఏమి చేయుదుము? నీవే నాయెదుట నీరీతి నిలబడవలసివచ్చినది— చూడుము గులనార్! వినుము భారతసమ్రాజ్ఞీ! నేఁడు నీవు నాగుప్పిట నున్నావు. వలయుచో నిప్పుడు నీచే నన్మత్పాదోదకమును త్రావింప

గలను. చంపించగను గలను. కాని అట్టినీచపు బనిసేయుమ. నేను నిన్ను విడిచిపెట్టుచున్నాను. సేనాపతీ! నీ వీమెను బాదుషా కొప్పగించి రమ్ము. (గులనారుతో) పొమ్ము... బేగంసాహేబా! నిలఁబడితివి. ఇదియే రాజపుత్ర ధర్మము.

(తెర వాలును)

---

శ్రీ పరదేవతాయై నమః

# దుర్గాదాసు

## తృతీయాంకము.

### ప్రథమ దృశ్యము.

స్థానము—ఢిల్లీరాజభవనము; బయటివసారా.

సమయము—ప్రాతఃకాలము.

(తహావ్వరుఖానును, అక్బరును నిలిచి మాటలాడుచుందురు.)

తహావ్వరు... అగుచో మిమ్ము రాజపుత్రులు ఎలుకల బోనులో నెలుకలను బోలె సంకటమున బెట్టిరా?

అక్బరు—సరిగా నట్టులే. మేము చాలదూరము తిన్నగా పోతిమి. అక్కడ చూడగా ముందుకు దారి లేదు. వెనుకకు తిరిగిచూడ నాదారియు మూయఁబడియుండెను.

తహావ్వరు—ఎలుకలబోనులో పడిన యెలుకలవలె ఒకమారీవైపునకు, నొకమారావైపునకు మీరు పరుగెత్తుచుండ రాజపుత్రులీతమాషాను కొండపైనుండి చూచుచుండిరి కాఁబోలు!

అక్బరు—ఆపర్వతమార్గము నూరుగురు మనుష్యులును దగ్గఱ దగ్గఱగా నిలఁబడియుండఁజాలనంత యిఱుకుగా నుండెను, మఱియు

మా సైన్యములో నెవ్వఁ డెక్కడ నున్నదియు కూడ చూచుటకు వీలు లేకుండెను.

తహావ్వరు—అగుచో యుద్ధము జరుగ లేదా?

అక్బరు—యుద్ధ మెవ్వరితో? కొండతో చేయుదుమా? శత్రువుల జాడయే తెలియ లేదు.

తహావ్వరు—మొదటినుండియు నే నిదియే చెప్పుచున్నాను. రాజపుత్రులు యుద్ధము చేయుట నెఱుఁగరు. ఒకనియమము పాటించి యుద్ధము చేయరు. భోజనసామగ్రి దొంగిలించి, ఆఁకలితో మాడ్చి యుద్ధములో గెలుచుట యక్రమము.

(ఆజిము ప్రవేశించును.)

తహావ్వరు—ఆదాబ్ సర్కార్!

ఆజిము—(అటు ధ్యాన ముంచక) అక్బర్! నీవు వింటివా?

అక్బరు—ఏమి ఆజిమ్!

ఆజిము—మేవాడ యుద్ధములో నీ వోడుటచే నాయనగారు నీపై నెంతయు కోపముతో నున్నారు.

అక్బరు—దానికి నే నేమి చేయుదును? అదియునుగాక ఈయుద్ధములో నే నొక్కఁడనే యోడ లేదు, సాక్షాత్తు దిలేర్ఖానును.

ఆజిము—దిలేర్ఖానుమీాదను నాయనగారికి మంచియుద్దేశము లేదు.

అక్బరు—మఱియు సాక్షాత్తు బాదుషా? మఱియు నీవు? మీారు మాత్రి మీాయుద్ధములో గెలిచివచ్చితిరా?

ఆజిము—మేము శత్రువులతో పోరి యోడివచ్చితిమి.

అక్బరు... ఇంక నేనో?

ఆజిము—నీవు భోగవిలాసములలో పడి యుద్ధము చేయ లేదు. తుదకు నాయనగా రనినమాట యిదియే.

అక్బరు—అననిమ్ము. నే నేమి చేయుదును?

తహావ్వరు—తా మెవ్వరితో యుద్ధము చేసితిరి సర్కార్ ?

ఆజిము—ఊర కుండుము.

అక్బరు—అగుచో ఇపుడు నే నేమి చేయుదును!—నేను పిరికి వాఁడను. భోగవిలాసమగ్నుఁడను. నాకు ఆటపాట లిష్టము—అగుచో నిప్పు డేమి ?

ఆజిము—ఇంక నే మున్నది? అక్బర్! బాదుషా నిన్ను పనికిమాలినవానిగా నెంచి మఱల బంగాలా దేశము పంపువారలే. నే నెంతయో చెప్పి వారియుద్దేశము మాట్చితిని. చూడుము. నేను నీకు స్నేహభావముతో చెప్పుచున్నాను—నానయనగారు నీపైఁ జాల కోపించియున్నారు. జాగ్రత్త! వారివద్దకు రాకపోక లెంత మాత్రము నీ కిపుడు పనికిరావు.

(నిష్క్రమించును.)

తహావ్వరు—రాజకుమారా! పద్ధతి యేమియు బాగుగలేదు. మీరు యుద్ధములో గెలువకపోవుట యపకీర్తి.

అక్బరు—నే నేమి బుద్ధిపూర్వకముగ నోడివచ్చితినా?

తహావ్వరు—నిజమే. కాని ఇచ్ఛావిరుద్ధముగ నోడుటయు బాగుగ లేదు. సామ్రాజ్యపుటాశ యేమేని యున్నచో నదికూడ పోయినది.

అక్బరు—ఇంక బాదుషా యెవ్వ రయ్యెదరు?

తహావ్వరు—ఆజిము. నావంక తీవ్రముగ చూచి ఎటుల కసరుకొనెనో మీరు చూడలేదా? ఆజిము బాదుషా కిచ్చకములు చెప్పి తన కనుకూలునిగాఁ జేసికొనినాఁడు.

అక్బరు—అగుచో ఆజిముమాత్ర మేమి శౌర్యము చూపించి నాఁడు? అతఁడు మాత్రము గెలిచివచ్చెనా? ఓడి పైగా బేగము సాహా బానుకూడ పోఁగొట్టుకొని వచ్చినాఁడు. రాజపుత్రజాతి చాల ఉదార మైనది గనుక నే వారు బేగము సాహాబాను తిరిగి బాదుషాయొద్దకు పంపిరి.

తహావ్వరు—ఆజిమును ఓడియే వచ్చినాఁడు. కాని యాఓటమి సాక్షాత్తు బాదుషాకే. దానికై బాదుషా ఆజిము నేమియు నన

జాలఁడు, ఆజిము బాదుషానాయకత్వమున వారు చెప్పినట్లు పనిచేయు వాఁడు. మఱియు మీరు స్వతంత్రులగు సేనానాయకులు.

అక్బ—ఆజిము బాదుషాకు ప్రియపాత్రుఁడు. ఎందు కన నత డిచ్చకములాడువాఁడు, పక్కా-ముసల్మాను, కల్లు త్రాగఁడు, సంగీతము వినఁడు. పదిసార్లు నమాజ చేయును!...ఇది యంతయు నాడంబరము—కేవలము బాదుషాను సంతోషపెట్టుటకు చేయు పద్ధతులు.

తహావ్వరు—మీరుకూడ నదియే యేల చేయరాదు?

అక్బరు—తహావ్వర్ఖాన్! నేను సామ్రాజ్యము నేని వదలు కొందును. కాని మద్యము, స్త్రీ, సంగీతము ఈమూటిని విడువనొల్లను. నేను ఆజిమువలె నీచుఁడను, కపటిని, వంచకుఁడను గాను. జపమాలి కను ద్రిప్పుచు మోసము చేయుట నా కిష్టము లేదు.

తహావ్వరు...ఊరకుండుఁడు. బాదుషా వచ్చుచున్నాఁడు.

(అక్బరు మెదలక రెండవప్రక్క-నుండి పోవును. ఔరంగజేబు దిలేర్ఖాను ప్రవేశించెదరు.)

ఔరం...ఏమి! దుర్గాదాసు ఝూలవాడను జయించెనా? మఱియు పురమండలములో సుబలదాసు ఖానులను, రోహిలులను ఓడించెనా?

దిలేరు...ఔను రాజేంద్రా! మఱియు దయాలుశాహా మాల్వానుండి మొగలసైన్యమును దఱుమఁగొట్టు ననికూడ తెలిసినది. ఇప్పు డతఁడు అక్కడి కాజీలను బట్టుకొని గడ్డములను గొరిగించు చున్నాఁడు. కురానును నూతులలో పడవేయించుచున్నాఁడు. మసీదు లను పడఁగొట్టించుచున్నాఁడు.

ఔరం—ఏమి! ఈవిధమున ధర్మముపై ద్రోహమా!

దిలేరు...అసలు హిందువు లీమాటను ఎఱుఁగనే యెఱుఁగరు. మీరే వారికీ దారి చూపించితిరి. ఏమి మీరు హిందువుల వేదములను అగ్నిగుండములలో పడవేయ లేదా? బ్రాహ్మణులచే బలాత్కారముగ కల్మ చదివించ లేదా?—రాజేంద్రా! వినుఁడు. హిందువులపై ద్వేషము

మానుఁడు. జిజియాపన్ను తీసివేయుఁడు. హిందూముసల్మాను లేక మగుదురు.

ఔరం—ఎప్పటికిని కాదు. నేను జీవించియుండువఱకు ముసల్మానులు ముసల్మానులే. కాఫిరులు కాఫిరులే—దిల్లేరాన్! నేను దక్షిణమునుండి మరాజిమును బిలిపించితిని. ఇప్పుడు మొగలసైన్యము నంతయు తీసికొని మార్వాడపైకి దాడి వెడలుదును. ఏమగునో చూచెద!—తహావ్వర్ఖాన్! నీవు డెబ్బదివేల సైన్యమును దీసికొని మార్వాడపై దండెత్తుము. నేను అక్బరునాయకత్వమున ఇంకను సైన్య మంపుచున్నాను. స్వయముగా నేనును సైన్యమును దీసికొని వెనుకవచ్చెదను, చూడుము. మార్వాడ జయించినచో నీ కొకరాజ్యఖండమును బహుమానముగా నిచ్చెదను. ఓడినచో జేతులకు కాళ్ళకు నినుపకడియములు.

(నిష్క్రమించును.)

తహావ్వరు—ఏమందువు ఖాన్ సాహబ్?

దిలేరు— ఒకమాఱు నేను చూచియున్నాను. నీవు నొకమాఱు చూడుము.

## ద్వితీయదృశ్యము.

స్థానము ... ఢిల్లీరాజభవనోద్యానము.

సమయము—సాయంకాలము.

బేగము గులనారు ఆయుద్యానమున తిరుగుచునుండును.

గుల—(తనలో) ఆహా! ఒడ్డుపొడుగుగల దృఢగాత్రము! ఉన్నతము విశాలము నగు లలాటము! చుఱుకువాఱిన చూపు! తేజస్సంపన్నమగు ముఖము! నిజముగ దుర్గాదాసొక చక్కనివీరుఁడు! కాని యెంత ఆశ్చర్యమగు సంగతి!—ఆతఁ డొక్కమాఱును ఇచ్ఛాపూర్వముగ నావంక చూడలేదు. ఆతఁడీ నిరుపమాన మగు రూపమును విస్మిత దృష్టితో చూడలేదు. ఈయౌవనజ్యోతి ఆతనిని మోహితునిగాఁ జేయలేదు. నాకరస్పర్శ మనువిద్యుత్ప్రవాహ మతనిని మూర్ఛితునిగ జేయలేదు. ఓపరమేశ్వరా! నీ యీప్రపంచమున అట్టి మనుష్యులు కూడ నుండిరా?—

(పాడుచు రజియా ప్రవేశించును)

## గీతిక

ఇంతిరో! నాకాంతుని గానక ♦ యీనిశ యెటు మళ్ళింతున్
సంతసంబు దొలంగి చింతా ♦ సాగర కోటులఁ దరింతున్
నిమేష మాతని నెడఁబాసిన సర్వము శూన్యంబుగఁ దోఁచున్
శ్రమ యనిపించును జీవధారణ మసహ్యపీడ మది నేచున్
హృదయపీఠమున నున్నపుడే నే ♦ నెంతో దవ్వని యెంతుఁగా
సుదతీ! ప్రియు నెడఁబాసి దూరమున ♦ సొలయుచు నెటు జీవింతున్

రజియా—ఏమి అమ్మీజాక్! పొద్దుగ్రుంకినను నీ వింక నీనిర్జనోద్యానముచే ఒంటరిక త్తైవై యుంటివా?

గుల—నాకు ఒంటరిగ నుండుటయే బాగుగ నుండును.

రజియా—పూర్వ మీసంగతి లేదు—అమ్మీజాక్! నీ విప్పు డింతవిచారములో మునిగియుంటి వేల?—పూర్వము నీ విట్టు లుండు దానవు కావు.

గుల—నీ వెప్పుడైన వేనినేని ప్రేమించితివా?

రజియా—ఎందుకు లేదు! వేసఁగిలో మామిడిపండును, భోజనములో పులగమును ఎక్కువ ప్రేమించెదను. అన్నిటికన్న నా పిల్లికూన నెక్కువ ప్రేమింతును—"మ్యావు-మ్యావు-మ్యావు". కాని పాపము దానికి రాగజ్ఞానము లేదు.

గుల—పో పిచ్చిపిల్లా! నే నడుగునది నీ వేమనుష్యునేని ప్రేమించుచుంటివా యని.

రజియా—మనుష్యుని! ఎందుకు ప్రేమించుట లేదు—నిన్ను ప్రేమించుచున్నాను. అమ్మను ప్రేమించుచున్నాను. మఱియు నొకని ప్రేమించుదానను, అతఁడు చనిపోయెను.

గుల—ఎవనిని?

రజియా—ఆ వంటచేయు ముసలితాతను. ఎంతచక్కగా వంట చేసెడువాఁడు అమ్మీజాక్!—మలారు రాగమువలె (పాడును)

"పియా రేకహివ్ వర్ష ఋతు ఆఈ" కాని యిది దేశరాగము. మలా రునకు చేరికగా నుండును.

గుల— ఒకపాట పాడుము రజియా! నేను విందును.

రజియా... (ఉల్లాసముతో) విందువా?--మంచిది యుండుము. తంబురా తీసికొని వచ్చెదను. (పరుగెత్తుకొని పోవును.)

గుల—ఏమైన నగుగాక! నే నొక్కమా ఆతనిఁ జూడఁగోరు చున్నాను. వాని గర్వ మణఁచెదను. ఇంతసాహసము! నాముందరనుండి యొక పురుషుఁడు తల వంచుకొనక వెళ్ళిపోవునా? వాని హృదయము కామపీడితము కాదా ? మోకఁజిలఁబడి నాయొక్క శ్రీమదృష్టిని యాచింపఁడా ? విలాసముపై నింత తిరస్కారభావము!

(రజియా ప్రవేశించును.)

రజియా—(తంబురా ఒడిలో బెట్టుకొని) ఏమి విందువా?

గుల—నిన్నరాత్రి నీవు మిద్దెపై పాడుచుంటివే--

రజియా—అదియా? అది నేను తంబురాపై పాడఁజాలను.

గుల—పోనిమ్ము. ఊరకయే పాడుము.

(రజియా తంబురా క్రింద నుంచి నిలిచి పాడును.)

తరముగాదు నా కిఁక హృదయమ్మును దాచిపుచ్చుటలు తామరనేత్రునా!
పొరలెనుగంగాపూరముఝుంఝూమరుత్తునువీచెనుసలిల ముప్పొంగెను!
తబుకుతబుకుమని కెరటములొడ్డులదాకుచుముదముననాట్యమొనర్చెదు!
ప్రబలమైన తూఫానును గట్టుల బంధించుట యున నాకు వశంబే!
మానము గీనము మాటలుసాగవుమాన్యముకా దభిమానము మానము!
మానవునాకను మానుగ విడిచి తూపానుమధ్య నిపు డేను నుఱికెదను!
దీని లహరిపయి నెక్కిపోయెదను తిలకించెద నేఁ డెట నేఁ బడుదునో!
ప్రాణము పణముగ నొడ్డితి లోకులభయములజ్జలతో లేదు నాకు పని॥

రజియా—ఏమి అవిమ్మాజాణ! ఎంత చక్కనిపాట !

గుల—(వినిపించుకొనక) నిజముగ యౌవనోద్రేకమను తుపాను చెలరేగినది. ఈ తుపానును సహనము, వివేక మను కట్టచే నరికట్టుట కేవల మసంభవము. ఏనను దీని నరికట్టుట కవసర మేమి?

ప్రళయమహోత్తరంగము వచ్చి నన్ను గొంపోవును. నన్ను ముంచును. విలక్షణత్వమునందే నా కానందము. ఎవ్వరును చేయఁజాలనిపని చేయుటకే నాకుల్లాసము, నేను దుర్గాదాసుని గోరుచున్నాను. యశోవంతుని రాణిని బట్టుకొనుట కేవలము నెపము. నాకు లక్ష్యవస్తువు దుర్గాదాసు. ఔరంగజేబ్!—మార్వాడపై దాడి వెడలుము. నేను దుర్గాదాసుని గోరుచున్నాను.

(నిష్క్రమించును.)

రజియా—అమ్మాజానుపద్ధతి యేమియు తెలియవచ్చుటలేదు. ఏదియో నెపగుకొనుచు వెడలిపోయినది. ఇంత మంచిపాట—ఇంత చక్కని సంగీతము—ఏమియు నచ్చలేదు. (ఆపాటనే పాడుచు నిష్క్రమించును.)

---

### తృతీయదృశ్యము.

స్థానము—మార్వాడ పర్వతశ్రేణి.

సమయము—ప్రాతఃకాలము.

(దుర్గాదాసును, భీమసింహుఁడును దగ్గఱ దగ్గఱగా నిలఁబడియుందురు. గ్రామవాసులు కోలాహలము చేయుచుందురు.)

దుర్గా—భీమసింహా! ఈమాఱు బాదుషా సమస్త మొగల సైన్యమును దీసికొని మార్వాడపై కెత్తివచ్చుచున్నాఁడు—ఈమాఱు మన జీవనమరణసమస్య తేల నున్నది. ఈసారితో రాజపుత్రజాతికి సర్వనాశమేని యగును, లేక యభ్యుత్థానమేని యగును. వీరశిరోమణీ! నీ వీ యుద్ధమునకు నంసిద్ధుడవు గమ్ము.

భీమ—అందులకే నాయనగారు న న్నిక్కడకు పంపిరి. నే నీ యుద్ధములో ప్రాణ మర్పించుటకై వచ్చితిని.

దుర్గా—శిశోదీయవీరా! నీవీరత్వము, నీస్వార్థత్యాగము నేను బాగుగ నెఱుఁగుదును. కాని వినుము. మేవాడయువరాజా! నీవు గొప్పవాఁడవు. కాని అంతకంటె గొప్పవాఁడవు కావలయును—నీవు వీరుఁడవు. కాని ఈ యుద్ధమున నీవీరత్వపరమావధిని చూపవలయును.

భీమ—సేనాపతీ! నీవు నిశ్చింతముగా నుండుము. నాకర్తవ్యమని యెంచి నే నీయుద్ధములో ప్రాణత్యాగము చేయవచ్చితిని. ఆ కర్తవ్యము నన్నుగుఱించి, నాతండ్రిగారిని గుఱించి, మఱియు సమస్త రాజపుత్రజాతిని గుఱించి యైయున్నది. భీమసింహుఁడాకర్తవ్యమార్గమునుండి యొకయడుగేని వెనుకకు మఱలఁడు. మీరు నామాట విశ్వసింపుఁడు.

దుర్గా—కుమారా! భీమసింహా! మాకు నీమాటపై పూర్ణవిశ్వాస మున్నది.

భీమ—మహారాణి యెచ్చట నున్నది?

దుర్గా—ఆమె యిపుడు మార్వాడయంతట—పట్టణములలో పల్లెలలో, అడవులలో తిరుగుచున్నది. ఆమె స్వయముగా సైన్యమును జోగుచేయుచున్నది. రాజపుత్రజాతి కుద్రేకము, నుత్సాహము కలిగించుచున్నది. యశోవంతసింహమహారాజు స్వర్గస్థులైన పిదప మార్వాడసైన్య మంతయు చిందఱవందఱయైనది. అందుచే స్వయముగ మహారాణియే మార్వాడవీరులను పోగుచేయుటకు వెడలినది.

భీమ—నే నొక్కమా ఱామెదర్శనము చేయఁ గోరుచున్నాను.

దుర్గా—నేఁడే చేయఁగలవు కుమారా! ఆమె నేఁ డీయూరిలోనికి రానున్నది. ఆమెను దర్శించుటకే నే నిటకు వచ్చితిని.

(సమరదాసు ప్రవేశించును.)

దుర్గా—సమాచార మేమేని తెలిసినదా తమ్ముఁడా?

సమర—ఆఁ! మొగలసేనాపతి తహావ్వర్ఖాను డెబ్బదివేల సైన్యమును దీసికొని మార్వాడవైపునకు వచ్చుచున్నాఁడు. వెనుక అక్బరుని వెంట నింకను సైన్యము వచ్చుచున్నది.

దుర్గా—మఱి బాదుషా?

సమర—ఆయనయు సేనాసహితముగ అజ్మీరులో విడిసినాఁడు. ఆయన వెంట లక్ష కెక్కుడుగ సైన్య మున్నది.

(దుర్గాదాసు భీమసింహునివంక చూచును.)

భీమ—రాఠోరుసైన్య మెంత యుండును సేనాపతీ?

దుర్గా—పదివేలు. మాకు నొక లక్షపైగా సేన యుండెడిది. యశోవంతసింహుఁడు పోయినపిదప అది యంతయు చిందఱవందఱ యైనది. సేనలోని యెక్కువజనులు పనిపాటలు, వ్యవసాయము చేసి కొన సాగిరి. మహారాణి వారి నందఱను భోగ్రిగుచేయుటకే వెడలినది. ఈగ్రామవాసులను చూచితివా? ప్రాణమే లేనట్లు లుండెదరు. కాని వీరికే యుద్రేకము కలుగును. మహారాణి పలుకులలో ఉత్తేజనావిద్యుత్ప్రవాహము నిండియున్నది— ఆమె నేఁడొక స్వర్గీయ ప్రేరణము చేతనుబోలె నీపని చేయుచున్నది. ఆమె మాటలు నేఁడు మంచుగడ్డకు కూడ వేడిమి కల్గింపఁజాలును. పిఱికిపందనుగూడ ఆవేశముచే నున్మత్తుని చేయఁగల్గును.

భీమ—అదిగో! మహారాణి వచ్చుచున్నది.

దుర్గా—ఆఁ! వచ్చుచున్నది. భీమా! కొంచెము తొలఁగి నిలిచి యుండుము.

భీమ—నిజముగ నిది యపూర్వమగు రూపము సేనాపతీ! ఇట్టి రూపము నే నెచ్చటను జూడలేదు. ఆహా! యేమి ఆ దానవదళనియగు చండికామూర్తి! వీపుపై విరియఁబాఱిన ఆచిక్కని సోగవెండ్రుకలు, కందోయిని పొలుపారు నాదివ్యజ్యోతి, లలాటముపై చిందులుద్రొక్కు అపూర్వగర్వకాంతులు, పెదవులపైని వరాభయప్రదాయినియగు ఆ శాంతిరేఖ గాంచినచో నెవ్వఁడీ మహాదేవియాజ్ఞను శిరసావహింపఁడు? ఇంక నేమియు భయము లేదు దుర్గాదాస్! స్వయముగ జనని యగు జన్మభూమియే మనకు సహాయముచేయుటకు నిలఁబడినది—ఇంక నేమియు భయము లేదు.

(దుర్గాదాసును, భీమసింహుఁడును చాటుగ నుందురు. రాణియు ఆమె వెనుక గ్రామవాసులు ప్రవేశించెదరు.)

గ్రామవాసులు—జయము, మహారాణికి జయము.

౧ గ్రామ—మహారాణికి చోటివ్వుఁడు.

౨ గ్రామ—మాకు మహారాణి బాగుగాఁ గనుపట్టుటలేదు.

రాణి—(దగ్గఱనున్న జాతిబండపై కెక్కి) గ్రామవాసులారా! సైనికులారా! పుత్రులారా!

3 గ్రామ...మాకు వినఁబడుటలేదు. మాకు వినఁబడుటలేదు.

రాణి—వినిపించును. నిశ్శబ్దముగా నుండి వినుండు.

౪ గ్రామ—అయ్యా! అందఱు మాటాడక జాగ్రత్తగా వినుండు.

రాణి—వినుఁడు. నేఁడు నే నిచట కెందుకు వచ్చితినో వినుఁడు,

౫ గ్రామ—హిశ్! ఓయీ మీరు మెదలక యుండఁజాలరా? విననీయరా?

రాణి—ముందుగ మీకు నన్నెఱిగించెద. వినుఁడు-నేనెవ్వతెనో.

౬ గ్రామ—అరే యూరకొనుండు. బాగుగ వినఁబడుటలేదు.

రాణి...మార్వాడనివాసులారా! నేను మీప్రియమహారాజగు యశోవంతసింహుని రాణిని. ఔరంగజేబుపాదుషా నాభర్తయు మీ రాజునగు యశోవంతసింహుని ఆఫ్గనిస్థానములో కపటముచే చంపించెను. మఱియు నాకు పెద్దకొడుకును మీకు రాజకుమారుఁడగు పృథ్వీసింహునికి ఔరంగజేబు విషము పెట్టిచంపించెను. నాచిన్నకొమరుఁడు, మీకు కాఁబోవురాజు—అజితసింహుఁడు బాదుషాకు నేత్రకంటకమగుటచే ఏకాంతస్థలమున దాఁచి యుంచఁబడెను. మఱియు నేను—మీ రాణిని. ఊరూరు పల్లెపల్లె దిమ్మరుచుంటిని.

(గ్రామవాసుల కోలాహలము)

౭ గ్రామ—అగుచో మే మేమి చేయుదు మమ్మా?

౮ గ్రామ—మాకంత శక్తి యెక్కడిది తల్లీ?

౯ గ్రామ—ఏమైన నగుగాక! బాదుషాదుండగములకు ప్రతిక్రియ చేసితీఱవలయును?

౧౦ గ్రామ—మన మహారాణికి మనమే సహాయము చేయనిచో నింక నెవరు చేసెదరు?

రాణి—వినుఁడు గ్రామవాసులారా! నేను నాదుఃఖమును మీ కెఱిఁగించుటకై మీయొద్దకు రాలేదు. నేను వచ్చినది నేఁడు మన

సుందరమగు మార్వాడకై మీసహాయము యాచించుటకు. బాదుషా లక్ష కెక్కుడుగ సైన్యమును దీసికొని మార్వాడపైకి దండెత్తివచ్చు చున్నాఁడు. మీరు మార్వాడగర్భజనితులు, మీరు రాజపుత్రులు, మీరు వీరు లని ఖ్యాతిచెందినవారలు. ఏమి! మీరలు నిశ్చింతముగ నిలఁబడి మీ జన్మభూమి పరపద దళితమై దోచఁబడుచుండ—రూపు మాయుచుండ—చూడఁగలరా?

౧౧ గ్రామ—బాబో! లక్ష కెక్కుడుగ సైన్యమా—! అబ్బో! ఇంక నెక్కుడిది మేమాడ!

౧౨ గ్రామ... సేనాపతి ఝూన్వారుపై దండెత్తనిచో ఈ ఆపద వచ్చునదికాదు.

౧౩ గ్రామ... అవును, నిద్దురవోవుపులిని లేవఁగొట్టుట యన నిదియే.

౧౪ గ్రామ—లక్షాధిక మొగలులతో యుద్ధము చేయుట వీర్యవిహీనమగు మార్వాడకు సులభముకాదు.

౧౫ గ్రామ—ఏవిధమునను సంభవముకాదు.

రాణి—సంభవముకాదా? అగుచో మొగలసేన మిమ్ము పాఱఁదోలి రూపుమాపి-ఈస్వర్ణభూమి నేలుచుండ మీరు మౌన ముగ నిలఁబడి చూచెదరా? ఛీ! ఎంతమాట! పలుచని నీరుకూడ తన చోటనుండి తొలగించినచో బాధ చేయును. ఇంక మీరు మెదలక, ఏమియు ప్రయత్నము చేయక, మీ దేశమును శత్రువుల కప్పగించె దరా? మీరు హిందువులరు! మీరు రాజపుత్రులరు! మీరు క్షత్రి యులరు!- సంభవము కా దనుచుంటిరా? మీమహారాజే జీవించి యున్నచో వారిమెదుట మీ కిట్లు చెప్పుటకు సాహస ముండునది కాదు. వారికై మీ రెల్లరు ప్రాణమర్పించుటకు సిద్ధమగువారలు. వారి యొకదృష్టిచే మీరక్త ముష్ణమయ్యెడిది. వారి యొకమాటచే పది వేల కత్తులు ఒఱలనుండి వెడలునవి. వారు అశ్వారూఢులగుట చూచినతోడనే మీ జయధ్వను లాకాశమునఁ బర్వెడివి! నే నాఁడు దానను. వారి విధవయగు ననాథస్త్రీని. నేను పకీరులు, బిచ్చగాండ్రు

కంటెను తీసిపోయితిని. నామాటను మీ రెందుకు విందురు? నే నిప్పుడు మీరాణిని కాను.

గ్రామవాసులందఱు—నీవు మా మహారాణివి. మేము నీమాట విందుము.

రాణి—వినుచో మీమీ గ్రామములను కుటీరములను విడిచి రండు. ఖడ్గముల ధరింపుఁడు. లెండు. ఈయలసత్వమును త్యజింపుఁడు. ఒకమాఱు దృఢప్రతిజ్ఞచేసి నిలఁబడుడు. తూర్యధ్వానముచే నిద్రించు కొదమసింగములు లేచునట్లు లెండు. తుంబీధ్వని విని బుసకొట్టు పాముల వలె లెండు. పిడుగుచప్పుడులచే కొండగుహాలనుండి వెడలు ప్రతి ధ్వానమువలె లెండు. తుపానులో సముద్రమునుండి లేచు తరంగముల వలె లెండు లెండు. మీ వీరత్వము గుప్తముగాని లుప్తముకాదని రాజస్థాన మెఱుఁగును. ఔరంగజే బెఱుఁగును.

మ. కరవాలంబుల నంది, శాత్రవచమూ కంఠోద్గతా స్రౌఘ ని
ర్ఝర మాజిస్థలి నిండిపాఱఁగ పిశాచశ్రేణి తన్మాంసముల్
పరమప్రీతి భుజింపఁ గూల్చి మన సామ్రాజ్యంబు రక్షించి ది
గ్భరితఖ్యాతి గణింపలెండు జయశంఖధ్వానముల్ ఘూర్ణిలన్.

గ్రామవాసులందఱు—మహారాణీ! మేము యుద్ధముచేసెదము. గాని ఈ యుద్ధములో బ్రిదికివచ్చెద మను నమ్మకము లేదు. చావు తప్పదు.

రాణి—చావు! పుత్రులారా! ఎప్పుడో ఒకనాఁడు చావుండదా? మంచానఁబడి తీసికొని తీసికొని చచ్చుట సుఖమగు చావు కాదు. మీ స్వేచ్ఛచే దేశముకొఱకు, ఇతరులకొఱకు, కర్తవ్యము కొఱకు చచ్చుట సుఖ మగు చావు.

గ్రామ-అందఱు—మేము పోరాడెదము, మీ రెచ్చటకు తీసి కొని పోయెదరో అచ్చటికి వచ్చెదము.

రాణి—ఇదియే మీకు తగినమాట. వినుఁడు. నే నెవ్వరిని బలాత్కారముగఁ బిలుచుట లేదు. ఎవరికి మాతృభూమిపై ప్రేమ యున్నదో, ఎవరికి స్వధర్మముపై భక్తియున్నదో, ఎవరు స్వాతంత్ర్య

మునశ్శై ప్రాణ మర్పింపఁజాలుదురో వారే రండు. వారొక్కొక్కరు నూరుగురకు తుల్యులు. క్షీణసంకల్పులు, సంశయాత్ములునగు మనుష్యులతో నాకు పనిలేదు. నాకు ఏకాగ్రత, దృఢప్రతిజ్ఞగల మనుష్యులు కావలయును. రెండే త్రోవలున్నవి. ఏది కావలయునో యోజింపుకొనుఁడు-ఒక వైపున విలాసము, సంతోషము, సుఖము, భోగము మున్నవి. రెండవ వైపున శ్రమము, అనాహారము, దారిద్ర్యము, దుఃఖము మున్నవి. ఒక వైపున ప్రపంచము, ఇల్లు, వాకిలి, శాంతియు నున్నవి. రెండవ వైపున సమరక్షేత్రము, మృత్యువు నున్నవి. ఒక వైపున స్వీయసుఖ మున్నది. రెండవ వైపున దేశము గుఱించిన కర్తవ్య మున్నది.--యోజింపుకొనుఁడు.

గ్రామ-అందఱు—సంసిద్ధులము, సంసిద్ధులము.

రాణి—అగుచో నేఁడు రాతౌరు లందఱు నొక్క జెండాక్రింద నిలఁబడుడు, మీమీ తగవు లన్నియును మఱచిపొండు. ఒక్కమా అందఱు కలిసి హృదయపూర్వముగ నుచ్చరింపుఁడు- జననీ జన్మభూమికీ జయ్.

శా. చండాంశుప్రభ ఖడ్గము ల్మెఱయ, దోశ్శౌర్యజ్వాలజ్వాల లీ
రెండఁ గ్లాయ, కృతాంతమూర్తులయి, దుర్వార్త్సేన భీతిల్లగా
జెండా నెత్తుఁడు, దేశరక్షణకు మీ ప్రాణంబు లర్పింపఁగా!
రెండో వీరులు, భండనారిరిపులం జెండాడ రండో! యనన్.

గ్రామ-అందఱు— జననీ జన్మభూమికీ జయ్.

తెరవాలును



## చతుర్థ దృశ్యము.



స్థానము—యుద్ధక్షేత్రమున రజియా శిబిరము.
సమయము—రాత్రి.

(వర్షము కురియుచుండును. గాలి వీచుచుండును. మెఱపులు మెఱయుచుండును. మేఘము లురుముచుండును. రజియా గానము చేయును.

రజియా—

### గీతిక.

కారుమబ్బు లాకసమును గప్పెను
కటికిచీకటులు గ్రమ్మె నహా!
భోరుమంచు జలపూరము చిమ్ముచు
ఘోరమారుతము వీచె నహా॥
పెళపెళమని ఘనజలదగర్జనలు
వీనులఁ గడు వేధించె నహా!
తళుకు తళుకు మని తటిద్దాభలు క
న్నుల మిఱుమిట్లులు గొల్పె నహా॥

ఓహో! ఏమి ఈకోలాహలము! సైన్యముల చీత్కారము! ఫిరంగుల మ్రోతలు! యుద్ధవాద్యముల ఘనధ్వానములు! హఠాత్తుగా నేమి యిట్లు కాసాగెను! అబ్బా! చెవులు చిల్లులు వడుచున్నవి! (చెవులు మూసికొనును)

(అక్బరు ప్రవేశించును)

రజియా...ఎవరు? నాయనగారా?

అక్బరు...ఆఁ, రజియా!

రజియా—ఓహో! మీరు ఆపాదమస్తకము చెమటచే తడిసితిరి. బయట ఏమి యీజరుగునది? ఎందుకీ కోలాహలము?

అక్బరు—యుద్ధము జరుగుచున్నది, రాజపుత్రులు మనశిబిరముల ముట్టడించిరి,

రజియా—ముట్టడించిరి నరే, కాని యింత యపవ్వరముగా నఱచెద రేల?

అక్బరు—నీ వెఱుఁగవు రజియా! వ్యవహార మెంత ముదిరిన దనుకొంటివి! కుప్పలు కుప్పలుగా పీనుగులు కూలుచున్నవి.

రజియా—అది నే నెఱుఁగుదును. కాని యింత యఱచెద రేల అని అడుగుచున్నాను.

అక్బరు—ఏమి యట్లనెదవు రజియా—ఇది కేవలము మృత్యువుతో నెదుర్కొనుట. మృత్యువు నింత దగ్గఱగా నే నెన్నఁడును జూడ లేదు. ఓహో! నీ కేమైన తెలియునా బయట నెందఱు చనిపోవుచుండిరో?

రజియా...కనుక నే పారిపోయివచ్చితిరి. నాయనగారూ! భయము వేయుచున్నదా? భయ మెందులకు?

అక్బరు—బహుశః నేఁడు నీవును, నేనునుచావవలసియుందుము.

రజియా—చచ్చుటయే యున్నచో పాడుచు చచ్చెదను. ఒడ్డుతో నెదుర్కొను తరంగమువలె పాడుచు పాడుచు మృత్యువులో లీనమగుదును.

అక్బరు—(చెవి యొగ్గి) ఇది యేమి! మాటిమాటికి రాజపుత్రుల జయధ్వనియే!—ఇదిగో నింకను సమీపించుచున్నది.

(నేపథ్యమున! జయ్ మహారాణీకీ జయ్)

(తహవ్వర్ఖాను ప్రవేశించును)

తహ—యువరాజా! పరుగెత్తుఁడు, పరుగెత్తుఁడు.

అక్బరు—ఎందుకు తహవ్వర్ఖాన్!

తహ—మన మోడితిమి.

అక్బరు...మనసైన్య మేమి చేయుచున్నది?—అంతయు మడిసి వదా?

తహ—లేదు. అంతయు మడియలేదు. ఇట్టిసమయమున బుద్ధిమంతులు చేయువనినే మనవారు చేయుచున్నారు—శత్రువులకు వెన్నిచ్చి తోఁక ముడచుకొని పారిపోవుచున్నారు.

రజియా...పారిపోవు చున్నారా? అది యేమి? పారిపోవుట యెందుకు? సేనాపతీ! రాజపుత్రుల కోడి పారిపోవుట సిగ్గుగాదా!

తహ—వారికి సిగ్గు దేనికి? వా రాఁడువారలుగారు సిగ్గుపడుటకు.

రజియా—నేను పారిపోను. పారిపోవుట యెందుకు? నేను చచ్చి పోవుదును. నాయనగారూ! మీరు మొగలు లయ్యు నేమొగముతో పారిపోవుదురు?

తహ—ఏముఖముగా యుద్ధము జరుగుచున్నదో దానికి సరిగా వెనుక ముఖముగా. ఇంక నేముఖముతో పారిపోవుదురు?

రజియా—నేను పారిపోను.

తహ—మీరు పారిపోవనిచో మేమే పారిపోవుదుము. మీరు ఆఁడువారు—అందుచే మీకు కొంచెము సిగ్గు ఉండవచ్చును. కాని మా కేమియు సిగ్గులేదు!...ఏమి శాహజాదాసాహబ్!

అక్బరు...ఓహో! ఎంతభయంకరమగురాత్రి! ఏమి ఆహాహా కారము! ఏమి హత్య ఏమిహత్య! (బయట) పారిపొండు. పారిపొండు. జయ్ రాణీకీ జయ్! హరహరా!

రజియా...ఓహో! ఏమి ఈకోలాహలము!

తహ—ఏమి యాలోచించుచున్నారు శాహజాదాసాహబ్! నడువుఁడు రండు. మీరు నాకు స్త్రీలకంటె నికృష్టులుగాఁ గనుపట్టు చున్నారు.

అక్బరు—ఓహో ఏమిహత్య! ఏమిహత్య! ఇంతహత్య నే నెప్పుడును చూడలేదు.

తహ—ఇట్లు నిలిచియుండుటచే నేమి లాభము?—ఇదిగో-ఇదిగో-చూడుఁడు. డేరావాకిలియొద్ద - ఈదారినుండి-ఇదిగోశత్రువు-

(తహవ్వర్ఖాను పారిపోవును.)

అక్బరు...రమ్మ రజియా! పోవుదము—మనము పారి పోవుదము.

రజియా...నాయనగారూ!

అక్బరు—ఊర కుండుము. ఇటుల-దారిని మొదలక రమ్ము. (రజియాను తీసికొని అక్బరు నిష్క్రమించును.)

(ఇద్దఱు రాజపుత్ర సైనికులు ప్రవేశించెదరు)

౧ సైనికుడు...ఎవడును లేడు—పారిపోయిరి, ఎటు పారిపోయిరి?

౨ సైనికుడు—ఇటు—(సైనికులు పోవుదురు.)

(సమరదాసును రాజపుత్ర సైనికులును ప్రవేశించెదరు.)

సమర—అహుడు—భగవాన్ ఏకలింగకీ జయ్.

అందఱు...జయ్ భగవాన్ ఏకలింగకీ జయ్.

సమర—భీమసింహుడెచ్చట?

౧ సైనికుడు—వారు కనుపించుట లేదు.

సమర—పొండు ఆయనజాడ తెలిసికొనిరండు.

(సమరదాసుదక్క అందఱు పోదురు.)

సమరదాసు—

మ॥ జయ దుర్గా! జయ చండికా! జయ శివా! సమగ్ర ధర్మక్రియా
క్షయయజ్ఞం బిది యీయజాశముని దుర్గాదాసు, దుష్టమ్లేచ్ఛమూ
హాయ మాతంగము లింధనంబులు, సదస్యవ్రాత మస్మద్భటుల్
జయఖడ్గాంశువు లగ్ని, నీ స్మరణ ఋక్చక్రంబు, దాక్షాయణీ॥

ఆహా! ఏమిరాత్రి! ఏమియుద్ధము! ఎంత భయంకరములు హత్యలు!!

---

## పంచమ దృశ్యము

---

స్థానము—మేవాడ పర్వతదుర్గము, కొలనియొద్దన రెండు శిలా వేదికలు.

సమయము—వెన్నెలరాత్రి.

(కమల యొక వేదికపై గూర్చుండి గానము చేయుచుండును. జయసింహుడు వెనుకప్రక్క పొదచాటున నిలఁబడి వినుచుండును.)

నే సైపఁజాల నో ప్రియా! నిర్దయహృదయా!
గాసిలఁజేయక కౌఁగిటఁ జేరిచి కావ వదేమో మరియాదా!

వాసిగ ప్రేమామృత మిడి హృదయపిపాస యడంపవె నాథా॥
కుసుమసుగంధిత కుంజమ్ములు వనగుంజిత మర్మరస్వనముల్,
అసమకోకిలాలాపంబులు శిశిరానిలమృదుఖేలనముల్॥
మిటుకుమిటుకుమని మించుతారకల మిన్ను శోభ వహించెఁ,
చటులచంద్రిక దాల్చె శరన్నిశ శాంతి గడుఁ భువి గాంచెఁ॥
చెఱఁగుపఱచి యతిశంకితమతినిఁ జింతించుచు గూర్చుంటిఁ।
సరగున రమ్ము ప్రియా! చిరవాంఛిత! సారెకు వేచుచునుంటిఁ॥

కమల—(తిరిగి) ఎవరు? మీరా!

జయ—ఆఁ! నేనే.

కమల...ఎంత సేపునుండి నిలిచియుండిరి?

జయ—చాలసేపునుండి.

కమల—నిలఁబడి ఏమి చేయుచుంటిరి?

జయ—వినుచుంటిని.

కమల—ఏమి ?

జయ—వీణాధ్వనితోఁడి మృదంగమును!—ఏమివినుచుంటినా? ఏమి వినుచుంటినో అది సరిగా చెప్పఁజాలను. కాని నేను వినుచున్న దానిని పూర్వ మెన్నఁడును వినియుండ లేదు.

కమల— తెలిసినది. నా గానమును వినుచునుంటిరి.

జయ—గాన మే యయియుండవచ్చును. నేనుమాత్రి మింత వఱకు నిచ్చట లేను....ఒకానొక స్వప్నరాజ్యమున నుంటిని. కాని వినుచుంటినో లేక చూచుచుంటినో!—బహుశః చూచుచు నేయుం టిని. కొన్ని సుందరకిశోరస్వరములు తయ తెల్లనిఱెక్కలు విప్పి ఆకాశ మున తిరుగుచున్నవి. తుద కాస్వరములు మఱియు దట్టమై మఱియు గద్గదములై, మఱియు నుజ్జ్వలములై ఒక్కొక్కటిగా నక్షత్రములలో లీనమైనవి !

కమల—ఇంక మీ యీకవిత్వమును గట్టిపెట్టుము. మీకవి త్వములోని యొక యక్షరమును నా కర్థమగుట లేదు. వాడుకభాషలో చెప్పిన కొంచెము తెలిసికొందును.

జయ—కమలా! నీ విది హృదయముతోఁ బాడుచుంటివా? లేక జ్ఞప్తికి వచ్చినదానిని పాడుచుంటివా?

కమలా—మీ కెట్లు గనుపట్టుచున్నది?

జయ...నేను సరిగా చెప్పఁజాలను. కాని మధ్యమధ్య నీవు తాంత్రిక మెఱుఁగుదువనియు, కమలా! నాపై తాంత్రికము చేయుచుంటివనియు తెలిసికొంటిని.

కమల—తాంత్రికము చేయనవసరము లేదు. స్వయముగ మీరే తాంత్రికము.

జయ—నేను కేవలము నిర్జీవుఁడ, నిస్తేజుఁడ, అకర్మణ్యుఁడనైతిని. ఇది ప్రేమయో లేక మోహమో?

కమల—ఏమేని యనుడు, ఫల మొక్కటియే కనుపట్టుచున్నది. మీరు నాకు వశమైతిరి.

జయ—ఇది ప్రేమయే యగుచో చాల భయంకరము!

కమల—భయంకరమా?

జయ—భయంకరముకాదా? ఏ ప్రేమ ఉత్సాహమును, తేజమును పోఁగొట్టి మనుష్యుని జ్ఞానశూన్యునిగఁ జేయునో, అది భయంకరముగాక మఱేమి? ఏ ప్రేమలో మనుష్యుఁడు సర్వప్రపంచమును మఱచి-తన మనుష్యత్వమును పోఁగొట్టుకొనునో ఆప్రేమ—ఆయవస్థ నిజముగ భయంకరము!

కమల—నిశ్చయము! ఇది చాల భయంకరము! రోగము కఠినమైనది! దీనికి చికిత్స చేయవలయును. పెద్దరాణిని పిలుతునా! ఆమెయే మీరోగము కుదుర్పఁజాలునది. చూచితిరా, నాఁడు రెండు మూఁడు కఠినవచనములు పల్కి మిమ్ము యుద్ధమునకు పంపినది. పిలుతునా?

జయ—వద్దు కమలా! ఈ రోగమున కామెయు చికిత్సచేయఁజాలదు. ఇది అసాధ్యరోగము—దీని నెవ్వరును కుదుర్పఁజాలరు. వినుము కమలా—మార్వాడపైకి బాదుషా దండెత్తివచ్చెను. తండ్రిగారు నన్ను పిలిపించి "పొమ్ము పుత్రా! దుర్గాదాసునకు సహాయము చేయుము" అని చెప్పిరి. నేను తలవంచుకొని యూరకుంటిని. మరల

వారు "ఏమి జయసింహా! యూరకుంటి వేల?" యనిరి. మరల నేను తలవంచుకొనియే యుంటిని. అప్పుడు వా రిట్లనిరి. "తెలిసినది, మంచిది. నీ విఁక నంతఃపురములోనికి పొమ్ము. భీమసింహుని పంపించెదను." నేను తలవంచుకొని తిరిగివచ్చితిని. తర్వాత సరస్వతి వచ్చి యొక కసరు కసరుకొనినది. నే నేమియు పలుక లేదు. మనస్సులో నాపై నాకే ధిక్కారభావము గల్గినది!—కమలా! న న్నిట్టుల నీ వేమిచేసితివి? న న్నెట్టి మోహములో ముంచితివి!—ఎట్టి మైకములోఁ బడఁగొట్టితివి!

కమలా... కాని నే నేమియు మీకు మందు మాకు పెట్ట లేదు. ధర్మసాక్షి. నాపై వృథాగా దోషము పెట్టుచున్నారు.

జయ—లేదు కమలా! నేను నీపై దోషము పెట్టుట లేదు—ఒకరోజున 'రూపము మద్యమా' యని ని న్నడిగితిని; కాని నా కిపుడు గనుపట్టుచున్నది రూపము—

కమలా—నల్లమందు మైకము! నేను నిదియే నాఁడు చెప్పితిని. కాని మీరు నమ్మ లేదు.

జయ—కమలా! నేను నిన్ను ప్రేమించుచున్నాను.

కమలా—ఇది చాలపర్యాయములు వింటిని.

జయ—ఎన్నిమాఱులు చెప్పినను తృప్తితీఱదు. అందుచే మరల నిన్ను ప్రేమించుచుంటినని యనుచున్నాను. ఇట్లనుట నాకు చాల బాగుగ నుండును.

కమలా—అగుచో మీయిచ్చవచ్చినన్నిమాఱు లనుఁడు. కాని నోటితో నేమేని యనుఁడు. క్రియమాత్రము పెద్దరాణి చెప్పినట్లు చేయుఁడు.

జయ—నేను!

కమలా—ఆఁ. మీరు కానిచో నేనా?—నేను నోటిమాటలకే మీకు ప్రియురాలను, క్రియకు పెద్దరాణియే.

జయ—ఎట్లు?

కమలా—మీ రెఱుఁగరా? చెప్పనేల? (అభిమానముతో నిష్క్రమించును.)

జయ—వినుము కమలా!... వద్దు. స్త్రీలకు క్షణమాత్రమే. కోపము. పరమేశ్వరా! నీ వెట్టి యపూర్వజాతిని సృజించితివి! నవ్వులు, ఏడ్పులు!—ఎండ, వాన... ఎట్టి యపూర్వసృష్టి!

(సరస్వతి ప్రవేశించును.)

సర—నాథా!

జయ—సరస్వతీ!

సర—మార్వాడలో మొగలులకు రాజపుత్రులకు జరిగిన యుద్ధపర్యవసానము వింటిరా?

జయ—లేదు.

సర—వినెదరా? అవకాశ మున్నదా?

జయ—చెప్పుము.

సర—యుద్ధములో మార్వాడయే జయించినది కాని—

జయ—కాని?

సర—మీయన్నగారిపు డీలోకమున లేరు.

జయ—ఎవరు భీమసింహుఁడా?

సర—(గద్గదస్వరముతో) అవును. వారు మార్వాడరక్షణార్థమై ఈయుద్ధములో ప్రాణము లర్పించిరి.

జయ—అన్నా! గొప్ప యుదారుఁడవును, వీరోత్తముఁడవు నగు నీవు అక్షయస్వర్గమునకు పోతివి.

సర... మఱి మీరు?

జయ—బహుశః నరకమునకు.

సర—నిశ్చయము (నిష్క్రమించును.)

జయ—సరస్వతీ! న న్నేవగించవద్దు. నేను దయాపాత్రుఁడను-అసమర్థుఁడను! అదిగో! నాయనగారు వచ్చుచున్నారు. వెంట మార్వాడ రాణియు, సమరదాసు నున్నారు. నేను నాయనగారి తిరస్కార కరుణాదృష్టిని సహింపఁజాలను (నిష్క్రమించును.)

(రాజసింహుఁడు, మహామాయ, సమరదాసు ప్రవేశించెదరు.)

రాజ... ఇక్కడనే కూర్చుందుము మహామాయ. లోపల చాల వేడిగానున్నది- ఈవెన్నెలలో కూర్చుండుము-ఈస్థానము భీమసింహు నకు చాల ప్రియమైనది. అతఁడు ప్రభాతసమయమున ఇచ్చటనే కూర్చుండి ఏకాగ్రభావముతో ఈ నీల సరోవర శోభను గాంచు చుండెడువాఁడు.

(అందఱు శిలావేదికపైఁ గూర్చుందురు.)

రాణి—మహారాణా! భీమసింహుని వీరత్వవర్ణన మితిహాసములో సువర్ణాక్షరములతో వ్రాసియుంచఁదగినది.

రాజ—నే నతనిని పోఁగొట్టుకొంటిని.

రాణి—రాణా! క్షత్రియునకు యుద్ధములో మరణిం చుటకన్న వేఱు గౌరవమరణ మే మున్నది? భీమసింహుఁడు నాకొమా రుఁడే యగుచో, ఇంకొకరీతిగా నతని మృత్యువును గోరను.

రాజ...నీవు చెప్పినది నిజము మహామాయా!—చెప్పుము సమరదాస్! భీమసింహుఁ డెట్లు యుద్ధము చేసినాడు?

సమర—అట్టియుద్ధము నేటివఱ కెవ్వరును చేసియుండరు, మహారాణా! వినుఁడు—నాటిరాత్రి కటికిచీఁకటిగా నుండెను. ఆకాశ మున మబ్బులు గ్రమ్మెను. కడవలతో నెత్తిపోసినట్లు వర్షము గురి యుచుండెను. ఆ కటికిచీఁకటిలో చేతికి చేయి గనుపించుట లేదు. మాటిమాటికి మెఱయు మెఱపులచేతనే ఆ చీఁకటిరాత్రి భయంకర త్వము గనుపట్టుచుండెను. ఉఱుము లాభయంకరత్వమును బెంచు చుండెను. ఆహా! ఎంతభయంకర మగు రాత్రి!

రాణి—తర్వాత?

రాజ—(ఉద్భ్రాంతభావముతో) ఇట్టిరాత్రి!

సమర...ఆ భయంకర రాత్రియందు మీ వీరపుత్రుఁడు మే మెంత వల దన్నను కేవలము పదివేల మేవాడసైన్యమును దీసి కొని మొగలశిబిరమును ముట్టడించెను-- మొగల సైన్యము లక్షను మించి యుండును,

రాజ-(ఉద్భ్రాంత భావముతో) నేనే వానిని వెడలఁగొట్టితిని! వానిని వెడలఁగొట్టితిని!

రాణి—ధన్యుఁడవు శిశోదీయకుమారా! తర్వాత?

సమర—తర్వాత హరాహరా యను సింహనాద మహామేఘ గర్జితమును కూడ కప్పివేసెను. మఱియు శత్రువుల యార్తనాద ములో వజ్రపాతధ్వని లీన మయ్యెను.

రాజ—(ఉద్భ్రాంతభావముతో) నేను స్వయంకృతాపరాధ మునసే అతనిని పోఁగొట్టుచుంటిని.

రాణి...తర్వాత?

సమర—అప్పుడు నేను పదివేల రాథోరుసైన్యమును దీసికొని భీమసింహుని సహాయమునకై పోతిని. పోయిచూచితిని— అవిద్యుత్ప్ర కాశమున నేను చూచిన దృశ్య మెన్నఁడును మఱవఁజాలను రాణాజీ!

రాజ—(ఉద్భ్రాంతభావముతో) ఆరోజున వాఁడు చెప్పనే చెప్పె—అబ్బాయి చెప్పనే చెప్పె, నే నీ యుద్ధములో ప్రాణ మర్పింపఁ బోవుచున్నానని.

రాణి—చెప్పుము సమరదాస్!

సమర—మహారాణీ! మెఱపువెలుఁగునఁ జూచితిని. శత్రు సైన్యము తుపాకులు, ఖడ్గములు, బల్లెములు మొదలగునవి పుచ్చుకొని వరుసగ నిలఁబడినది. భీమసింహుని సైన్యము విశ్వగ్రాసియగు ప్రళ యోచ్ఛ్వాసమువలె దానిపై వెళ్ళిపడెను. అంత శత్రువుల ఫిరంగుల నుండియు, తుపాకులనుండియు అగ్నివర్షము కురియసాగెను. ఏమి భయంకర యుద్ధము! ... నా కది యొక అగ్నిపర్వతజ్వాలకును ఝంఝామారుతమునకు జరుగుయుద్ధముగా గనుపట్టెను.

రాణి—ధన్యుఁడవు భీమసింహా! —తర్వాత?

రాజ— (ఉద్భ్రాంతభావముతో) అలిగి వెళ్ళిపోయినాఁడు. నాపై నలిగి వెళ్లిపోయినాఁడు.

సమర—ఆ సమయమున భీమసింహుఁడు నా కామెఱపు వెలుఁగున ఉన్మత్తునివలె...సాక్షాత్తు ప్రళయమువలె—గనుపట్టెను.

ఎక్కడ శత్రుసైన్య మధికముగ నుండెనో అక్కడనే భీమసింహుఁడు గనుపట్టుచుండెను. అతని పదివేల సైన్యమును పదిలక్షలుగ నుండెను. భీమసింహుఁ డొక్కడే పదుగురు సేనాపతుల వలె పనిచేయుచుండెను!

రాణీ—భీమసింహా! భీమసింహా! నీవు నాపుత్రుఁడ వగుచో--

రాజ...(నిట్టూర్పు విడిచి) అలిగి వెళ్ళిపోయినాఁడు.

రాణి—తర్వాత?

సమర—ఈసమయముననే రాఠౌరుసేనయు మేవాడ సేన వద్దకు సహాయార్థము వచ్చెను. మాసేన వచ్చినతోడనే శత్రుసైన్యము పటాపంచలై ప్రాణాలతో పారిపోయినది. మేము చాలదూరము వఱకు శత్రువులఁ దఱిమితిమి.

రాణి—తర్వాత?

సమర...శిబిరములకు తిరిగివచ్చితిమి. అచట భీమసింహుఁ డగపడలేదు. మరునాఁ డుదయ మతనిశవము యుద్ధరంగమున కనఁబడినది.

రాణి—మహారాణా! మీ పుత్రుఁడు నేఁడు స్వదేశరక్షణ మొనర్చినాఁడు.

రాజ...భీమసింహా! భీమసింహా! కుమారా! కుమారా! (మూర్ఛపోవును.)

---

షష్ఠదృశ్యము.

స్థానము—మొగలులశిబిరము.

సమయము—మధ్యాహ్నము.

(అక్బరు, తహావ్వర్ఖాను కూర్చుండియుందురు.)

అక్బరు...తహావ్వర్ఖాన్! ఏమందువు? మన మీ యుద్ధములో పూర్తిగా నోడినట్లే.

తహా...పూర్తిగా నోడినట్లే. ఇం దేమియు పొరపాటులేదు.

అక్బరు—ఈ రాజపుత్రు లెంత వీరులు! ఫిరంగిగుండులను మిత్రులవలె పిలిచెదరు. ఖడ్గధారను ప్రియసినివలె కౌఁగిలించెదరు,

తహ—కాని వారిఖడ్గధార సరిగా పేర్రియసివలె వచ్చి మనకు కంఠాశ్లేష మిచ్చునని నేను చెప్పఁజాలను యువరాజా! అది సరిగా వేశ్య వలె తటాలున వచ్చి మనకంఠమును చుట్టుకొనును.

అక్బరు—ఏమిజాతి! పిడుగువంటి సాహసముగలది; ఆకాశము వలె నిర్మలము; సముద్రమువలె ఉదారము;—ఏమిజాతి!

తహ... ఈజాతి యగుటకు మంచిదే, కాని యొకదోష మున్నది. యువరాజా!--తప్పించుకొొందమనిన అవకాశ మీయదు. ఒక్కమాఱుగ మీఁదఁబడి చచ్చుటకును చంపుటకును సిద్ధమగును. చూచితిరా నిన్నరాత్రి నిర్భయముగ డేరాలో నిద్రించుచుంటిని. బయట గాలి వాన గాఢముగా నుండెను. ఇట్టిసమయమున ఏపెద్దమానిసియు గడప దాటుటకు సాహసింపఁడు; కాని రాజ పుత్రుల కిది యొకలెక్కయే లేదు, ఆ గాలివానలోనే వారు తటాలున మనశిబిరములోఁ జొరబడిరి. కత్తులు కటారులు తీసికొని రానిచో వీరు తమాషాకే వచ్చినారని యనుకొనువాఁడను.

అక్బరు—సుభానల్లా! ఎట్టిశౌర్యోత్సాహములతో ముట్టడించిరి!

తహ—మనసైన్యముమాత్ర మెంత చక్కగా పారిపోయినది! సుభానల్లా! అట్టి చీఁకటిరాత్రిలో ఎదురుదెబ్బ తగిలికూడ పడలేదు.— ఎంత యాశ్చర్యము!

అక్బరు—ఈ పరాజయవార్తను విని నాయనగారేమందురు?

తహ—అది నేను సరిగా చెప్పఁజాలను, కాని ఇది నిశ్చయము; తినుటకు మిఠాయి పెట్టరు. నాతో వచ్చునపుడు స్పష్టముగ శుద్ధముగు ఉర్దూలో చెప్పిరి- 'ఈ యుద్ధములో నోడివచ్చినచో నా రెండు చేతులకు రెండు ఇనుపగాజులు తొడిగించెద' మని; కాని యిదిమాత్రము సరిగా తెలియదు. లంగాకూడ కట్టించెదరేమో!

అక్బరు... పరిహాస మట్లుంచుము, ఇప్పు డేమి యుపాయము? రాజపుత్రులతో పోరాడి గెలుచుట కేమియు నాశ లేదు.

తహ—ఈజాతితో యుద్ధము చేయుటయు సరికాదని నా యభిప్రాయము.

అక్బరు—ఎందుకు?

తహ—వీరు యుద్ధము చేయుటయే యెఱుఁగరు, నాఁడు మేవాడలోఁ జూచితిరా? అన్నపానములు వదలి చంపుటకు బయలుదేరిరి. ఇది యేశాస్త్రములో వ్రాయఁబడినది? అటుపిమ్మటను ఇచ్చట యుద్ధసన్నాహము చేయక పూర్వమే వచ్చి ముట్టడించిరి. ఇది యెక్కడి వింత! పోరాడఁదలచినచో పోరాడుము. కత్తిపట్టుము. రెండడుగులు ముందుకు రమ్ము, రెండడుగులు వెనుకకు పొమ్ము. రెండు దెబ్బలు కొట్టుము, రెండు దెబ్బలు పడుము. అంతేకాని ఇది యెక్కడిసంగతి! హఠాత్తుగ మీఁదఁబడి యొకమూలనుండి నఱక నారంభించుటయా! మన తలలు బేవారసుసొత్తు అనుకొనినారు కాఁబోలు?

అక్బరు—కాదు తహవ్వర్ఖాన్! నే నీజాతిని చూచినకొలఁదిని ముగ్ధుఁడ నగుచున్నాను!—వీరిసహాయమే నాకున్నచో ప్రపంచమంతయు జయించెదను.

తహ...వీరిసహాయ మున్నచో జయింపఁ గల్గుదురు. లేనిచో లేదు. మంచిది! ఒకపని చేయఁగలరా?

అక్బరు—ఏమి?

తహ—ఆఁ—ఇది చాల సులభమైనపని. ఇంతవఱకు నాకు తోఁచనే లేదు—చాలసులభమైనది. ఇది యేమియు కఠినమైనదికాదు.

అక్బరు—ఏమి! ఏమి!

తహ—నే నాలోచించినకొలఁది సులభముగ తోఁచుచున్నది. వినుఁడు—మీరు బాదుషా కాఁగోరుచున్నారా?

అక్బరు—ఎట్లు?

తహ—ఎట్లా?—ఇంత దాచుటచే పని కాఁజాలదు. ముందు ఇది చెప్పుడు, మీరు కోరుచున్నారా లేదా?

అక్బరు—ఆఁ! కోరుచున్నాను.

తహ—కాని చక్రవర్తిత్వము వీథివీథిని పడి తిరుగుచున్నదా?

అక్బరు—నీవే చెప్పుచుంటివిక దా?

తహ-ప్రయత్నము లేకుండ నేమియు కాఁజాలదు. చక్రవర్తి యగుటకు ఒక్కటే చాల సులభమగు నుపాయము.

అక్బరు— ఏమి ఏమి?

తహ—ఇదియే రాజపుత్రజాతి—హాహాహా—ఇది చాల సులభము!

అక్బరు—ఎట్లు? చాల సులభము.

తహ—చాలసులభము!—చెప్పుదునా యువరాజా? ఈ రాజపుత్రజాతి చాలగొప్పది. వీరు ఊహించుఁడు, వీరు ఔరంగజేబును సింహాసనమునుండి దింపి మిమ్ము కూర్చుండఁబెట్టినచో నేమేని బాధ యున్నదా? మనసైన్యము రాజపుత్రసైన్యము రెండు కలిసినచో—

అక్బరు-సేబాస్! నేనును సరిగా నిదియే యాలోచించుచుంటిని సుభానల్లా!

తహ-మఱి వినరేమి? ఇది వేశ్యాగానముకాదు. సరిగా వినకయే సుభానల్లాయని యఱచుటకు. సాంతముగా వినుఁడు—ఇప్పుడు రాజపుత్రులు మనతో కలియుదురా లేదా యనునదియే ప్రశ్న, మనతో వారికి భోజనాదికము లేదుగదా!

అక్బరు—అవును. ఈప్రశ్న తప్పక వచ్చును!—ఔరా! అనుకొనిన దానికి భంగము వచ్చెనే!

తహ—కాని దీనికి జవాబు చాల సులభము.

అక్బరు—ఏమి?

తహ—దీనికి జవా బిదియే. వా రెందుకు కలియరు?

అక్బరు...వహ్వా! చాల సులభమగు నుపాయము!

తహ—రాజపుత్రులు దారాపక్షమున యుద్ధము చేయలేదా? మఱియు బాదుషాపక్షమున యుద్ధము జేయలేదా?

అక్బరు—నేను నదియే చెప్పుచుంటిని.

తహ—కాని—

అక్బరు—మరల కాని?

తహ—కాని ఈవిషయములో నిశ్చితము చేసికొన వలసి యున్నది. నేను చెప్పున దేమన మన మొకమాఱు రాఠౌరుదుర్గాదాసుతో యుక్తిగా మాటాలాడిచూచినచో సర్వము పరిష్కారమగును.

అక్బరు—నేను నదియే చెప్పుచుంటిని—ఇంక నీవు రాజపుత్రుల శిబిరములోనికిఁ బొమ్ము.

తహ—ఈవిషయములో నా కొకబాధ యున్నది. ఆ సమయమున దుర్గాదాసు అదేవిధముగ కత్తిదూసి ముక్కుముందు తిప్పినచో ఇంక నాకు మెడకాయపై తలకాయ యుండదు.

అక్బరు—దుర్గాదాసు కత్తి తీయఁడు.

తహ—తీసినచో?

అక్బరు—అప్పుడు "ఆఁ" యనుము.

తహ—అప్పుడు "ఆఁ" యనుట కవకాశ మెక్కడ? నాతలయే నఱుకఁబడినచో నింక నేను "ఆఁ" యనుట యెట్లు?

అక్బరు...అగుచో నింక నేమి చేయవలయును?

తహ—ఒక యుపాయ మున్నది. దుర్గాదాసు నిచ్చటకు పిలిపించుఁడు. పర్వతము మహమ్మదునొద్దకు రానిచో మహమ్మదే పర్వతము వద్దకు వచ్చును.

అక్బరు—మంచిది...ఇదియు కావచ్చును! నేను నిదియే...

తహ...ఇదియు! కావచ్చినచో నిదియే యగును. గడబిడయంతయు పోయినదిగదా, ఇంక నేను కొంచెము విశ్రమించుటకు పోయెదను. (సలాము చేసి తహవ్వరఖాను నిష్క్రమించును.)

అక్బరు—(తనలో) చెడు గేమి యున్నది! ఇదిదక్క నేను బాదుషా యగుటకు వేఱొం డుపాయము గనుపట్టదు—కనీసము ఆజిము జీవించి యుండగ— ఓహో! మేఘ మెటుల గర్జించుచున్నది!

(రజియా ప్రవేశించును.)

రజియా—నాయనగారూ! బయటికి రండు. వడగండ్లు పడుచున్నవి.

అక్బరు—పడనిమ్ము.

రజియా—చూడరు? (చేయి పట్టుకొని లాగును.)

అక్బరు—హిశ్! నీకు సిగ్గులేదా? ఇంతపెద్దదానవైతివి. పో.

(విషణ్ణభావముతో రజియా నిష్క్రమించును.)

అక్బరు—చూచెదను! ఒడ్డునకూర్చుండి యలలు లెక్కవెట్టుటచే నేమి ప్రయోజనము? ఉఱికిచూచెదను. ఏమగునో యగును—రమ్జాన్! సారాయి తెమ్ము! వేశ్యాదుల నాడేరాలోనికి రప్పింపుము.

---

సప్తమదృశ్యము,

స్థానము—మొగలుల శిబిరము.

సమయము— రాత్రి.

(కిరీటమును ధరించి యక్బరు సింహాసనమునఁ గూర్చుండును. శిరమున రాజచ్ఛత్ర ముండును. ఇరుపార్శ్వముల నిద్దరు స్త్రీలు వింజామరలు విసరుచుందురు. ఎదుట సభ్యులు వేశ్యలు నుందురు.)

అక్బరు—నేను రెండవనంబరు బాదుషాఅక్బరును—అగునా?

౧ సభ్యుఁడు—అవును.

అక్బరు—నాతలపై కిరీట మున్నదా?

౨ సభ్యుడు—చిత్తము.

అక్బరు—నాజెండా ఎగురుచున్నదా?

3 సభ్యుఁడు—ఆఁ. బాగుగ ఎగురుచున్నది, హుజూర్!

అక్బరు—చాలు. ఇంక నేమియు నక్కఱలేదు. పాడుఁడు.

(వాద్యములు మ్రోగును.)

అక్బరు—ఆగుఁడు... ముసలి బాదుషా యిప్పు డేమి చేయుచున్నాఁడో చెప్పఁగలరా?

౪ సభ్యుఁడు—పారిపోయినాఁడు.

అక్బరు—ఉఁహూఁ—అతఁడు పారిపోవువాఁడుకాడు. అతఁడు యుద్ధము చేయును, ఊరక విడుచునా?— యుద్ధముచేయుగాక, ఏమి

భయము ! నావైపున దుర్గాదాసున్నాడు. నేనెవ్వరికి జడియను—మీరు దుర్గాదాసు నెఱుగుదురా?—అతనికి మొసలి బాదుషాకూడ భయపడును.

3 సభ్యుడు—ఆఁ. భయపడునా ! హాః హాః హాః !

అక్బరు ... చాలభయపడును!- ఆరోజున చిత్రకారుడు శివాజీ దుర్గాదాసులబొమ్మలు వ్రాసి నాయనవద్దకు తెచ్చినాడు. శివాజీ బొమ్మను జూచి నాయన యనినాడు "ఇతనిని నేను వశపఱచుకొనఁగలను, కాని దుర్గాదాసు నన్ను తిప్పలుపెట్టును."

౨ సభ్యుడు ... రెండుబొమ్మలు నెట్లు చిత్రింపఁబడినవి ?

అక్బరు ... శివాజీ సింహాసనమునఁగూర్చుండెను. శిరమున కిరీటమును, లలాటమున తిలకముండెను. కాని దుర్గాదాసు గుఱ్ఱముపై నెక్కి బల్లెపుమొనచే మొక్కజొన్నకండెను గ్రుచ్చి కాల్చుకొనుచుండెను.

౨ సభ్యుడు—ఆరే బాబా! విననమాత్రనే మాకు భయము గల్గుచున్నది. ఇంక బాదుషా—

అక్బరు—బాదుషా యెవరు?

౧ సభ్యుడు—(రెండవ సభ్యునితో) అవును బాదుషా ఎవరు?

అక్బరు—బాదుషా నేనే.

౨ సభ్యుడు—ప్రభువులే బాదుషా. ఖుదావంద్!

అక్బరు—చాలు. ఇంక పాడుడు.

(వాద్యములు మ్రోగును.)

అక్బరు—ఆఁ. వినుఁడు, దుర్గాదా సెక్కడకు వెళ్ళినాడుకి ఎవ్వరేని యెఱుఁగుదురా?

3 సభ్యుడు—లేదు, మే మెఱుఁగము.

అక్బరు—ఆఁ. ఉదయపురము వెళ్ళినాడు ... కాని నాహుకుము లేకుండ ఎందుకు వెళ్ళినాడు?—నేను బాదుషాను—ఇది యతఁడెఱుఁగఁడా?—ఎందుకు వెళ్ళెను?

౨ సభ్యుడు—అవును. ఎందుకు వెళ్ళినాడు?

అక్బరు—ఆఁ, రాణారాజసింహునకు జబ్బుగా నున్నదని విని వెళ్ళినాఁడు. మంచిది. ఈమాఱు వానిని క్షమించితిని.

౨ సభ్యుడు—హుజూరే తల్లిదండ్రులు.

అక్బరు—నేను బాదుషాను.

౧ సభ్యుఁడు—అవును. హుజూరే బాదుషా—మఱియెవ్వరు?

అక్బరు... ఇంక పాడుఁడు.

# గీతిక

అహా! ఏమి యీమాధుర్యము హృదయానంద సమాపాదకము।
మహేంద్రనందనవనంపుశోభఁ మహిఘన మోహోత్పాదకము॥
రూపతరంగముల్ బా ణోపమా పాంగముల్
ఏపుమీఱె పూబోఁడులకుఁ మది నింక స్థైర్య మది దీఱెన్।

విపంచీనాదము శ్రుతి విహిత మృదంగనాదము
నిపుణనృత్యతాళవినోదమ్ములు నిండుమోదమును గూర్చెను।

[ఈనడుమ రజియా వచ్చి దూరముగ నొకమూలనిదిమ్మపై కుడిముంజేయి యుంచి, కుడియఱచేత చిబుక ముంచుకొని పాట వినును.]

అక్బ—సుభానల్లా!-స్వర్గములో నీసామగ్రి యున్నచో నిశ్చయముగ నది విలాసస్థానమే

రజియా—(తనలో) భూపాలిలో ప్రతిమధ్యమ ముండదు.

అక్బరు—రజియా! నీ విచ్చటనే యుంటివా?

రజియా—మిశ్రభూపాలి కావచ్చును-నాయనా! అమ్మ పిలుచుచున్నది.

అక్బరు... నీఅమ్మ తలకాయ! పిలుచుట కిదియే సమయమా? ఛీ! అంతయు పాడుచేసినది.

సభ్యులు—అంతయు పాడుచేసినది. బాదుషా! అంతయు పాడుచేసినది!

అక్బరు—పో-లోపలికి పో-నీకు సిగ్గు లేదు!-ఇట్టి నిండుదర్బారు లోనికి వచ్చితివి?

రజియా—అమ్మ పిలుచుచున్నది. ఆమెకు చాల జబ్బుగా నున్నది.

అక్బరు—అయిననేమి?-జబ్బుగానున్నచో వైద్యుని పిలువుము. నే నేమి చేయుదును? నే నిప్పుడు రాను.

రజియా...ఆమెప్రాణము పోవుచున్నది. ఆమె మరణించుటకు ముందు మిమ్ము నొకమాఱు చూడఁగోరి నన్ను పంపినది.

అక్బరు...చూడుఁడు. ఏమయ్యెనో! ఆట నంతయు పాడుచేసినది!...చచ్చుట కింకొక సమయము లేదా! పో--ఓయీ! ఎవ రక్కడ?

(రజియా నిష్క్రమించును.)

అక్బరు...దీనికి లోపలికిఁ గొనిపొమ్ము...ఈడ్చుకొనిపొమ్ము. ఏమి చూచుచున్నావు! ...

ద్వార...(రజియాచేయి పట్టుకొని) నడువుము అమ్మా!

రజియా...జాగ్రత్త!--నాయనా! నేను మీకొమార్తెను. ఒక భృత్యుడు వచ్చి నాచేయి పట్టుకొనుచున్నాడు.

అక్బరు—నాహుకుము.

రజియా—మీహుకుము!—నాయనా!— (అవమానముచే నేడ్చుచు పోవును.)

అక్బరు—అంత పాడుచేసినది! అంత పాడుచేసినది! ఆఁ—పాడుడు—ఆడుడు.

(మరల వాద్యములు మ్రోగును, ఈసమయమున తహావ్వర్ఖాను ప్రవేశించును.)

అక్బరు—ఎవరు! తహావ్వర్ఖానా? సేనాపతియా?

తహా—యువరాజా—

అక్బరు—ఇదిగో యువరా జేమి? బాదుషా యనుము. ఇటు చూచుటలేదా? (ఛత్రము చూపించును)

తహా—చూడ కేమి! నే నిక్కడ చూచుచున్నాను. మీరు కొంచె మక్కడకు వెళ్ళి చూడుడు.

అక్బరు—ఏమి! అక్కడ నే మైనది?

తహ—రాజపుత్రులు మిమ్ము విడిచి వెళ్ళిపోయిరి.

అక్బరు—విడిచి వెళ్ళిపోయిరి! తహావ్వర్ఖా! నీ కేమేని కొంచెము మత్తెక్కెనదా? కల్లు త్రాగితివా? సారాయియా? రాజపుత్రులు విడిచి వెళ్ళిపోయిరా! ఇదికూడ జరుగునా?

తహ—జరుగునో లేదో; కాని జరిగినదిమాత్ర మదియే.

అక్బరు—ఎట్లు?

తహ—యువరాజా! రాజపుత్రుల కెవ్వరో మీరు బాదుషాతో నేకీభవించిరని చెప్పిరి.

అక్బరు—బాదుషా యెవరు? యువరా జెవరు? హిశ్! నీవు వచ్చి అంతయు పాడుచేసితివి!

తహ—బయటికి వచ్చి చూడుడు—రాజపుత్రుఁ డొక్కడును లేడు, అంతయు పాడైపోయినది.

అక్బరు—ఏమి యట్లనెదవు? మనసైన్యమో? (వాద్యములు వాయించువారితో) అరే ఊరకొనుడు.

తహ—బాదుషాతో కలిసినది.

అక్బరు—దగా! దగా!—తహావ్వర్ఖాన్! ఇది నీకపటమే.

తహ—యువరాజా! మీరు మద్య మెక్కువ త్రాగితిరి. నా కపటమా? ఇతరుల కపటకపట మని తనముక్కు కోసికొనుటయా? ముందు నాతల నఱికెదరు! ఇంక నాట కాచుకొనుఁడు.

అక్బరు....నే నెఱుఁగుదును. ఇది నీకపటమే--పట్టుకొనుఁడు. ఎవడురా అక్కడ!

తహ...హో—హో—హో—ఇప్పు డెవ్వఁ డెవనిని బట్టుకొనును శాహజాదా! మరియు నన్ను చంపినను మీప్రాణము దక్కదు. ఒక సంగతి వినుఁడు. నే నొక యుపాయ మాలోచించితిని. బీకనేరు రాజువద్దనుండి నా కొకజాబు వచ్చినది. ఇప్పుడైనను బాదుషావద్దను బోయి క్షమాపణ వేడినచో క్షమించెదరు. మన మీ ప్రయత్న మొందును చేయఁగూడదు? రండు బాదుషావద్దకుఁ బోదము.

అక్బరు—నాయనగారివద్దకు!

తహా—తప్పేమి! నాకు నాతల కొట్టివేసెదరని విచారము లేదు. అయినను తంటాలుపడి చూచెదను. ఏవిధముననైన దానిని నిలఁబెట్టఁగలనేమో ప్రయత్నముచేసి చూచుటలో తప్పేమి? (నిష్క్రమించును)

అక్బరు—ఏమి యిటులైనది! రాజపుత్రులు విశ్వాసఘాతుకులా! వారు నమ్మించి విడిచిపెట్టెదరా!—అంత పాడైనది. (మద్యపానము) ఓయీ! ఎవ్వరు? ...ఏమి పర్వాలేదు—ఆడుడు—పాడుడు.

(మరల వాద్యములు మ్రోగును.)

---

## అ ష్ట మ దృ శ్య ము.

స్థానము—అజ్మీరులో ఔరంగజేబు భవనబహిర్భాగము.

సమయము—రాత్రి పదిఘంటలు.

(ఔరంగజేబు పరుండియుండును. ఎదుటదిలేర్ఖాను నిలఁబడియుండును.)

ఔరంగ—దిలేర్ఖాన్! రాజపుత్రులశిబిరమునుండి మఱియేమేని సమాచారము తెలిసినదా?

దిలేరు—పిడుగుచప్పుడులఁ బోలు వారి ఫిరంగిధ్వనులు దక్క మఱి యేమియు వినఁబడుట లేదు. ధ్వని క్రమముగా సమీపించుచున్నది. మఱియు స్పష్టముగా వినఁబడుచున్నది,

ఔరం—వారి యుద్దేశము?

దిలే—ఉద్దేశ మేమో బాగుగ తెలియదు.

ఔరంగ—అక్బర్! అక్బర్! నన్ను సింహాసనమునుండి దింపి నీవు బాదుషా కాఁగోరుచున్నావా? ఒకరోజున నీవును బాదుషా యగువాఁడవు. నీకై యింత ప్రయత్నము, ఇంత శ్రమము. ఇంత వ్యయము. అంతయు నర్థమయ్యెను—దిలేర్ఖాన్! ఇది యెప్పుడు నే ననుకొనలేదు.

దిలే—మీ రెందు కనుకొనలేదో తెలియదు, అక్బరు బాదుషాగానే నటించినాఁడు. ఆయన మాజిమ్, ఆజిమ్, కామబఖ్ములతో కూడ బాదుషాగానే ప్రవర్తించునేమో. అది మాత్రి మింకను తెలియదు,

ఔరంగ—దిలేర్ఖాన్! ఏ హత్యాకాండముచే నే నీ సామ్రాజ్యము వశపఱచుకొంటినో అది మఱల కాకుండుగాక యని కోరుచున్నాను.

దిలే—ప్రభువుల యుద్దేశ మింతికాలములోనే చాలమాఱినట్లు గనుపట్టుచున్నది—ఆహా! షాజహాన్ బాదుషా యిప్పుడు బ్రదికి యున్నచో చాల సంతోషించువాఁడుకదా!

ఔరంగ...జాగ్రత్తగా మాటలాడుము దిలేర్ఖాన్!

దిలే—ఎందుకు హుజూర్? దిలేర్ఖాను నిజము పలుకుటలో నెప్పుడును వెనుదీయఁడు! మీరు మీతండ్రిగారి విషయములో నట్టి వ్యవహారము చేయనిచో నేఁడు అక్బరున కీసంగతి తోఁచు నను కొంటిరా? సమ్రాట్! నేను మీమిత్రుఁడను—నామాటవినుఁడు. ఇప్పుడేని సత్కర్మములు చేసి వెనుకటి పాపకర్మములకు ప్రాయశ్చిత్తము జేసికొనుఁడు. జిజియాపన్ను దీసివేయుఁడు. హిందువుల మిత్రులగాఁ జేసికొనుఁడు. ఇంక నేమి చెప్పుదును?...రాజేంద్రా! ఈసర్వనాశమునకు మూలమగు కాశ్మీరిబేగమును వెడలఁగొట్టుడు; లేదా ఈ పాపకర్మములఫల మనుభవించుటకు సంసిద్ధు లగుఁడు.

(నిష్క్రమించును.)

ఔర...(తనలో) చెప్పిన దెల్ల నిజము, నిజమాడిన నిష్ఠురముగ నుండును. సత్యము. ఏమి చేసితినో అదియే మరల నగుచున్నది. దారా! పరలోకదారుఁడవగు దారా! సోదరా! క్షమించుము. నేను చాల అన్యాయము--ఘోరమైన అన్యాయము--చేసితిని. కాని నేను జేసిన దంతయు ఇస్లాము ధర్మముకొఱకే--ఈశ్వరుఁడుసాక్షి.

(శ్యామసింహుఁడు ప్రవేశించును.)

ఔరం—ఏమి సమాచారము; మహారాజా!

శ్యామ...కార్య మంతయు చక్కఁబడినది సమ్రాట్!--రాజపుత్రు లక్బరుని విడిచిపోయిరి!

ఔరం—ఎట్లు?

శ్యామ—వారు తమతమ గుఱ్ఱముల నెక్కి జోధపురమువైపు నకుఁ బోయిరి—నేను నాకన్నులతో చూచితిని. శాహజాదా అక్బరు నృత్యగీతములలో పడి కొట్టుకొనుచున్నారు, వారి కింకను తెలియదు. వా రింతదనుక మైమఱచియే యుండిరి.

ఔరం—ఇది యంతయు నెట్లయినది?

శ్యామ... మఱచితిరా? సేవకుని యాలోచనముచే తా మక్బరున కొక జాబు వ్రాసితిరిగదా.

ఔరం... ఏమి జాబు?

శ్యామ... అదియే అందులో తా మిట్లు వ్రాసితిరి. "శాహజాదా అక్బర్! నీయుద్దేశము చాలబాగుగ నున్నది. రాజపుత్రులు బాదుషాపైఁ బడునపుడు మీరు వెనుకనుండి వారిని ముట్టడించుడు." ఆయుత్తరమును దుర్గాదాసుని తమ్ముఁడగు సమరదాసున కిచ్చునట్లు చేసితిని. వా రాయుత్తరమును విశ్వసించిరి. బాదుషా కుతంత్రము చేతనే అక్బరు రాజపుత్రులతో మైత్రి చేయుచున్నాఁడని వా రను కొనిరి. వెంటనే వా రక్బరుని విడచి పోయిరి.

ఔరంగ... నిజమే మహారాజా! రాజపుత్రు లొకమ్మను నమ్ముదు రని నే ననుకొనలేదు. దుర్గాదాసుకూడ నమ్మెనా?

శ్యామ... దుర్గాదా సచ్చటలేఁడు. అతఁడు రాజసింహునకు జబ్బుగా నున్నదని విని యుదయపురము వెళ్ళెను.

ఔరంగ—మఱియు తహవ్వర్ఖానో? వాని సమాచార మేమి?

శ్యామ—తహవ్వర్ఖాను ఖైదు చేయఁబడెను. అతనికి నే నొక యుత్తరములో "ఇప్పుడేని నీవు శత్రువులను విడిచి నీ సైన్యముతో హుజూరువద్దకువచ్చి క్షమాపణవేడినచో క్షమింపఁబడుదు" వని వ్రాసితిని. అది నమ్మి యతఁడు మొగలశిబిరములోనికి రాగా శాహజాదా, ఆజిము, అతనిని ఖైదుచేసిరి.

ఔరంగ—మహారాజా! నేను మీ యీయుపకారమున కెల్లప్పుడు కృతజ్ఞునిగ నుందును.

శ్యామ—ఇది ప్రభువుల యనుగ్రహము.

ఔరంగ—బయట నేమి యాగల్లంతు?

శ్యాము... చూచెదను. (శంకితభావముతో నిష్క్రమించును.)

ఔరంగ—ఇది యేమి! కోలాహలము క్రమముగ హెచ్చుచున్నది. శస్త్రముల ఝణత్కారము! ఇది యేమి! తుపాకులధ్వని! దర్యాఖాఁ!

(రక్తము కార్చుచు తహవ్వర్ఖాను ప్రవేశించును.)

ఔరంగ...తహవ్వర్ఖాఁ!

తహ...ఆఁ సమాప్తిట్! (బాదుషావైపునకు పిస్తోలు గుఱి పెట్టును.)

దిలేర్ఖాను...(ప్రవేశించి) ఖబర్దార్!

(తహవ్వర్ఖాను ఒకమాఱు వెనుకకు తిరిగి చూచి మరల బాదుషాపైకి పిస్తోలు గుఱిపెట్టును. దిలేర్ఖాను పిస్తోలు కాల్చి తహవ్వర్ఖానును పడఁగొట్టును.)

ఔరంగ...విశ్వాసఘాతుకునకు తగినశాస్తి జరిగినది. కృతఘ్నా! కుక్కా!

దిలేరు-చచ్చినాడు, రాజేంద్రా! మీరిట్టి నొక్కటి వినలేదు.

ఔరంగ...దిలేర్ఖాఁ! నీవు నేఁడు నాప్రాణమును కాపాడితివి.

దిలేరు...మహాప్రభూ! ఇం దాశ్చర్య మేమి? మీప్రాణము కాపాడుటకే నేను వేతనము పొందుచున్నాను.

ఔరంగ...దిలేర్ఖాఁ! నిన్ను తొలఁగించి నే నీపఠానుని సేనాపతిగాఁ జేసితిని. దాని కిది ఫలితము. నన్ను క్షమించుము దిలేర్!

దిలే...హుజూర్! నే నొక సామాన్యభృత్యుఁడను. న న్నేల యిట్లనెదరు?

ఔరంగ...నీవు భృత్యుఁడవు కావు. నీ వొక్కఁడవే నాకీప్రపంచమున నిజమైన మిత్రుఁడవు. నీ కేమి బహుమానము కావలెను దిలేర్?

దిలే...ప్రభువులప్రాణము రక్షింపఁగల్గితిని. ఇదియే నాకు గొప్ప బహుమానము. ఇంక నా కేమియు నక్కఱలేదు.

ఔరంగ...దిలేర్! నీవు చాల ఉన్నతాశయముగల మనుష్యుఁడవు.

---

## నవమ దృశ్యము.



స్థానము---రాజపుత్రుల శిబిరము.

సమయము ... సాయంకాలము.

(దుర్గాదాసు, సమరదాసు, రాజపుత్ర సరదారులు కూర్చుండి యుందురు.)

దుర్గా ... విజయసింహా! మన మిామాంసు నిజముగ మోస పోతిమి.

సమర . . నీ వింతవఱకు మొగలులను గుఱుతించనే లేదు, దుర్గాదాస్!

విజయ ... అక్బ రింత మోసగాఁడగునని నే ననుకొన లేదు.

ముకుంద ... చూచుటకు చాల అమాయకుఁడుగ నుండెను.

గోపీ——అగుట కతఁడు వట్టి వ్యర్థుఁడు. ఇరువదినాలుగు గంటలు నృత్యగీతములలో మునిగియుండును---ఇటువంటి వాఁ డెవ్వఁడు కపటి కాఁడు.

సమర——గోపీనాథా! మొగలుల కన్నియు సంభవమే--నేను జలమును విశ్వసించెదను. గహ్వరమును విశ్వసించెదను. సర్పమును విశ్వసించెదను. కాని మొగలులను విశ్వసింపఁజాలను. కపటము వారి జాతిధర్మము! అతఁడేమి చేయును!

గోపీ——సేనాపతీ! రాణా రాజసింహుని మృత్యువునకు కారణ మేమింకి

దుర్గా——అది సరిగా తెలియలేదు. భీమసింహుని మృత్యు వార్త విని యాయన మూర్ఛపోయెను. మరల స్మారకము కలుగలేదు.

ద్వారపాలుఁడు——(ప్రవేశించి (నమస్కరించి) స్వామీ! షాహజాదా అక్బరు సపరివారముగ ద్వారమున నున్నారు.

విజయ——అక్బరా?

దుర్గా——సపరివారముగనా?

సమర—జాగ్రత్త! ఇందులోకూడ నేదియో మోస మున్నది. లోపలికి రానీయకుఁడు.

దుర్గా... కాదు వినుము. మిత్రునితో ఒకటి రెండుమాటలు కలియకున్నను బాధలేదు, తమ్ముడా! కాని శత్రువు నిల్లు వెళ్లఁ గొట్టుఁట మంచిదికాదు. (ద్వారపాలునితో) వారి నాదరపూర్వముగ లోనికి దోతెమ్ము. (ద్వారపాలుఁడు పోవును.)

ముకుంద—దీనియర్థము?

సమర—మరల నేదియో మోసము చేయ వచ్చియుండును--జాగ్రత్త దుర్గాదాస్!

గోపీ—ఈయుద్ధములో విస్మయమున కంత ముండదా!

దుర్గా—యువరాజున కందఱు యథోచితసత్కారము చేయుఁడు.

(సపరివారముగ నక్బరు ప్రవేశించును. అందఱు లేచి నిలఁబడుదురు.)

దుర్గా... నేఁడు మా కీసన్మాన మొసఁగుట కేమి కారణము, శాహజాదాసాహబ్?

అక్బరు—రాతౌరుసర్దార్! మోసపోయితిని.

సమర—మీరు మోసపోయితిరా? లేక మేము మోసపడితిమా?

అక్బరు—ఉభయులము మోసపోయియుండుము. రాజపుత్రులు నాకు సహాయకులుగా నుండుటకు స్వీకరించి, నన్ను బాదుషాగా నొనర్చి నేను నిశ్చింతముగా నున్నప్పుడు, నేను తండ్రిగారికి ద్వేషభాజనమై యున్నప్పుడు, నన్ను విడిచివచ్చిరి.

సమర—అపత్యము.

రజియ్యా—సిపాహీ!---నాయన నగౌరవము చేయకుఁడు. (కంట నీరు పెట్టుకొని దీనదృష్టితో దుర్గాదాసువంకఁ జూచును.)

దుర్గా—కొంచె మూరకుండుము, తమ్ముడా.---శాహజాదా సాహబ్! రాజపుత్రులు నిష్కారణముగ మిమ్ము విడువలేదు. రాజపుత్రులు విశ్వాసఘాతుకులు కారు. బాదుషా వ్రాసిన యీ లేఖను

జూచి మీరు రాజపుత్రులతో కలిసినది మోసముచేయుటకే యని వీ రనుకొనిరి--చదువుఁ డీకాగితమును. (కాగిత మిచ్చును.)

అక్బరు—(కాగితము చదివి) సేనాపతీ! ఇది యంతయు నసత్యము.

సమర—ఏమి అసత్యమా?--ఇది బాదుషాసంతకము కాదా?

అక్బరు...సంతకము బాదుషాదే. కాని ఈ యుత్తరములో వ్రాసిన దంతయు నసత్యము. మనకు ద్వేషము కల్పించు నుద్దేశము తో వ్రాయఁబడినది. ఈయుత్తరము నాపేర వ్రాయఁబడి రాజ పుత్రుల యొద్దకు పంపఁబడినది. లేనిచో నిది నాకు చేరక రాజపుత్ర సేనాపతి కేల చేరినది? మొగలదూత రాజపుత్రుని, మొగలుని, గుఱుతింపఁజాలడా? ఇది నిజమే యగుచో ఈ రహస్యవార్త మీకు తెలిసియుండదు.

దుర్గా—(అందఱవంక చూచి) ఏ మందురు?

సమర—మే మిదేమియు వినఁదలచుకొనలేదు. మొగలులు మమ్ము పూర్తిగా మోసముచేసిరి. మే మామొగలుల పొత్తు నే మాత్రము గోరుట లేదు.

అక్బ...రాణారుసేనాపతీ! నన్ను రెంటికిఁ జెడ్డ రేవనిగాఁ జేసి సంకటమునఁ బెట్టకుఁడు. నేను మీశరణు చేరితిని.

దుర్గా...సామంతు లందఱకు నిదియే యభిప్రాయమా?

విజయ...మొగలులపొత్తు పనికిరా దనియే నేను చెప్పు చున్నాను.

ముకుంద—నాయభిప్రాయము నిదియే. మొగలులతో మే మొకయుద్ధరంగమునందే కలియఁగోరుచున్నాము.

జగత్...నేఁ జెప్పునదియు నిదియే. మేము మొగలుల స్నేహము గోరుట లేదు. మేము యుద్ధము చేయుట యెఱుఁగుదుము—యుద్ధమే చేసెదము.

దుర్జన—సేనాపతీ! నాయుద్దేశము నిదియే. శాహజాదా మొగలుల శిబిరమునకు తిరిగిపోవచ్చును—వారు తమతండ్రితో

క్షమాపణ వేడుకొందురుగాక, బాదుషా తప్పక తనకొడుకును క్షమించును.

అక్బరు... అగుచో మీరు మానాయన నెఱుఁగరు కాబోలు.

సమర— బాగుగ నెఱుఁగుదుము. ఇంక నెక్కువగ నెఱుంగుట కవసరము లేదు—తిరిగిపోవుదు యువరాజా!

అక్బ...(దుర్గాదాసుతో) రాఠొరుసర్దార్! నేను మీశరణు వేడుచున్నాను.

దుర్గా... సామంతులారా! శరణార్థుల విడువకుండుట క్షత్రియ ధర్మము.

సమర... పాముకు పాలుపోయుట క్షత్రియ ధర్మము కాఁజాలదు.

అక్బరు... నన్ను విశ్వసింపుఁడు, నేను వంచితుఁడను.

దుర్జన... గావచ్చును. అయినను మీ తండ్రికొడుకుల జగడములలో చిక్కుకొనుట మా యభిమతము గాదు.

అక్బరు... అందఱిఅభిప్రాయ మిదియేనా? రాజపుత్రులు నేడు తమ కర్తవ్యము మఱచి శరణార్థుల విడిచెదరా?

(అందఱు నూరకుందురు.)

దుర్గా... శరణాగతరక్షణమున కెవ్వరు నిష్టపడరా?

అందఱు— మేము శత్రున కాశ్రియ మీయము.

అక్బరు— సేనాపతీ! నేను బాదుషాపుత్రుఁడను.—వంచింపఁబడితిని. ఆపదలో నున్నాను. పుత్రపుత్రీసహితముగ మోకరిలఁబడి మిమ్ము శరణువేడుచున్నాను. (పుత్రపుత్రికలతో) మోకరించుము కుమారీ!

రజియా...(మోకరిలఁబడి కంటనీరు పెట్టుకొని) దుర్గాదాస్ నాయనను కాపాడుము.

దుర్గా... ఎవ్వరికి నిష్టము లేదా?

అందఱు...మా కెవ్వరికి నిష్టము లేదు,

దుర్గా...మంచిది! అగుచో నే నొక్కఁడనే యిష్టపడుదును... సామంతులారా! దుర్గాదాసు తన్ను క్షత్రియునిగఁ దలఁచును. మఱియు మన్నించును. శరణార్థి కతఁ డెప్పుడును విముఖుఁడు కాఁజాలఁడు. సామంతులారా! మిత్రులారా! బాంధవులారా! మీరు నన్ను విడువఁదలఁచినచో విడిచి వేయుఁడు, నేను ఆశ్రితుని విడువ జాలను. నడువుఁడు, రండు, శాహజాదాసాహెబ్! దుర్గాదాసు జీవించియుండు వఱకు మిమ్మంటుటకెవ్వఁడ నెవఁడును సాహసింపఁడు. భయము లేదు రండు.

క. శరణాగతరక్షణమే, పరమార్థంబుగఁదలంచి బాములు వడు నా
చరితార్థీకృతజన్ముఁడు. సురలోకసుఖంబు లెల్లఁ జూఱగొనండే

(తెర వాలును)

---

శ్రీ వరదేవతాయై నమః

# దుర్గాదాసు

## చతుర్థాంకము.

ప్రథమదృశ్యము.

స్థానము—ఢిల్లీ సభాభవనము.

సమయము—ప్రాతఃకాలము.

(మహాజము, దిలేర్ఖాను కూర్చుండియుందురు.)

దిలేరు—అగుచో దుర్గాదాసు అక్బరుని తీసికొని దక్షిణ దేశమునకు వెళ్లెనా?

మహాజ—అవును దిలేర్ఖా! అక్బరునికి శరణ మిచ్చుటంజేసి రాజపుత్రులతనిని పరిత్యజించిరి. ఇప్పుడు దక్షిణమున శంభాజీని ఆశ్రయించుటదక్క అతనికి వేఱొండుపాయము లేకుండెను.

దిలే—శబాస్ దుర్గాదాస్ !

మాజ—కేవల మైదువందలు రాజపుత్రులు అంతరంగికు లగు వారలు వానివెంట నెళ్లిరి. నేను సేనాసహితముగఁ బోయి ఆతనితో తలపడితిని, ఒక్కనాటిరాత్రి దుర్గాదాసు తన ఐదువందల సైన్యముతో మొగలపటాలమును జీల్చుకొని వెడలిపోయెను. తర్వాత నతడు దక్షిణమునకు పోయెనని వింటిమి.

దిలే—శాబాస్ ! దుర్గాదాస్ శాబాస్ !

మాజ—పాదుషావనుపున అక్బరుని పట్టియిచ్చుటకై నేను లంచముగ నలుబదివేల మోహారీలను దుర్గాదాసువద్దకు పంపితిని. దుర్గాదా సామోహారీలను అక్బరున కిచ్చెను. తా నొక గవ్వయు బుచ్చుకొనలేదు.

దిలే—వహ్వా శాబాస్ ! దుర్గాదాస్ !

మాజ—ఇప్పుడు మార్వాడసైన్యమునకు సేనాపతి యెవరు ?

దిలే—దుర్గాదాసుని తమ్ముఁడు సమరదాస్.

మాజము—అక్బరునికుటుంబ మెచ్చట నున్నది?

దిలే—వారివద్దనే యున్నది. అక్బరునిబేగము చనిపోయినది. రజియా సమరదాసువద్ద నున్నది.

(ఆజిము ప్రవేశించును.)

ఆజిము—దిలేర్ఖాన్ ! సమ్రాట్టు రాజపుత్రులతో సంధిచేసికొనవలెనని కోరుచున్నారు. ఈమాట మీతో చెప్పుటకే బాదుషా నన్ను పంపిరి.

దిలే—ఏమి ! సంధి ! నిజమే శాహజాదాసాహబ్ ? బాదుషా నిజముగ సంధి కోరుచున్నారా ?

ఆజిము—అవును సేనాపతీ !

దిలే—దైవము మేలు చేయుగాక—ఈ సంధిప్రస్తావ మెవరు చేసెదరు ? నేనా లేక బాదుషాయా ? ఆజిము— రాజపుత్రులు చేసెదరు.

దిలే—రాజపుత్రులు! వారే గెలిచి వారే సంధిప్రస్తావ మంపెదరా?

ఆజిము—మనము సంధిప్రస్తావ మంపఁగూడదని బాదుషా చెప్పిరి. అట్లు చేయుటలో మనమర్యాదకు భంగమఁట.

దిలే—అందుచే మనమర్యాదను గాపాడుటకై విజయమందిన రాజపుత్రులు సంధిప్రస్తావము దీసికొనివచ్చెదరా?—ఈమాట బాదుషా కెవరు చెప్పిరి?

ఆజిము—శ్యామసింహుఁడు. ఆయన బాదుషాగౌరవమునకు భంగము లేకుండ సంధిచేయించెద ననిరి.

దిలే—తెలిసినది. అగుచో నిదియును పూర్వమువలె సార్వభౌముని కపట సంధియే.

ఆజిము—దిలేర్ఖాఁ! అవిచారముగ మాటాడకుము.

దిలే—(తనలో) ఊఁ! పాముకన్న పాముపిల్ల కెక్కువ విషము. (ప్రకటము) పొమ్ము, ఆజిమ్! బాదుషాతో చెప్పుము. వారు నిజముగ రాజపుత్రులతో సంధి కోరినచో వారిమర్యాద కేమియు భంగములేని షరతులతో సంధిచేయించెదను-- ఇంక కపట సంధియగుచో నేను మాత్ర మందు జోక్యము కలిగించుకొనను.

(నిష్క్రమించును.)

మాజము—నాయనగారు హఠాత్తుగ నేల సంధి తలపెట్టిరి, ఆజిమ్?

ఆజిము—వా రిపుడు దక్షిణదేశమునకు పోఁగోరుచున్నారు. ఇందుకుగా నేఁబదివేల డేరాలు నిర్మింపఁబడినవి.

మాజము—వారు దక్షిణమునకు పోవుట అక్బరుని పట్టుకొనుట కేనా?

ఆజిము—అట్లే కనుపట్టుచున్నది.—మాజమ్! నీవు అక్బరుని పట్టి తీసికొని రాఁజాలకపోతివి--ఇందుచే బాదుషా నీపై నెక్కువ కోపముగా నున్నారు. నీవు బుద్ధిపూర్వకముగ నతనిని విడిచిపెట్టితి వనియే వారి యనుమానము.

మాజిము—ఈ మాట కేవల మసత్యము కాదు. ఆజిమ్ నాయనగారి క్రోధాగ్నిలో నా యమాయకుఁడు, దుర్బలుఁడునగు అన్నను బడఁగొట్టుట నా కుచితముగ లేదు. అతఁడు దుర్గాదాసువద్ద సుఖముగ నున్నాఁడు.

ఆజిము...అగుచో నీవు బుద్ధిపూర్వకముగనే నాయనగారి యిచ్ఛకు విరుద్ధముగ నీ పనిచేసితివా మాజిమ్?

మాజము—అవును, ఆజిమ్! తండ్రి తండ్రియే. కాని అన్నయు అన్నయే.

(నిష్క్రమించెదరు.)

---

## ద్వితీయ దృశ్యము.

స్థానము - యోధపురములో మేడ.

సమయము - ప్రాతఃకాలము.

పట్టువస్త్రమును గట్టుకొని మహామాయ యొక్కతె నిలిచియుండును.)

రాణి—నా పని యంతయు పూర్తియయినది. పరలోకవాసి యగు నా నాథుని రాజ్యము తిరిగి యుద్ధరింపఁబడినది. మార్వాడ నుండి మొగలులు వెడలిపోయిరి. ఇంక నాపని తీరినది. నే నిపుడు సతీ ధర్మమును పాలించెదను. నేఁడు నానాథుని సంగమింతును. నేఁడు ప్రజ్వరిల్లు చితిపై నీశరీరమును విడిచెదను. నేఁడు సర్వకష్టములనుండి విముక్తి నందెదను. (మోకరించి) ప్రభూ! స్వామీ! ప్రాణవల్లభా!— ఒకనాఁడు నీవు యుద్ధరంగమున నోడిరాగా స్వాభిమానముచే నేను దుర్గద్వారమును మూయించి యుద్ధరంగమున నీమృత్యువు గోరితిని. చూడుము. నాథా! దేశము కొఱకు నిన్ను చావుమని చెప్పినట్టుల నేనును నీకొఱకు నవ్వుచు నవ్వుచు చావఁజాలుదును.

(రజియా "బనేరనేకాఁ హా ఛలి బనేరనే" పాడుచు ప్రవేశించును.)

రజియా—రాణీ! ఇది యంతయు నేమి?

రాణి—నేను పోవుచున్నాను రజియా!

రజియా—ఇది యేమి? ఎక్కడకు?

రాణి—(పైకి వేలు చూపి) ఇన్నిరోజులనుండి నానాథుఁడు నాకై నిరీక్షించుచు నున్న యక్కడకు.

రజియా—మీ నాథుఁడు నిరీక్షించుచుండిరా?—అక్కడ? ఎక్కడ? నా కగపడుట లేదు.

రాణి—వారి నెవ్వరును జూడఁజాలరు అమ్మాయీ!

రజియా—మీరు చూడఁజాలుదురా?

రాణి—ఎందుకు లేదు, రజియా?

రజియా—నాకు నమ్మకము లేదు. నేను చూచుట లేదు. కాని మీరు చూచుచున్నారా? ఇది అసంభవము.

రాణి—ముద్దరాలా! నీ వొరంగజేబువంశమునఁ బుట్టితివి.

రజియా—కొమరు నెవరివద్ద డించెదరు?

రాణి—నీవద్ద.

రజియా—నే నతనిని కనిపెట్టియుండఁజాలను! మీరు మీ అబ్బాయిని విడిచిపోవువారలు—ఇంక నే నతనిని కాపాడుదాననా? అసంభవము.

రాణి—నేను తప్పక పోవలయును రజియా!—నానాథుఁడు పిలుచుచున్నారు.

రజియా—కుమారునికన్న నాథుఁడు మీ కెక్కువా?

రాణి—అదియే మాహింమాసతుల ధర్మము—రజియా! పతియే సతికి సర్వస్వము. ఇంతదనుక కర్తవ్య మవశిష్టముగ నుండెను. అందుచే వారిని విడిచి యిచ్చట నుంటిని. ఇప్పుడు నాపని సమాప్తమై నది. నేను వారివద్దకు పోయెదను.

రజియా—పని సమాప్తమైన దనఁగా? ఎక్కడనేని పనిసమాప్త మగునా? లేదు. మీ కేవిధమునను వెళ్లుట కవకాశము గనుపట్టుట లేదు.

రాణి—కాదు అమ్మాయీ! అటు లనవద్దు.

(సమరదాసు ప్రవేశించును.)

రజియా—ఇది యేమి! ఇదికూడ జరుగునా?—ఇది జరుగనే జరుగదు. ఇదిగో సర్దారు వచ్చిరి! (సమరదాసుతో) మీరే చెప్పుడు. ఇది యెక్కడనేని జరుగునా? ఏమి సర్దార్ సాహెబ్?

రాణి—ఎందుకు కాఁజాలదు రజియా?

రజియా;...ఎందుకు కాఁజాలదో అది నే నెఱుఁగుదును... కాని యిది కాఁజాల దనిమాత్రము బాగుగ నెఱుఁగుదును—సర్దార్ సాహెబ్! మీరే చెప్పుడు. ఇది కాఁగలుగునా?

రాణి—తప్పక కాఁగలదు అమ్మాయీ! నన్ను పోనిమ్ము. అజితుఁ డెక్కడ నున్నాడు సమరదాస్?

సమర—లోపల నున్నాఁడు. ఏడ్చుచున్నాఁడు—నేను కుమారుని ఓదార్పఁజాలకపోతిని. మహారాణీ! ఏమి చెప్పి యోదార్చెదను?

రాణి—అతఁ డేమి యనుచున్నాఁడు?

సమర—నేను అమ్మను పోనీయ ననుచున్నాడు!

రాణి—అతని నిచ్చటకు తీసికొనిరమ్ము.

మ. సకలారాతివరూథినీ జలద ఝుంఝూమారుతాభుండవై
యకలంకోజ్జ్వల శౌర్యవహ్ని, దిశ లల్లాడంగ, నాచంద్రతా
రక వంశాంకుర మొప్ప, యోధపురసామ్రాజ్యంబుఁ బాలింపుమ
య్యా! కులం బెల్ల నుతింపఁగా, కొడక! దీర్ఘాయుష్యవంతుండవై.

(సమరదాసు పోవును.)

రాణి—భగవాన్! సతీధర్మ పరిపాలనకై నా కాత్మబలము నిమ్ము. అన్నిటికన్న కఠినమైనపని పిల్లవానిని విడిచిపోవుటయే, (హృదయమున చేయి పెట్టికొని) భగవన్!

(అజితుని దీసికొని సమరదాసు ప్రవేశించును. వెంట కాసిముడు వచ్చును.)

రాణి...వత్సా! అజితా!—నాయనా—నేను పోవుచుంటిని. నన్ను పోనిమ్ము తండ్రీ!

అజితుఁడు—అమ్మా! నీవు పోవుచుంటివి—నన్ను విడిచి ఎక్కడకు పోయెదవమ్మా?

రాణి—ఒకనాఁ డందఱును పోవుచోటికి — రెండురోజులు వెనుకముందుగా నందఱును పోవువారలే! అజితా! నన్ను పోనిమ్ము నాయనా!

అజితుఁడు— ఆఁ! పోనిచ్చెదను. (కంపితస్వరముతో) అమ్మా!

రాణి—ఎవ్వరితల్లియు శాశ్వతముగ నుండదు, అజితా!

అజితుఁడు—ఎవ్వరితల్లియు బుద్ధిపూర్వముగ నీరీతి కన్నబిడ్డల విడిచిపోదు, అమ్మా!

రాణి—కాని యిది సతీధర్మము సుమా, అజితా!

రజియా—మాతృధర్మ మిదియేనా రాణీ?

రాణి—ఛీ! అజితా! ఏడ్చెద వెందుకు?- నేను పోవలయును.

అజితుఁడు—పోవలసియున్నచో పొమ్ము. పోగోరుచుంటివి. నన్ను విడిచి పోఁజాలుదువు—పొమ్ము! నే నడ్డగించను.

రాణి—సంతోషముతో నన్ను వెళ్ళు మనుము కుమారా!

అజితుఁడు—నేను వెళ్ళుమని చెప్పను.

రాణి—సమరదానూ! అబ్బాయి నోదార్చుము.

సమర—అజితా! నీతల్లిగారి కిదియే సతీధర్మము. ఈధర్మము నకు బాధ చేయుట నీ కుచితము గాదు.

రజియా...ధర్మమా! సర్దార్!- కన్నబిడ్డలను విడిచి, వారి నితరుల కప్పగించి చచ్చిపోవుట ధర్మమా!- దీనిని మీరు ధర్మ మందురా!

సమర...రజియా! ధర్మవిచారణ చేయుట మనపని కాదు. అనాదిగా వచ్చు ధర్మమును పాలించుటయే మనధర్మము. దానికి లొంగియుండుటయే మన కుచితము. దానిని ధర్మముగా నేర్పరచిన వారు అన్నివిషయములలో మనకన్న గొప్పవారు.

అజితుఁడు—అగుచో అమ్మా! నీవు నన్ను విడిచిపోయెదవా? (కంపితస్వరముతో) ఇది నీకు బాగుగ నున్నదా?—కష్టముగ లేదా?

సమర—కష్టముగ నుండదా? (కంపితస్వరముతో) అజితా! ఈమె నీకే తల్లియా, నాకుకాదా? మార్వాడయంతకు తల్లికాదా?-

అయినను ఈమెను పోనీయనలెను, అజితా! (మరల కొంచెము తెప్పరిలి) ఇదియును దేవతాప్రీతియ కుద్యాసనచెప్పుట! కొమార్తె నత్త వారింటికి కంపుట!- కష్ట మనిచెప్పి యెవఁడును నియమము నతిక్రమింపఁజాలఁడు.

అజితుఁడు... ఇది నాకేమియు తెలియదు. నేను మా అమ్మను విడువను. (ఏడ్చును.)

(ఉపాయము గానక రాణి సమరదాసువంక చూచును.)

సమర—అజితా! నీవు క్షత్రియగర్భసంజాతుఁడవు- నీ విట్టు లేడ్చుట- ఇట్లు మూర్ఖపుపట్టు పట్టుట- బాగుగ నుండలేదు- నీ యీడు ననే వీరవరుఁడగు బాదలుఁడు చిత్తోరుకై, కర్తవ్య పాలనమునకై ప్రాణములు సరకుగొనక యుద్ధ మొనర్చినాఁడు! ఇంక నీవు బాలురవలె, ఆఁడువారివలె ఏడ్చుచున్నావు! ఛీ!- అమ్మకు నమస్కరించుము అజితా!—

(అజితుఁడు మెదలక నమస్కారము చేయును.)

రజియా—ఆహా!—దురదృష్టవంతుఁడవు.

సమర—(అజితునితో) ఇంకఁ బొమ్ము.

రాణి—కాసిమ్! నాసర్వస్వమగు నీపుత్రుని నీ కప్పగించి పోవుచున్నాను. నాయనా (అని పుత్రుని గాగిలించుకొని)

శా. మేవాడ్రాజ్య భుజ ప్రతాపయశ మామి త్రేందు తారంబుగా
ద్యావా పృథ్వ్యభిపూర్ణమై వెలుఁగగా నా ఫుల్ ప్రజల్ సేవకుల్
దీవింపన్ భవదన్వవాయ మభివృద్ధిం జెంది దీపింపఁగా
దైవప్రీతిగ రాజ్య మేలు మిఁక నాతండ్రి! చిరంజీవివై.

(కాసిమువెంట నజితుఁడు మెదలక పోవును.)

రజియా—ఊఁహూఁ! ఇది బాగుగలేదు. ఈపోరపా టెవరిదో నాకు లెలియుటలేదు. కాని ఇది బాగుగ లేదని కనుపట్టుచున్నది. పోయి అజితు నోదార్చెదను.

(నిష్క్రమించును.)

రాణి—పరమేశ్వరా! నీ వీ స్త్రీజాతిని సృజించిన దిందులకేనా? వారి హృదయమున స్నేహము నింపినది—వారిని వేధించుటకేనా? వారి హృదయమున మమకార ముంచినది వారిని దహించుటకేనా? మంచిది పోవుచున్నాను. సమరదాస్!—ఏమి యూరకుంటివి?

సమర—పోమ్ము తల్లీ! హిందువు నయ్యు నిన్ను సతి కావలదని యెట్లు చెప్పుదును? పోమ్ము తల్లీ! నమస్కారము.

రాణి—దుర్గాదాసునకు నా ఆశీర్వచనము చెప్పుము.

(సమరదాసు తలవంచుకొని రెండవవైపునుండి పోవును.)

దృశ్యాంతరము.

(చితి మండుచుండును. రాణియు పుణ్యాంగనలు నిలిచియుందురు. స్త్రీలు పాడుదురు.)

## గీతిక.

పతిలోకమునకు పోవమ్మా! యో పడతీ! పుణ్యవతీ!
గతి వే ఱొక్కటి లేదమ్మా యిఁక సుతులకు నీజగతి!
ప్రాపంచిక శోకమ్ము లాడలితో భస్మం బైపోవుఁ!
అపయిఁ బోయెదవమ్మ యక్షయంబౌ స్వర్గం బీవున్!
వినుమదిగో జయదుందుభు లాకసమున మ్రోగుచునుండెఁ!
గనుము సురావళి యల్లదె సుమవృష్టిని గురిపించుచునుండెఁ!

(రాణి చితిలో నురుకును. స్త్రీలు పాడుచు పోదురు.)

—♦—

తృతీయదృశ్యము.

స్థానము... అజ్మీరు, మొగలుల మేడ.

సమయము—ప్రాతఃకాలము.

(ఔరంగజేబును దిలేర్ఖానును ప్రవేశించెదరు)

దిలే—సార్వభౌమా! రాజపుత్రులతో సంధిఅయినది. రాఠొరు సమరదాసు ఈసంధి కేవిధమునను ఒప్పుకొనలేదు. అతఁ డిది కపట సంధి యనెను.

ఔరంగ—తుద కతని నెట్టు లొప్పించితివి దిలేర్ఖాన్?

దిలే—అతఁడు విశ్వసించుటకై నేను నాయిద్దఱపుత్రులను అచట విడిచిపోయెద నంటిని. అప్పు డతఁ డంగీకరించెను.

ఔరంగ...ఏషరతుపై సంధి యైనది?

దిలే—చిత్తపురును, దానికి చెందియున్న గ్రామాదులును రాజపుత్రులకు తిరిగి యీయఁబడును. హిందువుల దేవాలయాదులపై నిఁక ముందే యన్యాయమును జరగదు. జోధపురరాజున కతని రాజ్యము తిరిగి యీయఁబడును. రాణాయును తనసైన్యముచే బాదుషాకు సహాయము చేయుచు నుండును.

ఔరంగ...రాణాయును తన సైన్యముచే మనకు సహాయము చేయునా? రాణా జయసింహుఁ డిందుల కంగీకరించెనా?

దిలే—పూర్తిగా నంగీకరించెను. అందరకన్న నతఁడే యీ సంధి నెక్కువ మెచ్చుకొనెను. సమరదాసు మొదట నతనిని "పిరికి పంద, రాజపుత్రకులాంగార" అని పలుమాటలు పలికి సభనుండి లేచిపోయెను. రాణా తల వంచుకొని యూరకుండెను.

ఔరంగ—తర్వాత?

దిలే—తర్వాత రాజపుత్రు లందఱు ఒక్కచో పోగయిరి. మరల క్రొత్తసంధిపత్రము వ్రాయఁబడినది. 'మొగలులను నమ్మకొట్టు' లని సమరదా సనెను. అంత నాయిద్దఱపుత్రులను విడిచి వచ్చుటకు సిద్ధమైతిని. అప్పటికిని చాలకష్టముమీఁద సమరదాసు ఒప్పుకొనెను.

ఔరం—నీవు నీయిద్దఱపుత్రులను అచట విడిచి వచ్చితివా?

దిలే—అవును సమ్రాట్!

ఔరంగ—దిలేర్ఖాన్! నీవు మహాపురుషుఁడవు. నే నీసంధిషరతుల నిర్వహించెదను.

దిలే—సమ్రాట్టునకు జయ మగుగాత!

(శ్యామసింహుఁడు ప్రవేశించును.)

శ్యామ...రాజాధిరాజు ఔరంగజేబు చక్రవర్తికి జయము!

ఔరంగ...ఏమి సమాచారము మహారాజా?

శ్యామ—పని యంతయు చక్కఁబడినది హుజూర్!—ఈరీతి పని యగునని నే ననుకొనలేదు—ఇంక సామ్రాజ్యము నిష్కంటక మైనది.

ఔరంగ...ఎట్లు?

శ్యామ...సంధియనంతరము కొందఱ బ్రాహ్మణులచే సమరదాసును జంపించితిని.

దిలే—ఏమి?—అతనిని చంపించితివా మహారాజా? నిజమే?

శ్యామ—ఆఁ! నిజము.

దిలే—నీ వతనిని చంపించితివా?

శ్యామ—అవును దిలేర్ఖాన్!

దిలే—క్షమింపుఁడు సమ్రాట్! (శ్యామసింహుని మెడ పట్టుకొని) బద్మాష్! లుచ్ఛా! రాజపుత్రకులాంగారా!—నేఁడు నిన్ను ప్రాణములతో విడిచిపెట్టను.

శ్యామ—(కాతర భావముతో ఔరంగజేబును చూచి) సమ్రాట్!

ఔరం—విడువుము దిలేర్ఖాఁ!...వట్టి క్షుద్రపురుషుఁడు, దోమను చంపి చేతులు మలినము చేసికొనకుము దిలేర్!

దిలే...నిశ్చయము. నిన్ను చంపి నా చేతుల నపవిత్రము చేసికొనను. నీవు నరకములోని పురుగుకన్నకూడ తుచ్ఛుఁడవు. నిన్ను చూచిన మహాపాతకము గల్గును—దూరముగ నుండుము. (శ్యామసింహుని త్రోయును.) చేతులు కడుగుకొని వచ్చెదను సమ్రాట్!

(నిష్క్రమించును)

ఔరం—దిలేర్ఖాన్! నాకై నీవు నీ యిద్దఱుపుత్రులను బోఁగొట్టుకొంటివి. కాని నా యుద్దేశము మంచిది సుమా! దీనికి నేను జవాబుదారుగాను. మిత్రమా! ఈ హత్య నా ప్రేరణచే జరుగలేదు. నే నింత నీచస్వభావముగల మనుష్యుఁడను గాను.

మాజము—(ప్రవేశించి) నాయనగారు పిలిచిరా?

ఔరం... ఔను మాజమ్!—దక్షిణమునకు పోవుటకు మొగల సైన్యము నాజ్ఞాపించుము. నీవును సిద్ధమగుము.

మాజిము... చిత్తము.

(ఇద్దఱు నిష్క్రమించెదరు)

---

## చతుర్థదృశ్యము.

స్థానము—దక్షిణమున పాలీగఢదుర్గము

సమయము—రాత్రి.

(మహారాష్ట్రప్రభువు శంభాజీ, దుర్గాదాసు, అక్బరు కూర్చుండియుందురు.)

శంభాజీ—దుర్గాదాసూ! నీవు చాల సాహసికకృత్యము చేసితివి. కేవల మైదువందలయాశ్వికులను దీసికొని యోధపురమునుండి పాలీగఢము వచ్చితివి.

అక్బరు—మేము వచ్చి చాలదినములైనను నేటిదనుక మహారాజుల దర్శనమే కాలేదు,

శంభాజి—శాహజాదాసాహబ్! నే నొకరాజకార్యమున చిక్కుకొనియుంటిని. అందుచే జాగైనది. క్షమింపుఁడు. మీ కాతిథ్యమునందును, ఆదరసత్కారములందును ఏలోపము జరుగుట లేదుకదా?

అక్బరు—లేదు. మీసర్దారులు న న్నెంతయు నాదరముతో చూచిరి. ఆతిథ్యమున నేలోపము జరుగలేదు.

శంభాజీ—శాహజాదాసాహబ్! మీ బేగమును, పిల్లలును ఎచట నున్నారు?

అక్బరు—మార్వాడరాణివద్ద వారిని విడిచి రావలసివచ్చెను. బాదుషాకు వారిపై కోపము లేదు. కేవలము మీరీయాశ్రితుని కాపాడుడు.

శంభాజీ—మీ కేమి పర్వాలేదు శాహజాదా! మీ రిపుడు లోహదుర్గమున నుంటి మనుకొనుఁడు. దుర్గాదాస్! నీ వితనిని బాదుషా చేసితివా?

దుర్గా—అవును చేసితిని మహారాజా!

శంభాజీ—అక్బర్ శాహా! ఇంక మా మహారాష్ట్రులు మిమ్మే బాదుషాగా నెంచెదరు.

అక్బరు—నాతమ్ముఁడగు మూజము నన్ను బట్టుకొనుటకై చాల సైన్యమును దీసికొని వచ్చుచున్నాఁడు

దుర్గా—అజిముకూడ సేనాసహితముగ అహమ్మదునగరము నకు వచ్చియున్నాడు.

శంభాజీ—ఏమియు భయములేదు శాహాజాదాసాహబ్! నేను స్వయముగ బహారంపురమునకు వచ్చి మిమ్ము బాదుషా చేసెదను.

(శంభాజీ సేనానాయకులగు సంతూాజీ, కేశవుఁడు ప్రవేశించెదరు.)

సంతూాజీ—జింజిరాదుర్గము పడఁగొట్టబడినది.

శంభాజీ—మంచిది, సంతోషము.

కేశవుఁడు—మహారాజా! కర్నల్ కేరి, ఫార్డినాండు తమ్ము దర్శింప గోరుచున్నారు. వారి నిటకు దోతెత్తునా?

శంభాజీ—దోతెమ్ము. బాధ యేమి?

(సంతూాజీ, కేశవుఁడు నిష్క్రమించెదరు.)

శంభాజీ—క్షణముకూడ తీరిక లేదు శాహజాదా!—రాజునకు రాజకార్యము లెప్పుడు వెంట నంటియేయుండును. నెలరోజు లైనది. ఇంగ్లీషువారీజింజిరాదుర్గమును తయ్యారుచేసిరి. ఇప్పు డది యంతయు నేలఁగూలినది. చూచితివా?—దుర్గాదాస్! రాజపుత్రులు యుద్ధము చేయుట నెఱుఁగుదురా?

దుర్గా—రాజపుత్రులు దేశమునకై ప్రాణ మర్పించుట నెఱుఁగుదురు.

శంభాజీ—కాని రాజపుత్రజాతి మాటిమాటికి తురుష్క పాదాహత మైనది.

దుర్గా—నిజము. కాని యాలోచింపుడు మహారాజా! ఆర్యావర్తమున రాజస్థాన మొకరజఃకణమువంటిది, అయినను ఆర్యావర్త

మున కంతకు నొకరాజపుత్రులే మూడువందల సంవత్సరములనుండి తలమెత్తుకొనియున్నారు.

శంభాజీ--మహారాష్ట్రులు తలమెత్తుకొనుటయేకాదు,తలను నిర్మించుచున్నారు—ఎవరిశక్తి యెక్కువ దుర్గాదాస్?

దుర్గా—మహారాజా! నేను మహారాష్ట్రులు హీనులని చెప్పుట లేదు. నాయభిప్రాయము రాజపుత్రులును శక్తిశాలురనియే మహారాజా! నే నిటకు వచ్చిన యుద్దేశము శాహజాదా అక్బరుని సురక్షితముగా నుంచుటయే.

శంభాజీ—మంచిది. వచ్చినచో మహారాష్ట్రు లెట్లు యుద్ధము చేసెదరో చూచిపొమ్ము. దేశమునకు పోయి జనులతో చెప్పదగిన విషయము తెల్లమగును.

దుర్గా--(తనలో) ఇంతగర్వమేయున్నచో నింక పతన మవశ్యంభావియె.

(కేరీ, ఫార్డినాండులతో కేశవుడు ప్రవేశించును.)

భాజీ—కేరీ! నీవు జింజిదుర్గముస్థితిని చూచితివా?

కేరీ—అవును మహారాజా!

శంభాజీ—ఈ స్థితియే మీ బొంబాయి యుపనివేశమునకు నగును. మా శత్రువులమోడలను మీ రేవులో నాగనిచ్చినచో ఎలిఫెంటులో మహారాష్ట్రుల దుర్గము తయ్యారగును!

కేరీ—మహారాజా--

శంభాజీ--నేనేమియు వినను. పొమ్ము-పోర్చుగీజు సేనాపతీ! నీవు నేను వద్దనినదానిని మానలేదు. మీరు అంకీద్వీపమునకు పోవుటకై శీడ లంపితిని. మీ గోయావ్యాపార మెట్లు జరుగుచున్నదో చూచెదను. ఇపుడేని జాగ్రత్తగా నుండుడు--పొండు.

(సలాముచేసి కేరియు, ఫార్డినాండును నిష్క్రమించెదరు.)

శంభాజీ—ఈ ఫరంగులకు నేను కొంచెము వెలచెదను, దుర్గాదాస్!--కాబ లేస్థాన!

తెరలో—హుజూర్!

శంభాజీ—సారాయి, స్త్రీ--

తెరలో---చిత్తము మహారాజా!

శంభాజీ—ఈఫరంగులు తుపాకులు బాగుగ కాల్చెదరు. సేనాపతి పోయినను వీరిసైన్య మెన్నఁడును పారిపోదు. అందఱకు ఒకటే నడక, ఒకటే లక్ష్యము, ఒకవైపునకే ముఖము.

(సారాయిసీసా తీసికొని కాబలేస్ఖాను ప్రవేశించును.)

శంభాజీ—(గ్లాసులో పోసి) ఇదిగో దుర్గాదాస్!

దుర్గా—నన్ను క్షమించుడు మహారాజా!

శంభాజీ—ఏమి యట్లనెదవు? సారాయి త్రాగనని నిషేధమా? మిత్రుఁ డిచ్చుచుండిన నేల త్రాగవు?--శాహజాదాసాహబ్!

అక్బరు—మద్యపాన మేమియు దూషితము గాదు.

శంభాజీ—శాబాస్! నీవు బాదుషాకే తగినవాఁడవు. నిన్ను తప్పక బాదుషా చేసెదను.

కాబలే—హుజూర్! వేశ్యలు వచ్చియున్నారు.

శంభాజీ—ఆఁ ఇప్పుడే—ఇక్కడికే—

దుర్గా... ఇంక నేను పోయెదను. కొంచెము విశ్రమించెదను.

శంభాజీ—ఏమి, నీపాతివ్రత్యము భగ్నమగునా?—మంచిది పొమ్ము—

దుర్గా—(లేచుచు తనలో) ఇంత తుచ్ఛుఁడా!

(ఆటకత్తెలు ప్రవేశించెదరు.)

శంభాజీ—ఇంక పాడుడు. ఆడుడు. శాహజాదాసాహబ్! ముసల్మానులు విలాసప్రియులేనా?

అక్బరు—(సారాయి త్రాగుచు) అవును. కాని సురాపానము వారికి ధర్మనిషిద్ధము.

శంభాజీ—అటులా? నాకాధర్మము లేదు—మద్య మెంత మంచివస్తువు! ఒడలి కెంత హాయిగా నుండును! త్రాగగనే ప్రపంచ మంతయు సుఖమయముగ గనుపట్టును. హాహాహా! ప్రపంచమున రెండే వస్తువులు—మద్యము, స్త్రీ—పాడుడు.

దుర్గా—(పోవుచు తనలో) ఈ మద్యము, ఈ స్త్రీయే నీకు సర్వనాశము చేయును, శంభాజీ!

గీ. ఈ మహారాష్ట్ర నరపాలుఁ డిట్టి గర్వి
మధ్యపాయి, స్త్రీలోలుఁ, డున్మాదుఁడంచుఁ
దెలియక నొక్కసవోతి, నీ తులువవలన
అజిమ గెలుచుటయెట్లు? ఈ యక్బరెట్లు?

(నిష్క్రమించును.)

శంభాజీ—దుర్గాదాసు నావంక నెటుల చూచిపోయెనో చూచి తిరా అక్బర్! వట్టి దాంభికుఁడు.

అక్బరు—మంచిది (వేశ్యలను చూచి) మీరు పాడుడు.

శంభాజీ...ఆ పాడుడు-ఆడుడు జీవితములో భోగవిలాసములు. లేనిచో వట్టియుద్ధముచే నేమిలాభము, శాహజాదా?--పాడుడు. వీరు భారతసార్వభౌమునిపుత్రులు, అక్బరు చక్రవర్తి. వీరి శుభాగమన సంతోషమును వెలిబుచ్చు నొకగీతము పాడుడు.

(ఆటకత్తెలు ఆడుచు పాడెదరు.)

## గీ తి క

కూరిమి నీ వరుదెంచుట మాదుకుటీరము పావనమాయెఁ।
ఔర! ప్రసన్ను నొనర్చెద ని న్నెటులంచు విచారం బాయెన్।
రతనాలకు నీ వధికారివి భూషితు ని న్నెటు గావింతున్।
మతిమిత్రత్వ మొకండె యొంచినన్ మన్నించెదవని యెంతుఁ॥
పరుగున నీదరి కేతెంచి సుహృద్వర! కౌఁగిలి గావించెదనో।
చరణకంజముల వ్రాలి మహానందరసమ్మును భావించెదనో।
చిఱునగ వెలయ ప్రమోదబాష్పముల చరణమ్ములఁ దేలించెదనో।
ఎరుకపడదు హార్దికప్రీతిని నే నెటు లీయెడఁ జూపించెదనో।
అతిథిని నాశాతీతు నిన్ను గుటియందున నేఁ గనుగొంటిఁ!
అతిమూల్యంబగు మణిని చీఁకటిని యధ్వధూళిలోఁ గంటిఁ॥
చిరకాలాగతు నిన్ను మద్హృదయ సింహాపీఠి నర్చింతుఁ!

గరిమఁ జేరిమహారము గూరిచి నీకంఠమ్మున నర్పింతుర॥
పగలు రాత్రి యుం చనక సదా నీ పాదమ్ములఁ బడియుందుర।
జగతిఁ బరమబంధుఁడ వీ విఁక నాసర్వస్వము నీ వందుర॥

---

పంచమదృశ్యము.

స్థానము - రాణాజయసింహుని యంతఃపురము.

సమయము - సాయంకాలము.

(జయసింహుఁడును, ఆయనదాదియు ఎదురుపడి నిలిచియుందురు.)

జయ—ఏమి! కమల నాతో చెప్పకయె వెడలిపోయినదా?

దాది—పోయిన పోనిమ్ము. పీడ వదలిపోయినది.

జయ—పెద్దరాణి యెచ్చట నున్నది?

దాది—ఆగృహాలక్ష్మి గృహామునందే యున్నది.

జయ—పెద్దరాణిని పిలువుము. తప్పక యామెతో పోట్లాడియే వెళ్ళిపోయినది.

దాది— లేదుబాబూ లేదు! ఆమె యేమియు నోరేని యెత్తదు. కపట మెఱుఁగనిది. చిన్నరాణియే మధ్యమధ్య ఆమెను కవ్వించి కయ్యానికి కాలు దువ్వును. బాబో! రెండవ తాటకయే! ఆసమయమున చిన్న రాణి మొగము చిచ్చుబుడ్డియగును. వట్టి పెంకి మానిసి బాబూ! ఇట్టి యాఁడుదానిని నే నెచ్చటను జూడలేదు.

జయ—నోరు మూయుము; జాగ్రత్తగా మాటాడుము.

దాది—బాబో! నీ వెక్కడనో కుంభకర్ణుఁడవైతివే. నన్ను మ్రింగెదవా యేమి? భయ మేల? చిన్నరాణి నీపై నిజముగ మచ్చు జల్లినది. నీవు రాజ్యమునుగూడ వదలి యామె నామమును జపించు చుంటివి. నే నీయింటిలో తిని పెరిగితిని---ముసలిదాననైతిని—అన్యాయము చూడఁజాలను.

జయ—చూడకు, నేను నీపాలు త్రాగితిని. కనుక నీ వనుమాటలన్నియు వినుచున్నాను. పొమ్ము. పెద్దరాణిని బిలువుము.

దాది—నే నెందుకు పిలిచెదను? నీవే యామెవద్దకు పోరాదా? ఆమె నీ కేమియు కొనితెచ్చుకొన్నదాసి గాదు. ఆమెయు నొకరాజు కన్న బిడ్డయే.

జయ...నీవు వెళ్లవా?

దాది...ఓహో!...చూడు దూర్వాసమహామునివలె ఆకన్న లెజ్జచేయుట! ఏమి! చంపెదవా? చంపుటలోమాత్ర మాశ్చర్యమేమి? దేశమును చేతులార ముసల్మానుల కప్పగించి ఇంటిలో నాడువారిని బెదరించుచుంటివి...సిగ్గుగుట లేదా?

జయ—ఎవ రేమి నిందించినను ఒప్పుకొందును కాని ధాత్రీ మాతా! నీవును...నాప్రాణముపై కేమి వచ్చునో నీ వెఱుఁగుదువా?

దాది—ఎందు కెఱుఁగను? ఆమె మచ్చుచల్లినది, మచ్చు!— రాణియై నెత్తిపై సవారుతీయుచున్నది! మంచిది, పోవుచున్నాను. పెద్దరాణిని పిలిచెదను. కాని యామెను నీ వేమియు ననవలదు. ఆసతీ లక్ష్మి యవమానము నేను చూడఁజాలను. (నిష్క్రమించును.)

జయ—మచ్చే చల్లినది! నన్ను తన్మయునిగా జేసినది. మఱి యేమియు బాగుగ నుండుట లేదు. కమల ఈ నగరము విడిచి పోయినది—ప్రపంచము శూన్యముగాఁ గనుపట్టుచున్నది. కన్నుల యెదుట కటికిచీఁకటి కమ్మినది!

(మెల్లమెల్లగా సరస్వతి ప్రవేశించును.)

సర—నన్ను పిలిచితిరా ?

జయ—అవును. చిన్నరాణి యెచ్చట నున్నదో యెరుగుదువా?

సర—లేదు.

జయ—నీతో నేమియు చెప్పిపోలేదా ?

సర—లేదు.

జయ—నీతో(తలవంచుకొని) పోట్లాట యేమియు జరుగలేదా?

సర—లేదు.

జయ—(కొంచెము సే పూరకుండి) నీవు నిజమే చెప్పుచుంటివా సరస్వతీ? నాకు నమ్మకము గలుగుట లేదు.

సర—నమ్ముటయు నమ్మకపోవుటయు మీ యిష్టము. మీ రడిగితిరి గాన చెప్పితిని.

జయ—కమల యిటుల వెడలిపోవుట కేమేని కారణ మెఱుఁగుదువా ?

సర—లేదు. కారణము సరిగా తెలియదు.

జయ—ఏమేని ఊహించితివా ?

సర—ఊహించితిని.

జయ—ఏమని ఊహించితివి?

సర—నేను చెప్పను. నేను చెప్పఁజాలను.

జయ—చెప్పఁజాలవా? చెప్పవా?

సర—నేను చెప్పను.

జయ—సరస్వతీ! ఇదియే నీపతిభక్తి? మంచిది. నామాట వినుము. కమలకై నేను దేశత్యాగము చేయవలసియున్నను చేసెదను. ఇది నీ వెఱుఁగుదువా?

సర—బాగుగ నెఱుఁగుదును. దేశమును ముసల్మానులచేతి కమ్మితిరి. దానిని విడిచెద రనుటకు మాత్రి మాశ్చర్య మేమి?

జయ—దేశమును నేను అమ్మిరా లేదు. నేను సంధిచేసితిని.

సర—దీనిని సంధి యనెదరా రాణా! మహమ్మదీయు లైదు వందల సంవత్సరము లుండి దేశమునకు, జాతికి, ధర్మమునకు హాని కలిగించుచున్నారు. ఆ మహమ్మదీయులనే రాఠోరువీరుడగు దుర్గా దాసును, మీయన్న భీమసింహుడును ఓడించిరి. మీ రామోడిన మహమ్మదీయులతో సంధిచేసితిరి!--మీరు రాణా యను పదమున కగౌరవము తెచ్చితిరి.

జయ—ఈసంధి నే నెవరికై చేసితిని?--నాకొఱకా, జాతి కొఱకా?

సర—చిన్నరాణికొఱకు!--ఇంక నేమేని యడిగెదరా?

జయ—లేదు.

సర—మంచిది, ఇంక నేను పోదును,

జయ——పోమ్మ్మా--నేను కమలకొఱకు పోదును.

సర——మీరుచిత్తము!--నాథా! వినుఁడు. ఒకమాట చెప్పి పోదును. ఎక్కడ కేని పొండు. మీకు శాంతిమాత్రము చిక్కదు. ఏ ప్రచండప్రవృత్తి కారణముచే నేఁడు మీరు నన్ను విడిచి, పుత్రుని విడిచి, రాజ్యమును విడిచి పోవుచుంటిరో అది ప్రేమకాదు--అది లాలస. ప్రేమగతి యెప్పుడును నదివలె స్థిరముగను, స్వచ్ఛముగను, మందముగను నుండును. సెలయేటివలె పొంగును, నురుఁగును, చుఱుకును గలిగియుండదు. సత్యమైన ప్రేమ మెఱపుతళుకువలె తీవ్రముగ నుండదు--అది వెన్నెలవలె శాంతముగను, మనోహరముగను ఉండును. నా యీమాటను జ్ఞాపక ముంచుకొనుఁడు--అక్షరము అక్షరము కలిపి చూచుచుకొనుఁడు. (నిష్క్రమించును.)

జయ——నే నెఱుగుదును సరస్వతీ! ఇది ప్రేమగాదు. వట్టిలాలస. ఈ లాలస మెల్లమెల్లగా నన్ను రాహువువలె మ్రింగివేయుచున్నది--వ్యాధివిషమువలె శరీరమంత వ్యాపించుచున్నది. ఈలాలస నన్ను సుడిలోఁ బడఁగొట్టుచున్నది! అంతయు నెఱుఁగుదును. కాని ఉపాయము లేదు--ఉపాయము లేదు.

(ఉద్భ్రాంతస్వరముతో నిష్క్రమించును.)

---

## షష్ఠదృశ్యము

స్థానము--పుణ్యామాలీదుర్గమున దుర్గాదాసుని పడకటిల్లు.
సమయము——రాత్రి పదిగంటలు.

(మంచముపై పరుండి దుర్గాదాసు ఒకజాబు చదువును.)

"ఈవిధముగ సరలుఁడు సుదారుఁడునగు మీసోదరుఁడు సమరసింహుని మృత్యువయినది. ఇచ్చట మనమహారాణి చితారోహణ మొనర్చి స్వర్గస్థుఁడగు నాథునిపజ్జకు పోయినది. అచ్చట స్త్రీలోలుఁడు, కాతరుఁడు నగు రాణాజయసింహుఁడు మొగలులతో నవమానజనకమగు సంధిచేసికొని; రాజ్యమును విడిచి, చిన్నరాణిని దీసికొని జయసముద్రతీరమున నుండుటకై వెడలిపోయెను. ఆయనయాచరణము,

మహారాణీస్వర్గవాసము, వీరుఁడగు సమరసింహుని మృత్యువు వీని వలన రాజస్థానమందలి రాజపుత్రు లెల్లరు చిందఱవందఱయైరి. రాణారు సేనాపతీ! ఇంక మీరు దేశమునకు దిరిగిరండు. మాయపరాధము క్షమింపుడు. మాయందఱ ప్రార్థన మన్నింపుడు.

దుర్గా—ఊఁ! పత్రమున నూరుకన్న నెక్కువగ సామంతుల సంతకము లున్నవి.

(ఉత్తరము మడచి దిండుక్రింద పెట్టి అగదిలో తిరుగుచుండును. శంభాజీ ప్రవేశించును)

శంభాజీ—(సారాయిమత్తుచే తొట్రుపడుస్వరముతో) వింటివా దుర్గాదాస్!

దుర్గా—ఏమిమహారాజా?

శంభాజీ—ఔరంగజేబు సర్వపర్వతభూములనుండియు తరుమఁ గొట్టఁబడినాఁడు. కుఱ్ఱఁడు, శంభాజీతో యుద్ధము చేయ వచ్చినాఁడు. ఎఱుఁగఁడు కాఁబోలుఁ

దుర్గా... కాని బీజపూరు, గోలకొండ శత్రువులకు చిక్కినవి.

శంభాజీ—దీనిచే నా కేమియు హానిలేదు. నేనిట బీజాపూరు పశ్చిమ ప్రాంతమున పీఠము వేసి కూర్చుంటిని. ఇటు ముందుకు వచ్చినచో శంభాజీ, వెనుకకు మఱలినచో శంభాజీ సైన్యము. మువ్వు తిప్పలు పెట్టెద. కుఱ్ఱఁడు ఔరంగజేబెఱుఁగఁడు. వీఁడు శంభాజీ—మఱి యెవరును కాదు.

దుర్గా—కాని యీవిధముగ నుద్దేశహీనమగు యుద్ధముచే నేమి లాభము?—మహారాజా! నా కనుమతి యొసఁగుఁడు. నేను రాజపుత్రసైన్యమును దీసికొని వచ్చెదను. మహారాష్ట్రులును, రాజపుత్రులును గలిసి ఔరంగజేబు నెదిర్చెదరు.

శంభాజీ—రాజపుత్రులు! రాజపుత్రులు యుద్ధము చేయుట నెఱుఁగుదురా? వారిసహాయ మవసరము లేదు. దుర్గాదాస్! ఒకనాఁడు మహారాష్ట్రులే రాజపుత్రులను, మొగలులను, ఓడించెదరు.

దుర్గా—మహారాజా! రాజపుత్రుల నోడించుటచే మహారాష్ట్రుల గౌరవము హెచ్చఁజాలదు. వారును హిందువులే, వీరును హిందువులే.

శంభాజీ—ఆఁ! ఈమాట వాస్తవము--దుర్గాదాస్! నీపానుపు మెత్తగ నున్నదా?

దుర్గా—రాజపుత్రుల కీపానుపు చాల మెత్తనిదే. మాకు తఱుచుగా గుఱ్ఱములవీపే పాన్పుగా నుండును.

శంభాజీ—ఇచ్చటనే నీమతము, నామతమును కలియుటలేదు. యుద్ధము నుండవలె, దానివెంట సుఖభోగము లుండవలె-దుర్గాదాస్ జీవితములో నెన్నికష్టములనేని సహింపవచ్చును కాని పానుపు మెత్తగా నుండవలెను—కాబలేస్ఖాన్!

తెరలో—హుజూర్!

శంభాజీ—అంతయు తయ్యారైనదా?

తెరలో—చిత్తము.

శంభాజీ—ఇంక నీవు విశ్రమించుము దుర్గాదాస్! నేను పోయెదను.

(నిష్క్రమించును.)

దుర్గా—(పచారుచేయుచు) మహారాష్ట్రజాతి పోరాడఁజాలునదే!—వీరి గుఱ్ఱపుసవారి, యుద్ధకౌశలము, సహనశీలత చాల యద్భుతములు! దీనికితోడు రాజపుత్రుల ఏకాగ్రత, స్వార్థత్యాగము, దృఢత్వము కలిగియున్నచో నింక నేమి కాఁజాలదు! కాని కాదు, అది కాదు. భారతభాగధేయము బాగుగలేదు. హిందూజాతి విచ్ఛిన్నమై పోయినది, అది మరల నొకటిగా నగుట చాల కఠినము.

(మెదలక తిరుగుచుండను. వెంటనే దూరమున ఆర్తనాదము వినఁబడును.)

దుర్గా—ఓహో! ఎంత తీవ్రమగు నార్తధ్వని! ఎంత కరుణ నాదము! చెవులు చిల్లులు పడుచున్నవి. ఇది యెచ్చటనో దగఱనుండియే, మఱియు దగ్గఱనుండియే వినఁబడుచున్నది! ఇది యేమి! ఇది నా

ద్వారమువద్దనే వినఁబడుచున్నది. ఇది యొకానొక స్త్రీ యాక్రింద నము. హృదయభేదకముగ నున్నది.

(ఒక స్త్రీ జుట్టు విరియఁ బోసికొని చీర జారుచుండ పరుగెత్తుకొని వచ్చి దుర్గాదాసు గదిలో ప్రవేశించును.)

స్త్రీ—రక్షించుము! రక్షించుము!

దుర్గా—ఏమియు భయము లేదు అమ్మా! భయపడకుము నీ వెవతె వమ్మా?

(ఖడ్గహస్తుఁడై శంభాజీయు నతనివెంట కాబలేస్ఖానును ప్రవేశించెదరు.)

శంభాజీ—పిశాచినీ!--సైతానీ! తలుపు తెఱచి దానిని పారి పోనిచ్చితివా? నీవు బుద్ధిపూర్వకముగనే యట్లు చేసితివా?

స్త్రీ—ఆమె కులస్త్రీ.

శంభాజీ—అది కులస్త్రీ యగుచో నీ కేమి?

(స్త్రీ భయముచే వణఁకుచు మూర్ఛపోవును. శంభాజీ ఖడ్గముపట్టుకొని! ఆమెపైకి నురుకును. దుర్గాదాసు వెంటనే యడ్డపడును.)

దుర్గా—శంభాజీ!--మహారాజా! ఇది ఏమి! వీరుఁడవై యాఁడు దానిని చంపుట కురుకుచుంటివా!

శంభాజీ—మెదలకుము--తొలఁగిపొమ్ము.

దుర్గా—ఎప్పటికి కాదు! దుర్గాదాసు నేటివఱ కెన్నడు తన కన్నుల యెదుట నొక యబలపై ద్రోహము జరుగుట చూడలేదు. కత్తి నొఱలో పెట్టుడు, మహారాజా!

శంభాజీ...ఈమె యెవతెయో యెఱుఁగుదువా?

దుర్గా—ఎవతెయే నగుగాక. ఈమె నాసోదది.

శంభాజీ...తొలఁగిపొమ్ము దుర్గాదాస్!

దుర్గా...స్మారకము తెచ్చికొనుఁడు మహారాజా! మీరు మద్యము త్రాగితిరి లేనిచో మీ రొక యబలపై నిట్టిద్రోహము చేయరు.

శంభాజీ—మరల చెప్పుచున్నాను. తొలఁగిపొమ్ము.

దుర్గా...ఎన్నటికిని లేదు.

శంభాజీ——అగుచో కత్తి పట్టుము. నాకు రిక్తహస్తుఁడగు శత్రువును జంపుట యుచితము గాదు. కత్తి పట్టుము.

దుర్గా——ఈ పాటిజ్ఞాన మున్నచో మీరు రాఁడుదానిపై కేల కత్తి కట్టిరి? వినుఁడు మహారాజా!

శంభాజీ——కత్తి బట్టుము, (నేల తన్నుచు) ఇదిగో!

దుర్గా——కత్తిపట్ట నవసరము లేదు.

(దుర్గాదాసు శంభాజీ కంఠము పట్టుకొని నేలఁ బడగొట్టును. కత్తి లాగికొని పారవేయును. తలపాగా విప్పి రెండుచేతు లంటగట్టును. అద నెఱింగి కాబలేస్ఖాను పారిపోవును.)

దుర్గా——మహారాజా! మీరాయతిథిని, నన్ను క్షమింపుఁడు.

(దుర్గాదాసు తనకత్తి దీసికొని చచ్చిపడియున్న ఆ స్త్రీవద్దకు పోవును.)

దుర్గా——ఇది యేమి!--బాలిక చనిపోయినది. భయముచేతనే చనిపోయినది మహారాజా! ఈ సుకుమారప్రాణమునకై కత్తిపట్టుకొని తరుముకొని వచ్చితిరి. మీరు మహాత్ములగు శివాజీ మహారాజుల పుత్రులు! ఛీ! (నిష్క్రమించును.)

శంభాజీ——ఎవరు--పట్టుకొనుఁడు.

(బయట శస్త్రధ్వని వినఁబడును.)

శంభాజీ——విడువవద్దు--పట్టుకొనుఁడు.

(రక్తసిక్తాంగుఁడై దుర్గాదాసు మరల ప్రవేశించును; వెంట కాబలేస్ఖానును సిపాయిలును వచ్చెదరు. కాబలేస్ఖాను శంభాజీబంధనము విప్పును.

దుర్గా——మీరు నిలఁబడియుండుఁడు. నేను పారిపోను. ఏఁబదుగురు శత్రువులముందు ఒక మనుష్యుఁ డాత్మరక్షణము చేసికొనఁ జాలఁడు. నాప్రాణములు కాపాడుకొనుటకై నాజాతిసోదరుల ప్రాణములు హరించుటయు నేను గోరుట లేదు. నే నొకయాఁడుదాని ధర్మమును రక్షింపగల్గితిని. ఇదియే నామృత్యువున కుచిత సత్కారము. ఆపెప్రాణమును రక్షింపఁజాలక పోతిని. ఇదియే నాకు విచారము! బాగుగా బంధించుఁడు. మీరాయిచ్చవచ్చిన శిక్ష నీయుఁడు.

శంభాజీ—దుర్గాదాస్! నీకు చాలగర్వము!---ఇప్పుడు చెప్పుము, నిన్ను మంటలో పడఁద్రొబ్బుదునా లేక ప్రాణముతో పాతి వేయుదునా? నీ కేమిశిక్ష నీయను? నీ వెటుల చావఁగోరుచున్నావు?

కాబలే—సర్కార్! మనయింటికి వచ్చినయతిథిని మనచేతులతోఁ జంపుట యుచితముగాదు. ఇతనిని ఇతనిప్రాణమిత్రుఁడగు ఔరంగజేబువద్దకు పంపుట నాయభిప్రాయము--ఫలిత మొక్కటే యగును. పైపెచ్చు మీకు మీచేతులతో దుష్కార్యము చేయుట యుండదు.

శంభాజీ—అవును. ఇదియే బాగుగ నున్నది. కాబలేఖాన్! నీ వితనిని ఔరంగజేబువద్దకు పంపిరమ్ము. అక్కడకు పంపుట యనిన పులినోటికడకు పంపుటయే. (బిగ్గరగా నవ్వును.)

కాబలే—(తనలో) ఈవిధముగా కాబలేఖానునకును కొంత లాభ ముండును. గొప్పబహుమాన మొందెదను.

దుర్గా—మంచిది!—నేను చావఁబోవుచున్నాను. కాని జ్ఞాపక ముంచుకొనుము శంభాజీ! ఒక్కనాఁడు నీకు నిదియే దశ పట్టును— ఈకాబలేఖానుచేతిలోనే, ఇప్పుడేని నీమంచి కోరినచో మద్యపానము మానుము. స్త్రీలను గౌరవించుము. ఈకాబలేఖానును విశ్వసింపకుము.

(తెర వాలును)

---

సప్తమదృశ్యము,

స్థానము—అహమ్మదునగరులో ప్రాసాదము; అంతఃపురము,

సమయము----రాత్రి.

(బేగము గులనారు ఒంటరిగా తిరుగుచుండును.)

గులనారు—(తనలో) మే మేయుద్దేశముతో దక్షిణదేశమునకు వచ్చితిమి? జనులు ఔరంగజేబు అక్బరుని పట్టుకొనుటకై వచ్చెననియు, బీజాపూరు, గోలకొండ, జయించుటకు వచ్చెననియు, మహారాష్ట్రులను వశపఱచుకొనుటకై వచ్చెననియు ననుకొందురు· ఇట్టు లనుకొనువారలు వట్టిమూర్ఖులు. ఇవి యన్నియు చిన్ని చక్రిపులు తిరుగు

చున్నవి. కాని వీనిని నడిపించు పెద్దచక్రమును నేనే యిచటఁ గూర్చుండి త్రిప్పుచుంటిని. నాతర్జని వ్రేలు అటు సంకేతము చేయనిచో పందలకొలఁది యక్బరులు, బీజాపూరులు శంభాజులుకూడ ఢిల్లీచక్రవర్తిని దక్షిణమున కాకరింపఁజాలరు—ఎట్టి గొప్పశక్తిని ఎట్లు చేతులార వ్యయపఱచుచుంటిని!... దాసీ! సారాయి తెమ్ము—దుర్గాదాస్! దుర్గాదాస్!—నేను ని న్నెంత ప్రేమించుచుంటినో నీ వెఱిఁగినచో—ఎఱుఁగఁజాలినచో! నీవు నాహృదయమున మధురతిక్తమును, శీతలోష్ణమును కోమలకఠోరమునగు నెట్టియుచ్ఛను గలిగించితివో నీవే తెలిసికొనినచో! నేను నీకై మొగలబాదుషాను ఢిల్లీనుండి మార్వాడకును, మార్వాడనుండి దక్షిణమునకు నెటుల ఈడ్చుకొని వచ్చుచుంటినో నీకు తెల్లమగుచో నీవు నాపై తప్పక మోహితుఁడగువాఁడవు—నా కనుసన్నపై నాడువాఁడవు! దాసీ! సారాయి!

(దాసి సారాయి తెచ్చియిచ్చును. గులనారు సారాయి త్రాగి సీసాను దూరముగ పారవేయును)

గుల—ఓహో ఏమిపిపాస!—దుర్గాదాస్! నేను సారాయి యెందుకు త్రాగుచుంటినో నీ వెఱుఁగుదువా?—దుర్గాదాస్! నే నింత కృశించిపోతిని, నేఁడు నన్ను చూచినచో గుఱుతింపఁజాలవు. ఓహో! ఏమి యీకామాగ్ని! ఏమి యీప్రచండమగు నావేశము! ఏమి యీ మధురమగుబాధ!

(ఔరంగజేబు ప్రవేశించును.)

ఔరంగ... గులనార్!

గులనారు... సలామ్ సర్కార్!

ఔరంగ—గులనార్! నేఁడు చాలమంచివార్త వినుపించుటకు వచ్చితిని—దుర్గాదాసు పట్టువడినాఁడు.

గుల—(ఔత్సుక్యముతో) నిజమా పరిహాసమా?

ఔరంగ—పరిహాసముగాదు ప్రియసీ! సత్యము. కాబలేస్ఖాను అతనిని పట్టితెచ్చినాడు. కాబలేస్ఖానునకు సంతోషముతో నేను ముప్పదివేలవరహాలు బహుమానముగ నిచ్చితిని. మఱియు నతనితో

శంభాజీని పట్టితెచ్చినచో నింతకు పదిరెట్లు బహుమాన మిచ్చెదనని చెప్పితిని.

గుల...నిజముగనా? నాథా! ఇన్నిరోజులకు నీవు నన్ను ప్రేమించుచుంటివని తెలిసికొంటిని. మనము దక్షిణదేశము వెళ్ళిన యుద్దేశము నేడు నెఱవేఱినది.

ఔరంగ—కాని గులనార్! నీవు సారాయి త్రాగితివా?

గుల—అవును, త్రాగితిని. ఇప్పుడు దుర్గాదాసు పట్టుబడెనను సంతోషముతో మఱియొకసీసా త్రాగెదను. దాసీ!

ఔరంగ—ఇదియేమి గులనార్! నాయింటిలో మద్యపానమా?

గుల—(గర్వముతో లేచి నిలఁబడి) దీనిచేనేమిహాని సమ్రాట్?

ఔరంగ—నేను మద్యపానమునకు విరోధినని యెఱుఁగవా?

గుల—నీవు కావచ్చును. నేను కాను.

ఔరంగ—నీవు కావా? నీవు ఇస్లాముధర్మదీక్ష నంగీకరించ లేదా?

గుల—నా స్వబుద్ధిచే నే నిస్లాముధర్మము నంగీకరించితిని. నాయిచ్ఛలేనిచో నే నిపుడు దానిని విడువఁజాలుదును—ధర్మమా? నే నీధర్మము నాచరించుటకే ఈ ప్రపంచమునఁ బుట్టలేదు. కొంచెము నావంక చూడుము! ఈ గుండ్రని గులాబివంటి చేతులు చూడుము. ఈ నల్లని మెత్తని సోగవెండ్రుకలు చూడుము! ఈనిగనిగలాడు పసిడి వన్నె చూడుము! ఈరూపవిలాస మంతయు మసీదులో తల పగులఁ గొట్టుకొనుటకేనా? నీవు చాల ధార్మికుఁడవు సమ్రాట్! అగుచో నన్ను నీ యింటిలో నుంచుకొనక యేముల్లాబిడ్డనో పెండ్లియాడరాదు.

ఔరం—గులనార్! నీ వేమి వాగుచుంటివో నీ కేమియు స్మృతి లేదు.

గుల—నాకు బాగుగ స్మృతి యున్నది—విను—దుర్గాదా సెక్కడ?

ఔరం—దిలేర్ఖానునికాపువలలో నున్నాఁడు నే నా మూర్ఖున కేమిశిక్ష యుచితమో యాలోచించుచుంటిని మొనట—

గుల—ఆతని కేమియు శిక్ష వేయవలదు. విడిచిపెట్టుము.

ఔరం—అది యేమి?—అదికూడ జరుగునా?

గుల—జరుగును. బాగుగ జరుగును. ఇది నీవు స్వబుద్ధితో ననుకొనుచుంటివి. ఆతనిని విడిచిపెట్టుటయే కాదు. నీవు నావెంట చెఱసాలలోనికి వచ్చెదవు. అప్పుడు నేను దుర్గాదాసుని విడిచిపెట్టుమని చెప్పెదను—ఇంక నీవు నీచేతులతో విడిచి పెట్టెదవు.

ఔరం—నీకు తెలివి లేదు గులనార్! సారాయి యెక్కువ త్రాగితివి—నీకు తెలివి వచ్చినపిమ్మట మాటలాడుదును.

(నిష్క్రమించును)

గుల—మంచిది! నాకు తెలివివచ్చినది. దుర్గాదాస్! నిన్ను నాచేతులతో కైదు విడిపించెదను. ఇది నా కెంతగౌరవము! నేను నాచేతులతో నీచేతిసంకెలలు విప్పి, నిన్ను నాకౌఁగిటఁ జేర్చికొని, నీకు నాప్రేమభిక్షను పెట్టెదను. మఱియు నేను నీకు రాణి నయ్యెదను. నీ కది యెంతగౌరవము!—ఔరంగజేబ్! నీవు నా గుప్పిట నుంటివి! నిన్ను సింహాసనమునుండి పడద్రోయుట యెంత సేపు!—దుర్గాదాస్! నేను నీయపరాధములను క్షమించితిని. ఇన్నిరోజులవరకు నన్ను కామాగ్నిలో దహించితివి—అడవి యడవి, కొండ కొండ, నన్ను నీవెంట పరుగెత్తించితివి—అవన్నియు క్షమింపఁబడినవి! దుర్గాదాస్! నేఁడు నీతప్పులన్నిటిని క్షమించితిని. ఆహా! నేఁ డెట్టి సంతోషదినము!

(నిష్క్రమించును!)

అష్టమదృశ్యము.

స్థానము—శిబిరమందలి కారాగృహము.

సమయము—అర్ధరాత్రి.

(శృంఖలాబద్ధుఁడై దుర్గాదాసు కూర్చుండియుండును.)

దుర్గా—తుద కీదశకూడ పట్టినది. ఏ లాంఛనము నేటివరకు విజాతీయులు, విధర్ములునగు శత్రువులచేతులలో కాలేదో, అదినేఁ సజాతీయుఁడును, సధర్ముఁడునగు హిందువుచేతిలో నయినది!—శంభాజీ! మహారాష్ట్ర లోకరోజున రాజపుత్రులను, మహాత్మ్యదీయులను పథా

జితులఁ జేసెదరని నీ వనుకొనుచుంటివి. ఇట్లే యగుచో నేమియు చింత లేదు. కాని యిట్లు కాదు. ఒకనాఁడు మహారాష్ట్రులు, రాజపుత్రులు, మహమ్మదీయులు ఈముగ్గురును మఱియొకజాతిపాదముల కడ విశ్రమించుటను చూడఁగలవు. విశ్వాసఘాతమునకు తగినశాస్తి తప్పక జరుగును—ఎవరు?—చెఱసాలతలుపు తీయున దెవరు?

(అలంకరించుకొని గులనారు ప్రవేశించును.)

దుర్గా—ఆహా! ఏమి యీ యపరూపమగు నలంకారము! ఏమి యీ రూపజ్యోతి!—మీ రెవరు?

గుల—నేను బేగము గులనారును.

దుర్గా... బేగముగులనారా!

గుల...గుఱుతించ లేదా దుర్గాదాస్? ఒకమాఱు మనము కలిసికొంటిమి. నాఁడు నేను ఖైదీగా నుంటిని. నేఁడు నీవు నాఖైదీగా నుంటివి.

దుర్గా—మీరు నాకు శిక్షవిధించుటకై వచ్చితిరా?

గుల... లేదు. నిన్ను ఖైదునుండి విడిపించుటకు వచ్చితిని.

దుర్గా—ప్రత్యుపకారముగనా?

గుల... కాదు.

దుర్గా—మఱి దేనికి?—బాదుషాహుకసము చేతనా?

గుల—బేగము గులనారు బాదుషాహుకసమును బాటించునది కాదు, నేటిదనుక వారే నాయాజ్ఞను పాలించుచుండిరి.

దుర్గా—అగుచో?

గుల—నేను నిన్ను సంతోషపూర్వకముగ విడిపించుటకు వచ్చితిని—ఎందుకన నీవు నామనోహరుఁడవు.

దుర్గా—పరిహాసము చేయుచుంటిరా?

గుల—అచ్చెరు పడుచుంటివా?—నేను సాక్షాత్తు భారతరాజేశ్వరియగు గులనారును. నీ వొక రాజపుత్రసేనాపతివి. నేను నిన్ను మనోహరుఁ డనుచుంటిని. నిజముగ నాశ్చర్య మగుసంగతియే. కాని నాయానందమును నీ వెఱుఁగవు. నే నొకసామాన్యస్త్రీవలె

సేవనిని చేయను. ఆహా! సమ్రాట్టునకు పట్టపురాణినైయుండుటకంటె గాని యొకసామాన్య సేనాపతిని మనోహరుఁడని యనఁగల్గుదునా? కాని విలక్షణత్వమే నా కిష్టము. సర్వసామాన్యమగు పనిని బేగముగులనా రెన్నఁడును జేయదు. గులనారు గుఱ్ఱమును పరుగెత్తించునపుడు కళ్లెమును విడిచివేయును. సామాన్యమును, పరిమితము నగు నానందము నామె యెన్నఁడును గోరదు. బేగము గులనారు స్వతంత్రురాలు. ప్రతి పనియందు నామెకు స్వాతంత్ర్యమే యిష్టము.

దుర్గా...కాని—బేగము—

గుల...వినుము. నామాట వినుము. నా ప్రతికార్యమును విలక్షణము, నద్భుతము నైయుండును. ఈయఖండమొగలసామ్రాజ్య మొక గొప్ప యద్భుతము కాదా?...ఈ యద్భుతము నాసృష్టి! ఈ సామ్రాజ్యమున సంతకము బాదుషాది, రచన నాది. నాతర్జనీసంకేతముచే సామ్రాజ్యమున యుద్ధము జరుగును. నాకనుసన్నచే శాంతి నెలకొనును. చిఱునవ్వుతో నే నొకమాఱు చూచినచో నెందఱేని రాజులయ్యెదరు. నేను కనుబొమ్మలు నిగుడ్చినమాత్ర రాజ్యము లన్నియు మట్టిలోఁ గలియును. నేటివఱకిటులనే జరుగుచున్నది. ఏనాఁడు నేను నీచేత కైదీనయితినో నాఁ డది దైవలిఖిత మని భావించితిని. నే నే మనుష్యునకును తల వంచలేదు. నాఁడే నిన్ను వలపుచూపుతోఁ జూచితిని. కాని నావలపు నీకు తెలుపలేదు. నేను నీవశమునకైదీగా నుంటిని. ఆ పరతంత్రదశలో ప్రేమభిక్ష వేడుట నాప్రవృత్తికి భిన్నమైనపని. నేఁడు నీవు నాకైదీవి. నా ప్రేమను దెలుపుట కిదియే మంచిసమయము దుర్గాదాస్! నేను నిన్ను ప్రేమించుచుంటిని.

దుర్గా...బేగముసాహెబా! మీ రొడలు తెలిసి మాటలాడుట లేదు.

గుల...బాదుషాకు భయపడుచుంటివా? రమ్ము చూచెదవు. బాదుషా నాకు దాసుఁడు. నే నతనికి దాసిని గాను. నిన్ను నేను ఢిల్లీ సింహాసనమునఁ గూర్చుండఁ బెట్టెదను...రమ్ము.

ఉ. ఎంచక మాటలాడకుమ! యీక్షణ మీచెఱనుండి నిన్నుఁ ద
ప్పించెద, నీదు నాజ్ఞ జరిపించెద, ప్రాణమురీతి నిన్ను ప్రే
మించెద, బాదుషాను తఱిమించెద, భారతసింహపీఠి నె
క్కించెద గౌఁగిలించి రతికేళినిఁ దేల్పగరమ్ము వల్లభా!

దుర్గా... బేగము సాహబా! క్షమించుడు. దుష్టపథమున నడుచు టచే నవఖండమండలాధిపత్యము వచ్చినను నా కక్కర లేదు.

గుల... సామ్రాజ్యము వలదా?

దుర్గా...వలదు బేగముసాహబా!— మీరు వెడలిపొండు.

గుల—ఏమి? నీకు నే నక్కఱ లేదా?

దుర్గా—వలదు. మారాజపుత్రులు పరస్త్రీని తల్లిగా భావింతురు. మీ మర్యాదను మీరు నిలఁబెట్టకుందురు గాక, నేను నిలుపుకొందును.

గుల—(క్షణకాలము నిశ్శబ్దముగ నున్నపిమ్మట) ఏమి దుర్గాదాస్! ఔరంగజేబుబాదుషాయంతవాఁడు నే నాడించినట్టుల నాడుచుండ నీవు నా ప్రేమదానమును—నాకంఠాలింగమును నిరాకరించెదవా?

దుర్గా—బేగముసాహబా! ప్రపంచమున నందఱు నౌరంగజేబులు కారు. ఈ ధరాతలమున ఔరంగజేబువంటివారును గలరు. దుర్గాదాసువంటివారును గలరు.

గుల...ఇదియును సంభవమా!—దుర్గాదాస్! నీకు దీనిఫలితమే మగునో యెఱుఁగుదువా?

దుర్గా...ఎఱుఁగుదును... మృత్యువు.

గుల—కాదు. దుర్గాదాస్! నీవు పరిహాసము చేయుచుంటివి.

దుర్గా—జీవితములో నింతకన్న గంభీరముగ నే నెప్పుడును బలుక లేదు.

గుల—ఏమి, నన్ను ఉపేక్షించుచుంటివా?...నామాట నీ కంగీకారము గాదా? దుర్గాదాసూ! నేను మొదటనే చెప్పితిని. గులనారు మోకరించి యెవరిని ప్రేమభిక్ష యాచింపదు. ఆమె ఆశీర్వాద

మును జోలె ప్రేమను పంచిపెట్టును. నిశ్చయించుకొనుము, గులనారు ప్రేమయా, మృత్యువా?

దుర్గా—నిశ్చయించుకొంటిని. నేను మృత్యువునే కోరుచుంటిని.

గుల—మృత్యువు! మంచిది. అట్లే యగుగాక, నేను నాచేతులతో నిన్ను వధించెదను—గులనారువలన ఒకవస్తువు పొందెదవు—ప్రేమ లేక మృత్యువు! ప్రేమ యక్కఱలేనిచో చచ్చుటకు సిద్ధపడుము... కామబఖ్ష్!

(గులనారుపుత్రుఁడగు కామబఖ్ష్ ప్రవేశించును.)

గుల—కామబఖ్ష్!—వధింపుము. ఇతనిని వధింపుము. తత్క్షణము వధింపుము—ఏమి చూచెదవు! వధింపుము.

కామ—ఎందు కమ్మా?—బాదుషాహుకుము లేకయే—

గుల... బాదుషాహుకుమా? నాహుకుముపై నింక బాదుషాహుకుమా? తత్క్షణము వధింపుము—ఏమి నామాటవినవా? (బిగ్గరగ) వధింపుము—వధింపుము—వధింపుము.

కామ—(కత్తి దీసి నఱకబోవుచుండును)

దుర్గా—నేను సిద్ధముగ నున్నాను.

(కామబఖ్ష్ దుర్గాదాసును జంపుటకై కత్తి యెత్తును. ఈసమయమున దిలేర్ఖాను ప్రవేశించును.)

దిలే—ఖబర్దార్ కామబఖ్ష్!—లేనిచో +

(కామబఖ్ష్‌వైపునకు పిస్తోలు పట్టును.)

గుల—నీ వెవఁడవు?

దిలే... నేను మొగలసైన్యాధిపతినగు దిలేర్ఖానును.

గుల—నీవు నాయాజ్ఞకు విరుద్ధముగానుండునంతటి సాహసమా?

దిలే—దిలేర్ఖా నెవ్వరికిని వెఱచువాఁడు కాఁడు. బేగము సాహెబా! అతఁడు తన సాధువర్తనమున విశ్వాసముంచి దైవము నెదుటఁ గూడ నిజము చెప్పుటకు సెనుదీయఁడు. ఇంక నీవా! తుచ్ఛపాపినివి—మహాపాపినీ! నిర్లజ్జా! నే నేమియు విన లేదని యనుకొనకుము:అంతయువింటిని. (దుర్గాదాసువైపునకు దిరిగి) వీరశిరోమణీ

దుర్గాదాసూ! నీవు మహాత్ముఁడవని యెఱుఁగుదును. కాని నీ వింత మహాత్తుగలవాఁడవని కలలోఁగూడ ననుకొనలేదు. నా చేతులతో నీ సంకెలలు విప్పుచున్నాను. (సంకెలలు విప్పి) బయటికి రమ్ము. నేను నా సర్వోత్తమమగు గుఱ్ఱమును నీ కిచ్చుచున్నాను. వెంట సైదువందల గుఱ్ఱపురౌతులఁ బంపుచున్నాను. స్వదేశమునకు మరలిపొమ్ము. నా హుకుముచే ఏమొగలసేనానియు నిన్ను పలుకరింపఁజాలఁడు. రమ్ము. వీరశిరోమణీ! సలాము బేగము సాహెబా!

(దుర్గాదాసుని చేయిపట్టుకొని దిలేర్ఖాను నిష్క్రమించును. గులనారును కామబఖ్షును తెల్లపోయి చూచెదరు.

(తెర వ్రాలును.)

---

శ్రీ పరదేవతాయై నమః

# దుర్గాదాసు

## పంచమాంకము

ప్రథమదృశ్యము.

స్థానము—అక్బరు డేరా.

సమయము—రాత్రి.

సింహాసనమున అక్బరు కూర్చుండియుండును. ఎదుట వేశ్యలు ఆడుచు పాడు

### గీతిక.

గాశము, చంద్రికిరణములు, నిర్మలతారాగణముల్
ంచిన హర్షనిమగ్నము లగుచుండెను లోచనముల్
ంగి నలుదిక్కుల వీక్కిలి మానం బ్రావహిలెన్

సాటిలేని వైభవమును దాల్చి ప్రశాంతధాత్రి కడు దేజరిల్లె
పవనపోత సంచలితాభ్రము లొయ్యన జ్యోత్స్నమగ్నత గాంచెన్
భువనంబులు నందనవన తుల్యంబులు మనోహరము లయి మించె॥

అక్బరు—ఆహా! సుభానల్లా!—వహ్వా! బేహోగులో కోమల నిషాదము! స్వర్గముకూడ నిట్లే యున్నచో చాల సుఖస్థానమే. సుభానల్లా! ఇంకనాడుడు. ఇంకపాడుడు. (ఈ సమయమున నవ్వుచు కాబలేఖాను ప్రవేశించును.)

అక్బరు—ఎవరు? కాబలేఖానా! శంబాజీ యెక్కడ?

కాబలే—ఇంక శంభాజి యెక్కడ! శాహజాదా! శంభాజీ ఇట్లు...(పతన సంకేతము చేయును.)

అక్బరు—అనఁగా?

కాబలే—పడిపోయినాఁడు?

అక్బరు—నూతిలోఁ బడెనా? ఎక్కువ త్రాగెను కాఁబోలు.

కాబలే—లేదు శాహజాదా! శంభాజీ బద్ధుఁడైనాఁడు. ఆయన యిపుడు మీనాయనగారి డేరాలో నున్నాడు, చేతులకు--(బంధనావస్థను చూపించును.)

అక్బరు—ఇది యేమి!--ఇట్లు జరుగుట యసంభవము.

కాబలే--అసంభవముకాదు శాహజాదాసాహబ్! యథార్థము. ఇంక మీతోడ్రవ మీరు చూచుకొనుఁడు.

అక్బరు—నిజమే చెప్పుచుంటివా కాబలేఖాన్!

కాబలే—(తలయూఁగించి) ముమ్మాటికి నిజము శా దా సాహబ్! కాబలేఖాను సాధారణముగా అసత్యము చెప్పఁడు. శ జీ నిజముగ కైదుచేయబడినాఁడు. ఇపుడు మీరేమి చేయుటకు న యించుకొంటిరి, మీమొగము విన్నవోయినది!-(అక్బరు ఊరకుండును) వినుఁడు శాహజాదాసాహబ్! న న్నడిగినచో నేను చెప్పున దిదియే. మీరు నావెంట బాదుషావద్దకు రండు.

అక్బరు—(శుష్కహాసము చేసి) బాదుషా యొద్దకా? అంత కన్న పులివద్దకు పోవుటకు సమ్మతింతును.

కాబలే—శాహజాదాసాహబ్ ! మీరు నావెంట బాదుషా యొద్దకు రండు. మీ కేమియు భయములేదు వారు మి మ్మేమియు ననరు, పైగా సంతసించి మి మ్మాదరింతురు. నాది పూచి.

అక్బరు—బాదుషా వద్దకా?

కాబలే—అవును శాహజాదాసాహబ్!—ఏ మందురు?

దుర్గాదాసు ప్రవేశించుచు,

దుర్గా—(కాబలేష్ఖానుతో) కృతఘ్నా! దుష్టా! అమాయకుఁడగు నక్బరుని నీవలలోఁ బడఁగొట్ట నెంచితివా?

అక్బరు—ఇదియేమి! దుర్గాదాసా?

కాబలే—అవును. దుర్గా...(వణఁకును)

దుర్గా—కాబలేస్! నీకోరిక నెఱవెఱలేదు. నేను తిరిగి ప్రాణముతో వచ్చితిని. నీవు నన్ను పగతురక కప్పగించినచో నం దేమియు వింతలేదు. నీకు నే నెవఁడనుగాను. కాని తుదకు నీవు నీప్రభువగు శంభాజీనికూడ మోసపుచ్చితివి!—అతనిఁగూడఁ బట్టి యిచ్చితివి. కృతఘ్నా! నరపిశాచా!

కాబలే—కాదు. నేను కాదు--మహారాజు---

దుర్గా—నీవుకాదా? కాబలేస్! శంభాజీ నీయాలోచనచే నొక నవోఢయగు బ్రాహ్మణబాలికను బట్టుకొనుటకై కోటవెలుపలికి వచ్చెనా లేదా? నిజము చెప్పుము. లేనిచో నిన్ను విడువను.

కాబలే—(వణకుచు) చిత్తము.

దుర్గా—మఱియు నీ వీసంగతిని శాహజాదా ఆజిమునకు మొదటనే చెప్పియుంచితివా లేదా? తర్వాత ఆజిము ఐదువందల మొగల సిఫాయిలను వెంటఁ దీసికొనివచ్చి శంభాజీమహారాజును ఖైదు చేసెను—అవునా? కాదా?

దుర్గా—పారిపోకుము. (కాబలేష్ఖానుని మెడపట్టుకొని) కాబలేష్ఖాన్! ఈశ్వరుని స్మరించుము.

బలే—క్షమించుము మహారాజా! నేను మీకుక్కను.

(భయముచే వణఁకుచు కాబలేష్ఖాను దుర్గాదాసుని కాళ్లపై బడును)

దుర్గా—పొమ్ము. నేను నిన్ను జంపను. నిన్ను చంపి నాచేతుల అపవిత్రము చేసికొనను. నీవు శంభాజీకి పరలోకమును దెరచుటయే కాక తుద కీలోకమును గూడ చెరచితివి. నరకమునంగూడ నీకు స్థాన ముండదు. పో (కాలితో తన్ని కాబలేస్ఖానుని వెళ్లగొట్టును) శాహజా దాసాహెబ్! ఒకనాఁడు నేను శంభాజీతో "నీకీ మద్యపానము, ఈస్త్రీలౌల్యము సర్వనాశనముచేయును మఱియు నా సర్వనాశనము ఈకాబలేస్ఖానుని చేతిలోనే యగు" నని చెప్పితిని-సరిగా నదియే యైనది! యువరాజా! మీ రీదృష్టాంతముచే నీతి నేర్చుకొనుఁడు. మీ కిదివఱకు చెప్పియుంటిని. మరల నిపుఁడు చెప్పుచుంటిని—మద్యమును వేశ్యను విడువుఁడు. ఈ రెండు వ్యసనములును చాల భయంకరములైనవి.

అక్బరు—కాలము చాలమించినది. దుర్గాదాస్! కాలము చాల మించినది.

దుర్గా...ఏమియు మించ లేదు శాహజాదాసాహెబ్! ఇంకను సమ య మున్నది. మనప్రవృత్తియు నణంచుటకు వీలు లేనిది లేదు; దానికి నాంతరికచేష్ట యావశ్యకము. మీరు గొప్పవంశమున బుట్టితిరి. గొప్పశిక్షను బొందితిరి. గొప్పహృదయము గలవారలు. మీరు ప్రయత్నించినచో నీ దుర్వ్యసనముల విడువఁజాలరా?

అక్బరు—(క్షణమూరకుండి) దుర్గాదాస్! నీవు యథార్థము చెప్పితివి. నే నీవ్యసనమును విడిచెదను. ఇదియే కాదు, ఈప్రాపంచిక వ్యసనమును గూడ విడిచెదను. సర్వము విడిచెదను.

అక్బరు—అవును దుర్గాదాస్! సర్వమును విడిచెదను. నా కీజీవితముపై నసహ్యము కలిగినది. ఇతరుల కంఠమున కఱిగా జీవితము గడుపుచుండియు నే నింక భోగవిలాసములలో మునిఁగి యుంటిని. ఈ నా మానసిక దురవస్థ సామాన్యమా? ఇట్టి యనుభవము నాకు నేటి వఱ కెన్నఁడును గలుగ లేదు. (తల వంచుకొనును.)

దుర్గా—వినుఁడు శాహజాదాసాహెబ్! నావెంట మార్వా డకు రండు—నేను బ్రతికియున్నంతవఱకు మీ కేమియు భయము లేదు-రండు.

అక్బరు—కాదు దుర్గాదాస్! నేను మార్వాడకు రాను. మక్కాకు పోవుదును. చాలదినములనుండి నీకంఠమున కురిగానుంటిని. నానిమిత్తము నీకు చాల కష్టములు సహింపవలసి వచ్చెను. క్షమించుము. నన్ను రక్షించుటకై నీవు స్వదేశమును స్వజనమును విడిచితివి. నాకారణమున నీ వీరసోదరుడు మరణించెను, మఱియు నీవును మృత్యుముఖమునుండి తిరిగి వచ్చితివి.

దుర్గా—యువరాజా! ఇది నా ధర్మము, నాకర్తవ్యము.

అక్బరు—కర్తవ్యము! నేనును మక్కాకుఁ బోయి యిటుల కర్తవ్యపాలనము నేర్చుకొందును. చాలపాపము లొనర్చితిని. ఏపని యందును మనస్సు నిలువలేదు. సుఖవిలాసములలో జీవిత మంతయుఁ గడపితిని. తండ్రికి విరోధినైతిని. నిర్లక్ష్యముచే పడతిని చంపుకొంటిని. బుద్ధిపూర్వకముగా నాకై నిన్ను కష్టపెట్టితిని. తుదకు శంభాజీ మృత్యువునకు గూడ కారణమైతిని, పోవుచున్నాను, దుర్గాదాస్! నాకై యిదివరకు చేసినంత యింకను జేయుము. నీవు స్వదేశమునకు బొమ్ము—మా రజియాను కనిపెట్టియుండుము. దానిని కనిపెట్టి యుండుము. దుర్గాదాస్!—నేను దానిని నీ చేతులలోఁ బెట్టితిని. మంచిది, పోవుచున్నాను. దయ యుంచుము మిత్రమా! (అక్బరు దుర్గాదాసుచేయి పట్టుకొనును.)

---

## ద్వితీయదృశ్యము.

స్థానము... జయసముద్రతీరమున రాజభవనము.

సమయము—సాయంకాలము.

(జయసింహుఁడు కమలాదేవియు వసారాలో నిలఁబడి మాటలాడుదురు.)

జయ—కమలా! నీవు నాకై విముఖురాలవు కావలదు. నీకై నేను దేశము విడిచితిని. రాజ్యము విడిచితిని, పుత్రుని విడిచితిని.

కమల—ని న్నెవరు విడువుమని చెప్పిరి?

జయ—నీవు.

కమల...ఎప్పుడును, లేదు. నేను కేవలము పెద్దరాణినో చిన్న రాణినో యిద్దఱిలో నొక్కతెనే ప్రేమింపుమని చెప్పితిని.

జయ—నేను నిన్ను పరిగ్రహించితిని. పెద్దరాణిని విడిచి పెట్టితిని.

కమల—కాని నేను రాజ్యమును విడిచి రమ్మని చెప్పలేదు, పెద్దరాణి కొమరుఁడగు సమరసింహునకు రాజ్య మిచ్చి రమ్మనలేదు; నా పుత్రుఁడు నీ కేమియు కాఁడా?

జయ—ఓహో! ఇందులకే నీకు పెద్దరాణితో విరోధము వచ్చినది! అగుచో నా కింతవఱ కేల చెప్పలేదు కమలా? ఆఁ! ఇప్పుడు తెలిసినది—నాఁడు పెద్దరాణి తనపుత్రున కమంగలమును శంకించి జగడమునకు హేతువు నుడువలేదు. కమలా! రాజ్య మెటులనో అమరసింహునిదే. అతఁడేగదా పెద్దవాఁడు. శాస్త్రప్రకారము పెద్దకొమరుఁడే రాజ్యమున కుత్తరాధికారి యగును.

కమల—అగుచో నీవు శాస్త్రమును నాకన్న నెక్కుడని భావించుచుంటివా?

జయ—ఒకనాఁడు అన్నిశాస్త్రములకన్న నిన్నే యెక్కువగ మన్నించువాఁడను.

కమల...అగుచో నీయనంతరము అన్నవస్త్రములకై నేను పెద్దరాణిని తిరిపె మడుగవలయుననియా నీకోరిక?

జయ—(క్షణము స్తంభితుఁడై యున్నపిమ్మట) కమలా! భవిష్యత్తు విషయమై నీ కింత చింతయా? నే నిప్పుడు నింతగ నాలోచింపలేదు. అగుచో నీకు పుత్రునకై చింతకాదు. నీకై చింతయా?

కమల—ఎక్కడ? నాకై నే నెన్నఁడును చింతపడలేదు రాణీ! నేను రాణా రాజసింహుని పుత్రుఁడను, నేను కోరినచో నేమి కాదు? యశము, మానము, ఐశ్వర్యము, విలాసము విడిచి—స్వజాతి ధిక్కారమును సహించి—నేను నీకై వనవాసినైతిని. భవిష్యత్తు నెవఁడు చెప్పును? నీకై ప్రస్తుతము సర్వము విడిచితిని.

కమల—నాకై విడిచితివా లేక నారూపమునకై విడిచితివా? నీవు నన్ను పెండ్లియాడినది నాకై కాదు. నారూపమునకై. నేను నిన్ను పెండ్లియాడినది నీకై కాదు. నీరాజ్యమునకై.

జయ...నారాజ్యమునకా? ఎట్టిమాట వినుచుంటిని. ఇన్ని రోజులవఱకు నేను ప్రేమస్వప్నమునే కనుచుంటినా? నీహృదయమును నా కర్పించితి వనుకొంటిని! నీ యీ దానమోహమున ముగ్ధుడనగు చుంటిని! కమలా! నీవు నాసుఖమహాస్వప్నమును బోఁగొట్టితివి!— కమలా! కమలా! నీ వెఱుఁగవా నీవు నాకెట్లు సర్వనాశమును జేసితివో?

కమల--నేను నీకు సర్వనాశమును జేసితినా? నీవు నాకు సర్వనాశమును జేసితివా?

జయ—రాణీ! నేను నీరూపమునకై నిన్ను ప్రేమించుచుంటినా?—ఎచ్చట ఆరూపము? ఇప్పు డారూపము గనుపట్టుట లేదు. ఒకనాఁడు నీ మొగమున నొక దివ్యజ్యోతి యెచ్చటనుండి వచ్చి పడుచుండెడిదో తెలియదు. అది పోయినది! ఇప్పుడు నీ మొగమున ఆ రూపపుఛాయమాత్రము గనుపట్టుచున్నది. సౌందర్యమును కొంత యీశ్వరుఁ డిచ్చును. కొంత స్త్రీ తానే సంపాదించుకొనును. స్త్రీల యుజ్వలమగు హృదయప్రతిభ వారి ముఖమున ప్రవేశించి యొక నూతనరాజ్యమును—ఒక సుందర స్వర్గమును—రచించును. బాహ్యరూపము దాని ముం దెందుకును గొఱకాదు. రాణీ! నీవు పొరపడుచుంటివి! నేను కేవలము నీరూపమునకై నిన్ను ప్రేమించుట లేదు-నీకై నిన్ను ప్రేమించుచుంటిని.

కమల—అసత్యము.

జయ—రూపమా? ప్రపంచమున రూపమునకు కఱవు వచ్చినదా రాణీ! జ్యోత్స్నాంధకారముల గారడీయాటలును, సస్యక్షేత్రముల శ్యామల వైభవమును, ఆకాశమందలి యనంతనీలిమాప్రసారమును, నలుమొగములఁ గనుపట్టు సౌందర్య, సౌగంధ్య, సంగీత, సంపన్నతయు, అహోరాత్రము లాకాశహృదయమునుండి వర్షించు సౌందర్యవర్షమును, పృథివీగర్భమునుండి వెడలు పుష్పముల సౌందర్య

ప్రారభ్యప్రస్రవణమును గల యీమహాప్రపంచమున నీయొద్దకు రూపమునకై వచ్చితినా? నీయారూప మెచ్చట నున్నది కమలా? ఎచ్చటనుండి వచ్చెను? ఇపు డెచటకు పోయెను?

కమల—ఇపుడు మీయభిప్రాయ మేమి ?

జయ—అభిప్రాయమా? తెలియదు. మోహపుమత్తు దిగి పోయినది. కాని చాలఆకస్మికముగా-నాకు సమయమిమ్ము. రూపము!- రూపము! హృదయశూన్యయగు పడంతిరూపము—

(ద్వారపాలకుడు ప్రవేశించును.)

ద్వార—(నమస్కరించి) మహారాణాగారూ! మంత్రిగారు మీదర్శనము కోరుచున్నారు.

జయ—మంత్రి!—ఇక్కడనా?—పొమ్ము. ఇక్కడకే తీసు కొనిరమ్ము. (ద్వారపాలకుడు నిష్క్రమించును.)

జయ...(కమలతో) కాని కమలా! ఇన్నిరోజులవఱకు ఏవిధ ముగ నేయుపాయముచే నీవు నీచహృదయమును సుందరాచ్ఛాదనముచే గప్పిపుచ్చితివి? నీ వింత నీచస్వభావము గలదాన వని లేశమాత్రమును నాకు దెలియదు. పొమ్ము, కమలా; లోపలికిఁ బొమ్ము. నీపై నాకు క్రోధము లేదు. నీకును గొప్పయాశ యుండెను. కాని నిరాశపడవలసి వచ్చినది. లోపలికిఁ బొమ్ము.

కమల—(పోవుచు తనలో) ఏమైననునన్నచో నదికూడ పోఁగొట్టుకొంటిని. (నిష్క్రమించును)

జయ...దీనికొరకే నేను సర్వము విడిచి వచ్చితిని! సాక్షాత్తు లక్ష్మివంటి పెద్దరాణి, సరస్వతిని విడిచి వచ్చితిని! సరస్వతీ బహుశః ఇపుడు నేను నిన్ను కొంచెము గుఱితించగలను. నాఁడు నీవు "ఇది ప్రేమగాదు. మోహము....ఒకనాఁడు వదలిపోవును" అని చెప్పిన మాట నిజము. సరస్వతీ! నీ వెప్పుడును సత్యమునే పల్కెదవు. కాని యీమాట అన్నిటికన్న నెక్కువ సత్యము.

(మంత్రి ప్రవేశించును.)

జయ—ఏమి మంత్రీ! రాజ్యవృత్తాంతము లేమి ?

మంత్రి—మహారాణా! నేను ఉద్యోగమును విడువఁగోరుచున్నాను.

జయ—ఏ మేమి! ఏ మయినది మంత్రీ!

మంత్రి—ఏమయినదని చెప్పను. తమ పెద్దకుమారుఁడు నన్ను చాల అవమాన పఱచినాఁడు. నే నీయుద్యోగమును జేయుచు ముసలివాఁడ నయితిని. కాని యెన్నఁడు నా కిట్టి యవమానము కలుగలేదు.

జయ—ఏ యవమానమును జేసినాఁడు?

మంత్రి—అమరసింహుఁ డొకనాఁ డొక మదపుటేనుఁగును విప్పి పట్టణము మీదికి వదలెను. అది చాలమంది పురవాసులను జంపినది. నే నాయనను మందలించగా నాయన నాతల గొరిగించి గాడిదపై నెక్కించి నన్ను ఊరెల్లఁ ద్రిప్పిరి.

జయ—ఇంతవఱకా? ఏమి అమరుఁ డెరుఁగఁడా తన్ను నీ యధీనమున విడిచివచ్చితి నని?

మంత్రి—అతని దుష్పనివలనను మీ యందతనికి శ్రద్ధాభక్తు లున్నటుల దోఁచదు.

జయ—హుమ్మ్. రేపు నేను రాజధానికి తిరిగివచ్చెదను. యథోచితముగ నీ వ్యవహారమును విచారించెదను. పొమ్ము. (మంత్రి నిష్క్రమించును.) కమలా! కమలా! నీ వింత కృత్రిమము చేయఁజాలుదువా?— ఆఁ! ఇప్పుడు తెలిసికొనుచున్నాను. ఇప్పు డంతయు తెలియుచున్నది?—

(నిష్క్రమించును)

---

తృతీయ దృశ్యము.

స్థానము—జోధపురము. దుర్గశిఖరము.

సమయము—వెన్నెలరాత్రి

(అజితసింహుఁడు, రజియా ఒక వేదికపైఁ గూర్చుండియుందురు)

రజియా—ఆహా! ఎంతచక్కనిచందురుఁ డుదయించుచున్నాఁడు. చూడుము అజితా! అదుగో చూచుచుంటివా? తూర్పున

ఒక నల్లని మబ్బుమీదుగా నుదయించుచున్నాఁడు. మబ్బు పైభాగ మున నలువైపుల నొక బంగారుగీత గీచినట్టు లున్నది. మబ్బు క్రింది భాగ మంతయు కారునలుపుగా నున్నది. చంద్రునిలో చతుర్థాంశము మేఘముమీదుగాఁ గనుపట్టుచున్నది. ఏమి యాయందము! ఏమి యాచల్లదనము! ఏమి యీప్రకాశము! చందురుఁ డెంత యందముగఁ గనుపట్టుచున్నాఁడు అజితా!

అజిత——లేదు. నేను కేవలము నిన్నే చూచుచున్నాను.

రజియా——అగుచో నీవు చాల పొరబడుచున్నావు. ఈ పృథివిపై నలుదిక్కుల నిన్ని దర్శనీయములగు వస్తువు లున్నవి. వానిని విడిచి నన్ను చూచుచుంటివా? ఈపృథివి యెంత యందమైనది? నా కీ పృథివి యొక అశ్రాంతము, అనంతము, అపారితమునగు గీతము వలె కనఁబడుచున్నది. ఈ గగన నీలిమము దాని యారోహణము. ఈ సస్యశ్యామలత దాని యవరోహణము. ఈప్రకాశము దాని ద్రుతము. చీఁకటి దాని సమము. పర్వతములు దాని యాలాపము. ఈ తరంగములు దాని మూర్ఛనలు. ఎంతసుందరమగు పృథివి అజితా!

అజిత——నాకు నీమొగమే యన్నిటికన్న నందముగఁ గనుపట్టుచున్నది.

రజియా——నీవు నామొగమునే యన్నిటికన్న నందముగఁ జూచుచుంటివా? అఱవిరిసిన గులాబిమొగ్గ సిగ్గుచూడ్కికన్న నిది యెక్కువ యందమైనదా? ఒడ్డుతో నెదుర్కొను అలల యాటకన్న నిది యందమైనదా? ఈనల్లనిమబ్బులో డాగియున్న చందురునికన్న నిది యందమైనదా? అజిత! నీ వింక బాలుఁడవు.

అజిత-నేను బాలుఁడను గాను, గనుకనే నీమొగము నన్నిటికన్న నందముగాఁ జూచుచుంటిని. రజియా! నా కీసమయమున నిటులఁ గనుపట్టుచున్నది. ప్రపంచములో శ్రేష్ఠసౌందర్యసారము స్త్రీజాతి. మఱియు నీవు స్త్రీలలో రత్నమవు.

రజియా——నేనా! నా కీమాటపై నమ్మకము లేదు.

అజిత—రజియా! నీవు నన్ను ప్రేమించుట లేదు గనుక నే నీకు నమ్మకము లేదు.

రజియా—ప్రేమించుట లేదా? ప్రేమించుటయన నేమిరో యెఱుఁగుదువా అజితా? కాని దేనిని ప్రేమింతుమో దానిని చూచుటకు నిరంతరము హృదయ మభిలషించుచో... దానిని చూచి, దాని శబ్దమును విని హృదయమున ఉద్వేగము గల్గుచో- నేను నిన్ను ప్రేమించుచుంటిని. ఎక్కువగ ప్రేమించుచుంటిని!

అజిత—నన్ను ప్రేమించుచుంటివా రజియా?—నిజమే?

రజియా—అసత్య మాడుట నేను నేర్చుకొనసే లేదు.

అజిత—ప్రియా! (చేయి పట్టుకొనును)

రజియా—ప్రియతమా! (పాడును)

గీ. ప్రాణసఖ! రమ్ము నిన్ బాహుపాశమందు
కట్టివైచెద నెడఁద నిన్ గప్పియుంతు
హృదయమున నీదు శిర ముంచి ముద మెలర్పఁ
గనులు మూసుక సుఖనిద్ర గాంతు కాంత!
డెందములు రెండు నమధికానంద మొదవ
నధిగమించును నేడు ప్రేమానుభవము
అలసుసంగత హృదయద్వయంపు మధుర
గీతమును విందు కన్ను లొక్కింత మోడ్చి
వసుధ వ్రచ్చిన, పిడుగులు వడిన, సూర్య
చంద్రతారకల్ వ్రాలిన, జగము లెల్ల
అస్తమించిన, నిక నభిన్నాత్మ్మలమయి
ఎపుడు నివసించెదము జీవితేశ! మనము.

(పాడుచు పాడుచు రజియా అజితుని కౌఁగిలించుకొనును. ఆసమయమున ముకుందదాసు ప్రవేశించును.)

ముకుంద—మహారాజా!—(రజియా అజితుని కౌఁగిలించు కొనుట చూచి వెనుకకు తిరుగును.)

అజిత—ఏమి ముకుందదాస్! విశేషకార్య మేమేనియున్నదా?

ముకుంద—ఆఁ మహారాజా! దుర్గాదాసు! దక్షిణమునుండి వచ్చిరి.

అజిత—ఎవరు? దుర్గాదాసు వచ్చెనా? ఎక్కడ?

ముకుంద—బయట.

అజిత—వద కాదు. ఆయన నిచ్చటకే తీసికొనిరమ్ము.

ముకుంద—చిత్తము. (నిష్క్రమించును.)

అజిత... పొమ్ము, రజియా! నీగదిలోనికిఁ బొమ్ము. (రజియా పోవును.)

అజిత—దుర్గాదాసు తిరిగివచ్చెనా? నాకు రక్షకుఁడు, దేశమున కాధారమునగు దుర్గాదాసు తిరిగివచ్చినచో—నేనెంతయు సంతసింప వలసినది. కాని నా మనమున ఏలకో చింతగానున్నది. ఈ చింత నా చిరసంచితమగు స్నేహమును, భక్తిని, కృతజ్ఞతను మథించి కలుషితముచేయుచున్నది! కాదు. ఇది చాల అనుచితము. ఈ భావమును హృదయమునుండి తొలంగించవలయును.

(ముకుందదాస, శివసింహులతో దుర్గాదాసు ప్రవేశించును.)

దుర్గా—మహారాజా! సేవకుఁడు సేవకై యరుదెంచినాఁడు. కుమారుని (గద్గదస్వరముతో) మహారాజని చెప్పి నమస్కరించవలయునని చాలదినములనుండియున్న నా కోరిక నేఁడు తీరినది. మహారాజా! నమస్కారము. (పదచుంబనము చేయును)

అజిత—భక్తబంధూ! మత్ప్రియతమ సేనాపతీ! సేమమా?

దుర్గా—ఆఁ ఇప్పటివఱకు సేమమే—మహారాజా! తాము స్వయముగనే సామంతులకు దర్శన మొసఁగితిరా?

అజిత—అవును నేను స్వయముగనే సామంతులఁ గలిసికొంటిని.

ముకుంద—(దుర్గాదాసుతో) స్వామీ! నేను చాలదినముల వఱకు దీని కొప్పుకొనలేదు, స్వామియానతిలేక మహారాజుల దర్శనము కాఁజాలదని నేను చెప్పితిని! కాని సామంతు లేవిధమునను ఒప్పుకొనలేదు. వారు మహారాజుల దర్శనము చేయక తప్పదనిరి.

దుర్గా—బాగుగనే యున్నది—సామంతు లందఱు మహారాజులకు యథోచిత సమ్మానముచేసిరా! మంచిది.

ముకుంద—సమ్మానమా! మహోత్సాహముతో చేసిరి. చైత్రి సంక్రాంతి దినమున మహారాజు సామంతులకు దర్శనమిచ్చిరి. అచ్చట దుర్జనపాలుఁడు, ఉదయసింహుఁడు, తేజసింహుఁడు, విజయపాలుఁడు, జగత్సింహుఁడు, కేసరిసింహుఁడు మఱియు నెందఱో సామంతు లుండిరి. అందఱు మహారాజులకు జయజయకారములు చేయసాగిరి. పవిత్రి యింట ప్రతివీధిని, ఉత్సవాందోళనము జరిగెను—స్వామీ! నాటి యాదృశ్యము చాల అపూర్వమైనది.

దుర్గా—మంచిది! ఇక్కడ యుద్ధసమాచారమేమి శివసింహా?

శివ—ఔరంగజేబు మహమ్మదాషాను యశోవంతసింహుని పుత్రుఁడని చెప్పి జోధపురరాజునుగాఁ జేసెను. పిమ్మట అతఁడు చని పోయెను. వీరుడగు హరనాథుఁడు శుజాయత్ఖానును కచ్ వరకు తఱిమెను. మహారాజు స్వయముగ అజ్మీరు పోయి సైఫీఖాను నోడించిరి.

ముకుంద—అంతయు బాగుగనే యున్నది. సేనాపతీ! కాని శోచనీయమగు వీరసమరసింహుని మృత్యువుచే విజయమంతయు నిరుత్సాహముగ నున్నది.

అజిత—సేనాపతీ! జయసింహుని పుత్రుఁడు అమరసింహుఁడు తన తండ్రితో యుద్ధము తలపెట్టినాఁడు. జయసింహుఁడు మహారాణాను సహాయమడిగెను. సేనాపతీ! నీవు స్వసైన్యముతో జయసింహునకు సహాయము చేయ బొమ్ము.

దుర్గా—చిత్తము మహారాజా! రేపుదయమే పోదును. కాని మెక్కడ?

శివ—అతఁడు జబ్బుగ నున్నాఁడు. లేనిచో నతఁ డందఱికన్న ముందు స్వామిపాదములకు నమస్కరించువాఁడు.

దుర్గా—జబ్బుగనా? ఏమిజబ్బు? ఎచ్చట నున్నాఁడు?

శివ—లోనిగదిలో నిద్రించుచున్నాడు. ఎక్కువ యేమియు లేదు. సామాన్యమగు జ్వరము.

దుర్గా—నడువుఁడు. అతనిఁ జూచి వచ్చెదము.

(అందఱు నిష్క్రమించెదరు.)

---

## చతుర్థదృశ్యము.

స్థానము—దక్షిణదేశమున మొగలుల శిబిరము

సమయము—ప్రభాతము

(ఔరంగజేబును దిలేర్ఖానును నిలఁబడి మాటలాడుచుందురు.)

ఔరం—దిలేర్ఖాన్! అగుఁచో అక్బరు పారసీకమునకు వెళ్లెనా?

దిలే—అవును సమ్రాట్! ఒక బ్రిటిషుఓడపై నెక్కి యాదిక్కునకే పోయెను. అక్కడనుండి మక్కాకు వెళ్లెనఁట.

ఔరం—(నిట్టూర్పు విడచి) వాని శిక్షణమునకై చేసిన వ్యయము, యత్నము, శ్రమము, అంతయు నిష్ఫలమయ్యెను.

దిలే...కాదు సమ్రాట్! శిక్షణఫలితము చాల బాగుగనే కనుపట్టుచున్నది. లేఁచో నాయనకు పశ్చాత్తాపము కలుగునదికాదు.

ఔరం—దిలేర్ఖాన్! నేనును మక్కాకుఁ బోయెదను. నేను నా జీవిత కార్యములన్నియు నెఱవేర్చితిని. ఒక పనిమాత్రము మిగిలియున్నది. అది రజియాను శత్రుమండలమునుండి తీసికొని వచ్చుట. నీవు దుర్గాదాసును విడువనిచో ఈ పనియు నేను మక్కాకు పోవకముందే చేసియుండువాఁడను.

దిలే—దుర్గాదాసును జడిపించియా? కాదు రాజేంద్రా! ఇది కాఁజాలదు. భయమన నేమియో యావీరుఁ డెఱుఁగనే యెఱుఁగఁడు. ఆనాటిరాత్రి కామబఖ్ను దుర్గాదాసుని తలపైకి కత్తి యెత్తినపుడు ఆయన రొమ్మువిఱుచుకొని నిర్భయముగా నిలఁబడియుండెను. నే నా దృశ్యము నెన్నటికిని మఱవఁజాలను. ఆకస్మికముగా నాతని శిరము పర్వతశిఖరమువలె నిఠారుగా నుండెను. వాని వక్షఃస్థల మాకాశమువలె విశాలమయ్యెను. నే నా మహావీరుని ఇంత యున్నతునిగను, ఇంత విశాలవక్షునిగను ఎన్నఁడును జూడలేదు సమ్రాట్!

ఔరం—అవును దిలేర్‌ఖాన్ ! దుర్గాదాసు నిశ్చయముగ నొక్క మహాపురుషుఁడు కాని—

దిలే—సమ్రాట్ ! నేను కనిపెట్టితిని. రాజపుత్రులు కర్తవ్యమునకు మరణించుటకై వెరవకుండుటయే కాదు. అటుల మరణించుటకు వారు గర్వించెదరు. మఱియు నా రాజపుత్రులనెల్ల మించినవాఁడు దుర్గాదాసు.

ఔరం—నే నిది యొప్పుకొందును దిలేర్ ! కాని రజియా శత్రుమధ్యమునుండి మనకు చిక్కునాశ లేదా ?

దిలే—కాదు సమ్రాట్ ! ఈ పని నేను చేయఁగలను. కాని ఈ వ్యవహారమున నాకు పూర్ణమైన యధికార మీయవలయును.

ఔరం—ఎట్లు చేసెదవు ?

దిలే—సమ్రాట్ ! రాజపుత్రజాతిచే, విశేషించి దుర్గాదాసుచే, నెటుల పని చక్కపఱచుకొనవలయునో నే నెఱుఁగుదును. వారిని గారవించుఁడు. వారిపై విశ్వాసముంచుఁడు. ఇంక వారు పువ్వుకన్న మెత్తగనుందురు. వారిని భయపెట్టుఁడు... బెదరించుఁడు—ఇంక వారు ఇనుముకన్న గట్టిగా నుందురు.

ఔరంగ—మంచిది నీ కీవిషయములో పూర్ణాధికార మిచ్చుచున్నాను. నా మెదడు సరిగా లేదు. నా బుద్ధిదోషమున నేను మాజమును శత్రువు చేసికొంటిని. ఆజిమును లోభిని జేసితిని. అక్బరును ద్రోహిని చేసితిని. కామబఖ్షును పిశాచమునుగాఁ జేసితిని. ఏనను నాబుద్ధిదోష మెచటనో నాకు తెలియుట లేదు.

దిలే—తప్పెచ్చట నున్నదో డెలిసినచో మరల తప్పెందుకు చేయఁబడును ?

(కాబలేష్ఖాను ప్రవేశించును.)

ఔరంగ—ఏమి కాబలేష్ఖాన్ ?

కాబలే—హుజూర్ ! శంభాజీని గాడిదపై నెక్కించి యూరెల్ల త్రిప్పితిమి. కాఫిరు దారిలో "నన్నెవరేని చంపుడో" యని గోల

కెత్తినాఁడు. కాని యెవరును సాహసింపలేకపోయిరి. వాని నిటకు తీసికొని వత్తునా సర్కార్?

ఔరంగ—తీసికొని రమ్ము.

కాబలే...నాఈనాము హుజూర్!

ఔరంగ—ఇచ్చెదను కాబలేన్! ఇచ్చెదను. గొప్ప ఈనామిచ్చెదను. (సలాముచేసి కాబలేఖ్ఖాను పోవును.)

ఔరంగ...దిలేర్ఖాఁ! ఇంక నాకు జీవితముపై నిచ్ఛ లేదు. నా యుత్సాహాము పోవుచున్నది, నానడుము విఱిగినట్లు లున్నది. (కొంచెము సేపూరకుండి) నే నెప్పుడు ననుకొనలేదు—నా బేగము భారతరాజేశ్వరి—ఆమెకు నే నేమి యొసఁగలేదు!—ఆమెస్థితి యిది! దిలేర్! నే నెప్పుడు—స్వప్నములోకూడ—ఇది యనుకొనలేదు.

దిలే...సమాశ్రిట్! మనుష్యుఁ డెప్పుడు నాలోచించనిదే యన్నిటికన్న ముందువచ్చుటను నే నెప్పుడు చూచుచుందును.

(బోనులో బద్ధుఁడగు శంభాజీని దీసికొని ఆజీము; కాబలేఖ్ఖాను, సిపాయిలు ప్రవేశించెదరు.)

ఔరంగ...ఈయనయే మహారాష్ట్రవీరుఁడు! ఏమి మహారాజా! కురానును దూషించెదవా! మసీదులఁ బాడుచేసెదవా?—ముల్లాలను అవమానించెదవా?—ఏమి జవా బీయవు?

కాబలే— సర్కార్! జవా బెట్టు లిచ్చును. కురాను దూషించువాఁడని యితని నాలుక గోసితిమి.

ఔరంగ—మహారాష్ట్రవీరా! ఇప్పుడైన చెప్పుము. కురాను చదివెదవా? ఇప్పుడేని యిందు కొప్పుకొనివచో నీకు ప్రాణభిక్ష పెట్టెదను.

(శంభాజీ ఔరంగజేబు నుద్దేశమునకు బోనులో నొక తన్ను తన్నును.)

కాబలే—హుజూర్! ఈసారి తన్నుకు బోను విరిగిపోవును. త్వరగా నితని వధించుట కాజ్ఞ యీయుఁడు. లేనిచో—

ఔరంగ--పొమ్ము! ఇప్పుడే యితని తల నఱికి నావద్దకుఁ గొని రమ్ము

(శంభాజీని తీసికొని ఆజము పరిభృతులు పోదురు)

ఔరంగ...దిలేర్ఖాన్! ఏమి, యూరకుంటివి?

దిలే—దీనిపై నే నేమియు చెప్పునదిలేదు. ఏరుఁడు వీరునకు చేయుదగిన వ్యవహార మిదియే.

ఔరంగ--శంభాజీ కల్మాచదువుట కంగీకరించినచో నే నతనిని క్షమించెదను.

దిలే...ఒకవేళ శంభాజీ మృత్యుభయముచే నిపుడు కల్మా చదువుట కంగీకరించినను నేను మెచ్చుకొనను--హుజూర్! ఎవరేని తమ యిచ్ఛకును, విశ్వాసమునకును విరుద్ధముగ నిస్లాము మతము స్వీకరింపవలెనని మీరు కోరుచున్నారా?

ఔరంగ...దిలేర్ఖా! నే నీధర్మమును వ్యాపింపఁజేయుటకే యీ సింహాసనమునఁ గూర్చుంటిని. దీని కొఱకే తండ్రిని కైదుచేసితిని. భ్రాతృహత్య కొడిగట్టితిని. దైవ మెఱుఁగును.

దిలే--ఇది నే నెఱుఁగుదును సమ్రాట్! మీరు నిష్కల్మషులు ధార్మికులు అని యెఱిఁగియే నేటిదనుక మీయొద్ద నుంటిని. లేనిచో నిదివఱకే మిమ్ము విడిచియుండువాఁడను---కాని సమ్రాట్! బాహుబలముచే ధర్మప్రచార మగునా? వాడి కరవాలములచే ధర్మముపై విశ్వాసము గలుగునా? మొట్టికాయలచే రాజభక్తి కలిగించఁగలమా, రాజేంద్రా? నేను మరల చెప్పుచున్నాను. మీ రీతోవనుండి మరలుఁడు. ఇప్పుడేని హిందూద్వేషమును పరిత్యజింపుఁడు. హిందూముసల్మాను లేకమగుదురు. దేవళము లందును మసీదులందును స్వాతంత్ర్యభావముతో పరమేశ్వరుని అల్లా ననుసరించెదరు. ఒక్కమాఱుగ నాకాశమున నగారా మోతలును శంఖధ్వానములు బిక్కటిల్లును. హిందూ ముసల్మాను లొక్కమాఱుగా జాతిద్వేషమును మఱచి, ఒండొరుల సోదరులగా భావించి కౌగిలించుకొందురు. ఆనాఁడే ఆసేతు హిమాచలపర్యంతము

ప్రపంచమున నెవడును కని విని యెఱుఁగని యొక యఖండ సామ్రాజ్యము స్థిరపడును.

ఔరంగ—హిందూ ముసల్మాను లేకమగుదురా దిలేర్?

దిలే—ఎందుకు కారు హుజూర్! వారు, వీరు ఇన్నిరోజుల నుండి యొక యాకాశముక్రిందనే యుండిరి. ఒకగాలినే పీల్చుచుండిరి. ఒక జలమునే త్రాగుచుండిరి. ఒకభూమిపై పండినపంటనే తినుచుండిరి. ఇప్పటికేని యిద్దఱిప్రాణము, ఇద్దఱియాత్మ ఒకటికాదా? హిందూ ముసల్మాను లొకమాఱుగ మతభేదము, జాతిభేదము, ఆచారభేదము మఱచి, మోకరించి, చేతులు జోడించి, భక్తి బాష్ప గద్గదస్వరముతో సస్యశ్యామలయగు నీ భారతవసుంధరను "అమ్మా" యని పిలిచెదరుగాక యని కోరుచున్నాను.

ఔరంగ—దిలేర్ఖా! నీవు స్వప్నము గాంచుచుంటివి.

దిలే—క్షమింపుఁడు సమ్రాట్!—నేను స్వప్నమే కాంచుచుండ వచ్చును. కాని యది చాల సుఖస్వప్నము.

ఔరంగ—(తనలో) ఇదియే యగుచో, ఇదియే కాఁగల్గినచో కాదు చాలకాల మయిపోయినది. ఈ వయస్సులో నే నొక నూతనోద్దేశముతో గార్యక్షేత్రమునఁ దిగజాలను. (ప్రకటము)దిలేర్ఖా! నే నేమి చేయుచుంటినో నాకే తెలియుటలేదు. నేను యంత్రము వలె పనిచేయుచుంటిని. ఆలోచింపలేను. నాకన్నులయెదుటఁ జీకటి క్రమ్మినట్టు లున్నది. తల తిరిగిపోవుచున్నట, దిలేర్! ఇప్పుడు నే నా యౌరంగజేబునుగాను, కేవల పతని యస్థిపంజరమను.

దిలే—సమ్రాట్! ఇంకను కొంచెము సమయ మున్నది. ఇంకను ఆ యస్థిపంజముపై మాంసము వ్రేలాడుచున్నది, రాలి పడ లేదు. కాని యట్లగుటలో ఎక్కువకాలము పట్టదు.

(ఈ సమయమున కాబలేస్థాను వెండిపళ్ళెములో శంభాజీ శిరమును దెచ్చి పాదుషా కాళ్లవద్ద నుంచును. వెంటనే నెత్తురుచే తడిసి ఆజిమును, సిఫాయిలు ప్రవేశించెదరు.)

ఔరం—శంభాజీశిరమా!—పొండు, తీసికొనిపొండు.

దిలే—దారారక్తముతో ప్రారంభమయిన ప్రభుత్వము ఈ వీరుని రక్తముతో నంతమొందినది. (నిష్క్రమించును)

కాబలే—సర్కార్! నా యీనాము?

ఔరం—నీ యీనామా? అరే యెవరు? (పహారావాండ్రతో) ఇతనిని బంధించుడు.

కాబలే—ఆఁ—నన్ను— (పహారావాండ్రు కాబలేఖానును బంధించెదరు)

ఔరం...ఆజిమ్! వీనిని బయిటికిఁ గొంపొమ్ము---వీనితల నఱికి తెమ్ము. కాబలేఖాన్! మాకు అనేకసమయములందు నీవంటి విశ్వాసఘాతుకుల సాహాయ్యము తీసికొనకతప్పదు. కాని హృదయమున నీవంటివారిపై నా కసహ్యము, నీ ప్రభువు, శంభాజీయున్నచోటికి పొమ్ము.

కాబలే—చిత్తము ప్రభూ!

ఔరం—పొండు, తీసికొనిపొండు. (నిష్క్రమించును)

ఆజిము—నడువుము కుక్కా!

కాబలే—మీపాదాలాన హుజూర్! నన్ను చంపకుఁడు. నేను మీకు గులాముగా నుందును.

ఆజిము—నడువుము విశ్వాసఘాతుకా! (తన్నును)

కాబలే—కొట్టుడు. కొట్టుడు. చెప్పుతో కొట్టుడు—తన్నుడు— ఇంకను గొట్టి వెడలఁగొట్టుడు—చంపనుమాత్రము చంపకుఁడు. ఒట్టు.

---

## పంచమ దృశ్యము.

స్థానము—యోధపురములోని మేడ.

సమయము—రాత్రి.

(అజితసింహుఁడు, శ్యామసింహుడు ప్రవేశించెదరు.)

శ్యామ...మహారాజు రాణాగారి తమ్మునికొమార్తెను వివాహ మాడిరా?

అజిత—అవును మహారాజా! దుర్గాదాసు కొలఁది దినముల క్రింద ఉదయపురము వెళ్ళినాఁడు. ఆయనయే అచటినుండి యీమాట నావు దెచ్చినాఁడు. నేను దాని నంగీకరించితిని.

శ్యామ—మహారాజా! ఇది చాల గొప్పసంగతి. నేఁడు మరల మార్వాడయు మేవాడయు వియ్య మందినవి. గజసింహుని కూఁతురుకూడ చాల చక్కనిదఁట.

అజిత—కాని కొయ్యబొమ్మ. దానివయస్సు చాలతక్కువ.

శ్యామ—ఈకొయ్యబొమ్మకే యొకనాఁడు రక్తమాంసములు పట్టును. దాని కేమియు చెప్పనక్కరలేదు మహారాజా!

అజిత—ఔను—ఆమె మాటాడుటయు నెఱుఁగదు.

శ్యామ—నేర్చుకొనును, మహారాజా! సమయమువచ్చినపుడు నేర్చుకొనును. పడఁతులు చిలుకలవంటివారు, సీతారామయని చెప్పి వచో నదియు నేర్చుకొందురు. మహారాజా! రాణా జయసింహుఁడు తన రెండవ భార్యను విడిచెనని వింటిని. ఇది నిజమేనా?

అజిత—అవును మహారాజా! ఆయన చిన్నరాణికి నెలబత్తె మిచ్చుచున్నాడు.

(దుర్గాదాసు ప్రవేశించును.)

శ్యామ—ఏమి దుర్గాదాస్! బాదుషా మనుమరా లెచ్చట నున్నది!

దుర్గా—నే నామెను సుజాయత్ఖానున కప్పగించితిని. మీ కప్పగించుట కన్న అతనికే యప్పగించుట నాకు బాగని తోఁచెను.

శ్యామ—ఏమి నాపై నీకు విశ్వాసము లేదా?

దుర్గా—మహారాజా! వాస్తవమదియే. నేను మిమ్ము పూర్తిగా విశ్వసింపఁజాలను, కాని క్రియ యొకటియే. బాదుషావద్ద కామెను మీరు తీసికొని పోలేదు. సుజాయత్ఖాను తీసికొని వెళ్ళెను.

శ్యామ—ఆఁ—ఆఁ—మంచిపని చేసితివి. బాదుషా మనుమరాలిని నేను తీసికొనిపోయినను ఒకటే, అతఁడు తీసికొనిపోయినను ఒకటే,

అజిత—బాదుషా మనుమరాలా? ఏమనుమరాలు దుర్గా దాస్!

దుర్గా—అక్బరుని కూతురు రజియా. దానికి మారుగా బాదుషాతో యుద్ధము చేయకయే నేను మార్వాడకు మూడునగరములను సంపాదించితిని.

అజిత—ఏమి దుర్గాదాస్! నీవునా...నీవు నా రజియాను మరల మొగలుల చేతి కిచ్చితివా?

దుర్గా—ఆఁ మహారాజా! నే నామెను తిరుగ నిచ్చివేసితిని.

అజిత...(కొంచెమునే పూరకుండి) ఆమెను తిరిగియిచ్చుటకు నీ కేమియధికారము సేనాపతీ! రాజును నేను! నాయాజ్ఞ లేకయే—

శ్యామ—నేనును సేనాపతి కిదియే చెప్పితిని మహారాజా! ప్రభుల యనుమతి లేకుండ—

అజిత-బికనేరురాజా! మీరు నీ తంత్రాంగములో నుండిరా?

దుర్గా—మహారాజా! అనుమతి యడిగినను లాభ ముండదని నేను మిమ్మడుగ లేదు---మఱియు నక్బరును, ఆయన పరివారమును నన్నాశ్రయించిరిగాని మహారాజుల నాశ్రయించ లేదు.

అజిత—నీ కింత సాహసమా దుర్గాదాస్!--నీ వనుకొంటివి--(క్రోధముచే కంఠావరోధము గల్గును.)

దుర్గా—వినుఁడు మహారాజా! స్పష్టముగాఁ జెప్పుచున్నాను. మీరు బాదుషాపౌత్రిని ప్రేమించితిరని తెలిసినది. నేను దక్షిణము నుండి వచ్చిననాటి దినమున ముకుందదాసు నా కీసంగతి చెప్పినాఁడు. దానిపిమ్మట నే నిది యథార్థమని కనిపెట్టితిని. ఈప్రేమ యుభయులకును మంచిదికాదు. ఏలయన బాదుషా పౌత్రితో మీకు వివాహము కాఁజాలదు. కనుకనే మీవివాహమును నే నుదయపురములో తలపెట్టితిని. అచ్చటనే యీ బికనేరుమహారాజును బాదుషాపౌత్రి నీయుఁడని యడిగిరి. నే నందుల కంగీకరించితిని.

అజిత—అంగీకరించితివా! లంచముకూడ బాగుగ పుచ్చుకొనినట్లు తోఁచుచున్నది, సేనాపతీ!—

దుర్గా—లంచమా మహారాజా! లంచమే తీసికొనినచో—కాదు క్షమింపుఁడు మహారాజా! నే ననుచితము పలుకఁబోతిని.

అజిత—క్షమించనా!—దుర్గాదాస్! ఈలంచము పుచ్చుకొనిన యపరాధమున నిన్ను శాశ్వతముగ మార్వాడనుండి వెడలఁగొట్టు చున్నాను.

దుర్గా-చిత్తము మహారాజా! నమస్కారము (నిష్క్రమించును.)

అజిత—కుట్ర—కుట్ర—పెద్దకుట్ర పన్నినాఁడు!

శ్యామ— మహారాజా! నే నీ కుట్రలో లే నని మొదటనే విన్నవించుకొంటిని.

అజిత—దూరముగఁ బొమ్ము. (కాలితోఁ దన్ని శ్యామసింహుని వెళ్లఁగొట్టును. (రజియా! నీవు పోతివా! శాశ్వతముగా నాచేతి నుండి పోతివా? నీకై నేను దుర్గాదాసునుగూడ పోఁగొట్టుకొంటిని. (విచారముచే నిటునటు తిరుగుచుండును.)

(తొందరగా కాసిము ప్రవేశించును.)

కాసిము...రాజా! మహారాజు దుర్గాదాసెక్కడ?

అజిత—ఆయన ఈరాజ్యమును విడిచిపోయెను.

కాసిము—వారు స్వయముగఁ బోయిరా లేక మీరు వెడలఁ గొట్టితిరా? శ్యామసింహునివలన నేను వినినది నిజమేనా?

అజిత...అవును, నేనే ఆయనను దేశమునుండి వెడలఁ గొట్టితిని.

కాసిము—ఈ సంగతి తెలిసినదికాని యెందుకు?

అజిత—లంచము పుచ్చుకొనినందుకు.

కాసిము—(క్రోధముచే కంపించు స్వరముతో) లంచము! మహారాజు దుర్గాదాసు లంచము పుచ్చుకొనెనా!-బళిరా! ఎంతమాట! యనుచుంటివి! దుర్గాదాసు లంచము పుచ్చుకొనెనా?...దుర్గాదాసు లంచమే పుచ్చుకొనినచో నీవంటి యొకమహారాజు అగువాఁడు. ఆయన కోరినచో నిన్ను కాళ్లతో నెట్టి యోధపురసింహాసనమున రాజయి కూర్చుండువాఁడు కాదా? దుర్గాదాసు లంచము పుచ్చు

కొనునా? ఔరా! కృతఘ్నా! తనజీవితమునంత నీసంరక్షణకై హోమము చేసినవాఁడు—నీకు ప్రాణభిక్ష పెట్టినవాఁడు—ఇరువదైదు సంవత్సరములు దేశమునకై పోరాడిన వాడు—అట్టివానిని ముసలితనములో నీవు వెడలఁ గొట్టితివా! ఇప్పు డాయన పరులయింటికడ బిచ్చ మడుగుకొని— చాకిరి చేసికొని—తినునా! ఇదియే నీధర్మము? రాజా?

అజిత—కుక్కా—

కాసిము—ఖబర్దార్! ఇప్పుడు నన్ను కుక్కయని పిలువకుము. నీవంటి విశ్వాసఘాతుకునకు నేను కుక్కను కాఁగోరుట లేదు!- ఇప్పుడు నేను నీవు పెట్టెడు అన్నమును దినఁగోరుట లేదు. నేనును పోదును. కూలి నాలి చేసికొని తిందును. బిచ్చమెత్తుకొని మామహారాజు దుర్గాదాసునకు పెట్టెదను, ఆయన మహత్వమును నీ వేమి యెఱుగుదువు? కృతఘ్నా! (నిష్క్రమించును.)

(అజితసింహుఁడు మెదలక రెండవవైపునుండి పోవును.)

---

## షష్ఠదృశ్యము.

స్థానము—ఔరంగాబాదు. రాజప్రాసాదము.

సమయము—అపరాహ్ణము.

(గులనారు నిలిచియుండును. ఎదుటఁ బాదుషా నౌకరుండును.)

గుల—ఏమి బాదుషా తీరిక లేదని చెప్పెనా?

నౌక-అవును బేగమ్‌సాహబా! బాదుషా మక్కాకు పయనము కాఁబోవుచున్నారు. ఇక్కడకు వచ్చుటకు వారికి తీరిక లేదు.

గుల—మంచిది పొమ్ము. (నౌఖరు పోవును) ఇంతదనుక వచ్చినదా! నేను బాదుషాతో నాకుమారుని బీజాపూరు పంపవలదంటిని. అతఁడు వెళ్లక తప్పదని జవాబు! బాదుషాను రమ్మని కబురు చేసితిని. తీరిక లేదని యుత్తరము! ఊఁ! మనుష్యులకు పతనదశ వచ్చునప్పుడిట్టులే యుండును. కాలము మాఱినది. కాని నేఁడు నే నీమాటను నోరుమూసికొని వింటిని! ఆశ్చర్యము! నే నా వెనుకటి గులనారు నేనా? నమ్మకము కలుగుట లేదు. చూచెదను. (అద్దము వద్దకు పోయి) ఇది

యేమి! నిజముగ నే నిప్పు డాగులనారునుగాను. కన్నులు దించుకొని పోయినవి. దవుడలొత్తుకొని పోయినవి. వెండ్రుకలు నరసినవి. నే నిప్పు డాగులనారును గాను!—నే నెవర్తుకను? (అఱచి) నే నెవర్తుకను?

(రజియా ప్రవేశించును.)

రజియా—బేగమ్ సాహబా!

గుల—ఎవరు? రజియా! ఏమని పిలిచితివి? బేగమ్‌సాహబ్? నేను బాదుషా బేగమునేనా? నే నా గులనారునేనా?

రజియా—అమ్మీజాన్!

గుల—రజియా! నన్ను బాగుగ చూచి చెప్పుము—నే నా గులనారునేనా కాదా?

రజియా—అమ్మీజాన్! నీ వా గులనారువో కాదో నాకు తెలియదు.

గుల—నీవు నిజమే చెప్పుచుంటివా రజియా? నన్ను గుఱుతించుచుంటివా? నిజము చెప్పుము. నన్ను గుఱుతించుచుంటివా? ఇకప్పుడు నీవు నన్ను భారతసామ్రాజ్ఞియగు గులనారుగా చూచియుంటివి. భారత సార్వభౌముఁడు నా యొక్క కృపాకటాక్షమునకై తహతహపడుచుండెడివాఁడు. వందలకొలది రాజ్యములు రోషకుంచితమగు నా భ్రూభంగమును భయముచే దూరమునుండి చూచుచుండెడివి. లక్షలకొలఁది సిపాయిలు కృపాణహస్తులై నా తర్జనీ సంకేతమాత్రమున చచ్చుటకును, జంపుటకును సిద్ధముగ నుండువారలు. నేఁడు నే నెట్టిస్థితిలో నుంటిని! బాదుషా తటస్థభావముతో చూచుచున్నాఁడు. రాజన్య సమూహము పిలిచినఁ బలుకుట లేదు. ప్రపంచమంతయు పరిత్యజించినది. ఏమి నే నా గులనారు నేనా? బాగుగ చూచి చెప్పుము.

రజియా—అమ్మీజాన్! నీవు నా కాఅమ్మీజాన్‌వే. ప్రపంచము నిన్ను విడిచినను నేను నిన్ను విడువఁజాలను.

గుల—ఏమి రజియా! నేను నీ కేమి చేసితిని!

## పంచమాంకము

రజియా—నీవు నా కేమియు చేయలేదు. నిజము. అయినను నేను నిన్ను విడువఁజాలను. ఏలయన మన ముభయులము సమాన దుఃఖితులము. నే నొకమనుష్యుని ప్రేమలో చిక్కియుంటిని.

గుల—నీ వెవరిని ప్రేమించితివి? ఎవరిని రజియా? కాని నావలెనే ప్రేమించితివా? నావలె ప్రేమతుషాగ్నిలో దగ్ధమైతివా? ఒక సామ్రాజ్యము నతనికై పోగొట్టుకొంటివా? అప్పటికి నతనిచే నిరాకరింపఁబడితివా?—లేదు రజియా! నీ వాజ్వాలను ఊహింపనేని చాలవు!—నాటినుండి నాసర్వస్వము పోయినది. నేఁడు నీవు చూచు నది యీ గులనారు కాదు. ఆమె యస్థిపంజరము. ఇప్పుడు నే నా గుల నారును కాను.

(దాసి ప్రవేశించును.)

దాసి—శాహజాదా! రండు.

రజియా... ఆగుము. ఇప్పుడే వచ్చెదను.

దాసి—కాదు. శాహజాదా! బాదుషాహుకుము లేదు.

గుల... ఏమి హుకుము లేదు దాసీ?

దాసి—శాహజాదా యిచ్చటకు వచ్చుటకు. (రజియాతో) రండు

(రజియా కంటనీరు పెట్టుకొని గులనారువంక చూచును.)

గుల—(రజియాతో) పొమ్ము!—(రజియా పోవును.) నేను నేఁడింత పనికిమాలినదాని నైతిని. నామనుమరాలితో మాటాడుటకుఁ గూడ తగకుంటిని. ఒక దాసికూడ కన్ను లెఱ్ఱచేసికొని చూచి పోవు చున్నది. దాస దాసీజనముల ధిక్కారమునుగూడ సహించి గులనారు ఈ రాజభవనములో ఒకమూల పడియుండఁజాలదు. సమ్రాజ్ఞియై రాజ్యమున నడుగుబెట్టినది. ఆస్థితిలోనే ఇచ్చటనుండి పోవును.

(క్రిందిరోడ్డుపై కొందఱు పకీరులు వచ్చి పాడెదరు.)

## గీతిక.

జీవితమును వీక్షించితి కాదే కేవల మది కోలాహలమే
ఈవిఁక మృత్యువు నీక్షింపఁగ నిపు డేగుమ సాహస మున్నఁ గా

బల ముండిన నెల్లరు నపారకూపారం బీదఁ జతురులే
అల రసాతలము వీక్షించెద రిఁక సంగము లవశములైనన్
ఉపరిభాగమున ఘనతరంగముల నుదధి కదుల్ గర్జించున్
అపరిమితంబగు శాంతిఁ దేజరిలు నడుగుభాగ మది సేవ్యంబౌ
కెరటంబులఁ బడి కొట్టుకొంటిగద కేవల మిన్ని దినంబుల్
సరగున లోన మునింగి కాంచు మీసలిలం బెంత యగాధంబో.

గుల—నిజము, నేఁడు మునక వేసి క్రింద నెంత లోతు నీ రున్నదో చూచెదను. ఇదియే బాగుగ నున్నది. భయ మెందుకు? ఇదియే సరి. నేఁడు ఆత్మహత్య చేసికొందును.

(కామబఖ్షు ప్రవేశించును.)

కామ...అమ్మా! నేను బీజాపూరు పోవుచుంటిని. నాయన గారి హుకుము.

గుల—ఆఁ వింటిని. మీ నాయనగారి హుకుము! అడ్డగించు టకు నే నెవతెను? పొమ్ము. (కామబఖ్షు గులనారుపాదములకు నమస్కరించును. గులనారు తల వంచుకొనును.) కామబఖ్ష్! కుమారా! ఇదియే నీకును నాకును అంతిమసమాగమము!

కామ—ఎందు కమ్మా?

గుల—ఎందుకా? నేను చనిపోదును—నేను చనిపోదును—నేను ఆత్మహత్య చేసికొందును.

కామ—అది యేమి అమ్మా! కొన్నిరోజులనుండి నీస్వాస్థ్యము బాగుగ లేదని యెఱుఁగుదును. కాని—

గుల—ఎందుకు చనిపోదునా? ఎఱుఁగఁగోరెదవా? అగుచో వినుము. నేను భారతసమ్రాజ్ఞినై యుండునంతవఱకు జీవించియుంటిని. గర్వముచే తలయెత్తికొని యుండఁజాలినంతవఱకు జీవించియుంటిని! నేఁడు బాదుషా తిరస్కారమును, నౌకరుల ధిక్కారమును, పుత్రి పౌత్రిల కృపాపురస్కారమును సహించి గులనారీప్రపంచమున నుండఁగోరుట లేదు.

కామ—మరల నారోజును అల్లా చూపించును. అమ్మా! నాయనగారిని క్షమాపణ గోరుము.

గుల—ఏమి కామబఖ్ష్! క్షమాపణ! నేను క్షమాపణ యడుగుదునా? నాపుత్రుడవే నీవు?—కామబఖ్ష్! సూర్యుడేగరిమతో నుదయించునో ఆగరిమతోడనే యస్తమించును—పొమ్ము. కాని మరల వచ్చి మీయమ్మను జూడవు.

కామ—అమ్మా—సెలవు?

గుల—ఊరకుండుము! ఇంక నేమియు చెప్పకుము. నేను దృఢ సంకల్పము చేసికొంటిని! పొమ్ము. ఇంక నిదియే మన యంతిమసమాగమను-(తలవంచుకొని మెల్లమెల్లగ కామబఖ్ష్ పోవును.) సూర్యుడు గ్రుంకుట కింక నాలస్యము లేదు. దాసీ!— లేరు. ఎవ్వరును లేరు. ఒకదాసికూడ నేడు నాయాజ్ఞను నిరీక్షించుచు నిచట నుండ లేదు. నేడు నేను దాసీజనముకన్న తీసికట్టు నైతిని!—పోయినది, అంతయు పోయినది—నాదీటు, నానీటు, నావైభవము అంతయు పోయినది. నేనును బోవుచున్నాను. (నిష్క్రమించును.)

(క్షణకాలములో ఒకదాసివెంట ఔరంగజేబు ప్రవేశించును.)

ఔరంగ—ఎక్కడ బేగము?

దాసి—తెలియదు హుజూర్! ఇంతదనుక నిచ్చటనె యుండిరి. లోపలికి పోయియుందు రేమో.

ఔరంగ—వెళ్ళి చెప్పుము. (దాసి పోవును) దుర్గాదాస్! నేను యుద్ధములో నీ కోడితిని. కాని యీయోటమి దానికన్న నెక్కువది. నీవు గులనారువంటి రమణిని గుప్పిటబొందియు వదలితివి—గులనారువంటి పట్టపురాణి ప్రేమను నిరాకరించితివి. నిశ్చయముగ నీ వొక మహాత్ముడవు! దిలేర్ఖానుని యనురోధమువలనను నీయందలి గౌరవమువలనను నేడు గులనారును క్షమించెదను, నిజము. దిలేర్ఖానుని మాట న్యాయముగనే యున్నది—మక్కాయాత్రకు పోవుసమయమున ఉగ్రస్వభావయు నుచ్ఛృంఖలయునగు నొకపడతిపై కోపము పెట్టుకొనుటయు నుచితము గాదు.

(బాగుగ సింగారించుకొని గులనారు ప్రవేశించును.)

గుల—ఎవరు? బాదుషాయా? ఇంత అనుగ్రహమా!

ఔరం—బేగమ్!

గుల-ఔరకుండుడు. ఇప్పుడు నేను బేగమును కాను. శాసనము చెల్లించునంతవఱకు బేగముగనుంటిని. నేను నేడు బేగమునుగాను. నేను వట్టిగులనారును—ఏమిచెప్పెదరో చెప్పుడు.

—రం—ఇదియేమి గులనార్; ఇంతలో నింతమార్పు! ఇది యేమి నీవు గుఱుతింపఁబడుట లేదు!

గుల...సమ్రాట్! నాగౌరవము వెంట నారూపమును మట్టిలో గలిసినది. ఇప్పుడు నావద్ద కేయుద్దేశముతో వచ్చితిరి? చెప్పుడు. ఎక్కువ సమయము లేదు. నేను చావఁబోవుచుంటిని. నేను విషము త్రావితిని.

ఔరం-ఇది యేమి! విషము త్రాగితివా గులనార్? ఎందుకు?

గుల—ఎందుకని అడుగుచుంటివా? ఓయీ వృద్ధజీర్ణ ఔరంగ జేబ్! నీ వేమనుకొనుచుంటివి? నీతిరస్కారము సైచి నేను జీవించి యుందునా? నీకృపాభిక్షను వేడి జీవించెద ననుకొంటివా-ఈ సూర్యుని వంక చూడుము. తర్వాత నావంక చూడుము. ఇంకఁ జెప్పుము. మే మిద్దఱము సోదరీసోదరులుగాఁ గనుపట్టుచుంటిమో లేదో? నేనును సమాగ్నినై అకసమున నెక్కితిని. అటులనే నేఁడు అస్తమించుచుంటిని.

ఔరంగ-గులనార్! నే నిపుడు నిన్ను క్షమించుటకై వచ్చితిని. నీవద్ద కొంచెము పుచ్చుకొని యుంటిని. దానిని తిరిగి యిచ్చుటకుగా వచ్చితిని.

గుల—క్షమించుటకా?

ఔరంగ-అవును. నే నిపుడు నిన్ను ప్రేమింపఁజాలను, గులనార్ నీ వెఱుఁగవా గులనార్? నీవు నా కెటుల సర్వనాశము గూర్చితివో! నిమేషమాత్రములో నీవు నాయాశను, నాప్రేమను, నావిశ్వాసమును రూపుమాపితివి. యౌవనమున ఈవస్తువులు భిన్నములైనను సంధింప వచ్చును. కాని ముసలితనమున విఱిగినదానిని సంధించుట దుష్కరము.

నాసర్వము పోయినది. నేనును మక్కాకు బోవుచున్నాను. ఇప్పుడు నేను నిన్ను ప్రేమింపఁజాలను. ఆశక్తి నాయందు లేదు. కాని క్షమింప జాలుదును.

గుల—క్షమించుట ?—సమ్రాట్! నీవు నన్ను క్షమించెదవా ?

ఔరంగ—నీచజాతిమనుష్యులు స్త్రీలను గొట్టి చంపెదరు. చదువుకొనిన సామాన్యులు వారిని విడిచిపెట్టెదరు, మహాపురుషులు వారిని క్షమించెదరు.

గుల—(వ్యంగ్యముగ) నిశ్చయముగ మీరు గొప్ప మహాపురుషులు! కాని సమ్రాట్! గులనా రెప్పుడు నొకరిని క్షమించదు! ఆమె యొకరిని క్షమింపుడని కోరదు.

ఔరంగ—నీవు పొరపడుచున్నావు గులనార్! మహాపురుషుఁడను నేనుగాను. మహాపురుషుఁడు దిలేర్ఖాను. నే నిపుడు యంత్రమువలె నన్నిపనులు చేయుచున్నాను. దిలేర్ఖాను నాతో నిన్ను క్షమించుటకుగాఁ జెప్పినాఁడు. కనుక నతనియనురోధముచే—

గుల—దిలేర్ఖానుని యనురోధముచేతనా? పొండు సమ్రాట్! నేను మీక్షమాపణను గోరుటలేదు. నేను నరకమునకు పోవుచున్నాను వెంట దుర్గాదాసునిపైని యపారప్రేమను దీసికొని పోవుచున్నాను. అతఁడు లభించినచో మేఘఖండమునుబలె నతని నా ప్రేమయను ఝంఝామారుతముచే నీడ్చుకొని నావెంట గొంపోవుదానను. అతనిని పొల్లునిప్పువలె కామాగ్నిలో మెల్లమెల్లగా దహించుదానను. అతఁడు లభించలేదు. కాని యెక్కడనో ఒకనాఁడు లభించకపోఁడు. అప్పుడతనిని చూచెదను. ఔరంగజేబ్! ఈ యనంతవిశ్వమున ఎవ్వరి కామము ప్రతిహింసవలె... ప్రబలము, నుచ్ఛృంఖలము, జ్వాలామయముగనుండునో అట్టివారును గొందరు గలరు. నేనా రకముదాననే. తల తిరుగుచున్నది. ఇంక మాటలాడఁజాలను. నేను చచ్చిపోవుచున్నాను. నా కేమియు చింతలేదు. పైకినెక్కితిని—క్రిందికిపడితిని—పడియుండువారలు పడఁజాలరు. ఏమియు దుఃఖములేదు. సమ్రాజ్ఞినైతినో సామ్రాజ్యముపై శాసనముచేసితిని. ప్రేమిణినయితినో ప్రేమ

దానమును జేసితిని. నే నెవరిని ప్రేమభిక్ష నడుగలేదు— ఏమియు దుఃఖము లేదు, ఒకనాఁడు చచ్చుట యున్న దే. ఇంక చేతులు కాళ్ళు ఉండగనే ఎందుకు చావను—ఆ సూర్యుఁడు గ్రుంకినాఁడు—నేనును బోదును. (నేలపై బడును.)

ఔరంగ—హొమ్ముగులనార్! నీవు నీపాపములకు పశ్చాత్తాప పడుచు చావుము. మరణానంతరము నీపశ్చాత్తాపము ప్రారంభము కావచ్చును. కాని నేను మరణమునకుపూర్వమే పశ్చాత్తాప పడుచున్నాను.

---

## సప్తమదృశ్యము.

స్థానము—ఆగ్రాలోని రాజభవనము. క్రింద యమునాప్రవాహము.

సమయము—సాయంకాలము

(దిలేర్ఖాను, ఒక బాదుషా నౌకరును ప్రవేశించెదరు.)

నౌకరు... బాదుషా చనిపోయిరా?

దిలే... ఆఁ ముబారక్! ఆమృత్యువు చాల శోచనీయమైనది. ఆ సమయమున వారివద్ద ఏపుత్రుఁడును లేఁడు—బేగమును లేదు. నే నొక్కఁడనే యుంటిని. చాలశోచనీయమగు మృత్యువు.

నౌకరు—వారు మక్కాకు బయలుదేరిరి కాదు?

దిలే—ఆఁ కాని వెళ్ళఁజాలకపోయిరి. దౌలతాబాదునందే చనిపోయిరి. శోచనీయమగు నాదృశ్యమును నేను మఱవఁజాలను. తన దుష్కర్మములకు పశ్చాత్తాపపడుచు అర్ధనిద్రావస్థలో "క్షమింపుఁడు మహారాష్ట్రులారా! క్షమింపుఁడు రాజపుత్రులారా! క్షమింపుఁడు పఠానులారా" యని యా బాదుషా చేయు నాక్రందనము విన్న గుండె జల్లుమనుచుండెను. తర్వాత నొక క్షణమునకుఁ బోయెద రనఁగా త్రొట్రుపడుస్వరముతో "అదుగో మొదుట నల్లనిమృత్యుసముద్రము! అందులో నాజీవితనౌకను విడుచుచుంటి" నని పలికిరి. తుదకు "హో అల్లా" యని యఱచిరి—సర్వము సమాప్తమైనది. మర్మభేదియగు నాయుఱపు, ఆదృశ్యము మఱవఁజాలను.

నౌకరు...నిజముగ శోచనీయమగు మృత్యువు—ఇప్పు డెవరు బాదుషా యగుదురో తెలియదు.

దిలే—మాజిమునకు నాజిమునకు యుద్ధ మారంభమైనది. ఫలిత మే మగునో దైవ మెఱుఁగును.

నౌకరు—మీరు శాహజాదీరజియాను ఇటకుఁ దోడ్కొని వచ్చితిరా ?

దిలే—ఆఁ ముబారక్ ! నేఁడు శాహజాదీకి తండ్రిలేడు. తల్లి లేదు...ఎవ్వరును లేరు. ఆమెనుబోలు దుఃఖవతు లిం కెవరు? ఆమె నిచట నొక వృద్ధపరిచారికయొద్ద విడిచిపోవుచున్నాను.

నౌకరు—తా మెచ్చటకుఁ బోయెదరు ?

దిలే...కొంచెము దుర్గాదాసుజాడ తెలిసికొందును.

నౌకరు—ఎందుకు ?

దిలే—కొంచెము పని యున్నది బయటికిఁ బోవుదము రమ్ము. (ఇద్దఱు పోవుదురు.)

(పిచ్చిదానివలె మెల్లగా రజియా ప్రవేశించును.)

రజియా--నే నతనిఁ బ్రేమించుదానను. ఇందుత ప్పేమియున్నది. ఎవరు మమ్ము నెడఁబాపిరి? ఎందు కిట్లు చేసిరి? మాసుఖమును వారు చూడఁజాలరా?

(పరిచారిక ప్రవేశించును.)

పరి—శాహజాదీ!—

రజియా—(వినిపించుకొనక) ఆనాఁడు ఆబూపర్వతదుర్గమున, పండువెన్నెలలో మన కెందుకు సమాగమమైనది? ఎందుకు మనకు సమాగమమైనది అజితా?

పరి—మరల గొణుగుకొనుచున్నది. శాహజాదీ! ఓశాహజాదీ

రజియా—అజితా! అజితా!- వానినామ మెంత మధురమైనది! అజితా!

పరి—(తనలో) లేదు—ఈమె ఇంకను మాటలాడదు. నేను పోదును. ఈమెపద్ధతియే విలక్షణము. (నిష్క్రమించును.)

రజియా—సాయంసమయమైనది. చల్లనిగాలి వీచుచున్నది. కోయిల కూయుచున్నది. యమున మేడక్రిందుగ ప్రవహించుచున్నది. ఆకాశ మెంతనిర్మలముగను, ఎంత నీలముగను ఉన్నది! (పాడును)

# గీతిక

స్వాంతకుంజమున సుఖవసంతసంచారము శూన్యం బీవేళ
ఇంతగ మలయానిలము వీచగానేల? పికము పాడఁగనేల?
భువి నాకసమున వఱలెడుగీతము పోయె లీనమైనేఁడు
అవిసె నేత్రముల జ్యోతియు నుసురులు నరుగుచుండె నీనాఁడు॥
(పాడుచు పాడుచు నిష్క్రమించును.)

---

అష్టమదృశ్యము

స్థానము—పోశోలాహ్రదతీరమున రాజభవనము.

సమయము—మధ్యాహ్నము.

(దుర్గాదాసు ఒంటరిగ నిలఁబడి యాదృశ్యమును జూచుచుండును.)

దుర్గా—(తనలో) ప్రయత్న మంతయు వ్యర్థమైనది. ఈజాతి నాశర్షించి పైకి తీసికొని రాఁజాలకపోతిని. మొగలులసామ్రాజ్య మెటులో యుండదు. కాని యీ జాతియు నిలఁబడఁజాలదు.

(జయసింహుడును, సరస్వతియు వచ్చి నమస్కరింతురు.)

సర...లోపలికి రండు స్వామీ! కొంచెము ఫలాహారము జేయుదురుగాక. రెండుజాము లైనది.

దుర్గా—వచ్చుచున్నాను. నడువుఁడు అమ్మా!

జయ—ఇచ్చట మీ కేవిధమగు కష్టమును లేదుగదా?

దుర్గా...కష్టమే? రాణాగారియాతిథ్యమున నేను చాల సుఖముగా నుంటిని.

జయ—నాయాతిథ్యమునఁ గాదు. సరస్వతియాతిథ్యమున ననుఁడు. సరస్వతియే మీకై యీస్థానమును పసందు చేసినది, సరస్వతియే మీకై యీస్ఫటిక ప్రాసాదమును గట్టించినది. నాఁడు మా

యతిథిగ వచ్చి మీరు నిర్జనస్థానముననుండు కోర్కెను ప్రకటించి నవుడే సరస్వతి యిటకు వచ్చి స్వయముగ నేర్పాటంతయు చేసినది. ఇచట నిత్యము ఆమెయే మీకై పాకము చేయుచున్నది.

దుర్గా—మహారాణికి నాపయింగల దయకు మితి లేదు.

సర...దయయా? దయ యనకుడు దేవా! ఇది యొకదీనురాలి యర్ఘ్యము—భక్తురాలి నైవేద్యము! రాజస్థానమున రాఠోరు వీరుం డగు దుర్గాదాసునినామము విని యుప్పొంగనివారును, గర్వముచే తలయెత్తనివారును ఎవరు గలరు? సౌభాగ్యముచే, పూర్వపుణ్యముచే మా కిట్టి దేశభక్తదేవత యతిథిస్వరూపమున లభించె. ఆదేవత నారాధించి మేము ధన్యుల మెందుకు గాము?

(ద్వారపాలకుడు ప్రవేశించును.)

ద్వార—మహారాజా! ద్వారమున మొగలసేనాపతియగు దిలేర్ఖాను నిలిచియున్నాడు. ఆయన రాఠోరుసేనాపతిని దర్శింపం గోరుచున్నాడు.

దుర్గా—దిలేర్ఖానా? ఏమి! దిలేర్ఖానా?

ద్వార—ఔను స్వామీ! ఈపేరే చెప్పిరి.

దుర్గా—పొమ్ము. ఆయనను గౌరవపురస్సరముగం దోడ్కొని రమ్ము. (సరస్వతిలో) మహారాణీ! మీ రింక లోపలికిం బొండు. నేను రాణాగారితో నిపుడె వచ్చెదను. (సరస్వతి పోవును.) దిలేర్ఖా నిట కేయుద్దేశముతో వచ్చియుండును?

జయ—ఏమియు తెలియుట లేదు.

(దిలేర్ఖాను ప్రవేశించును.)

దిలే...సలాము వీరదుర్గాదాస్! నన్ను గుఱుతించితిరా?

దుర్గా—నేను నాప్రాణప్రదాత నెట్లు మఱవగల్గుదును? రండు. నేడు నేను చాల ధన్యుడను, నేడు మీ రిట కేయభిప్రాయముతో దయచేసితిరి సేనాపతీ?

దిలే—తీర్థదర్శనమునకై వచ్చితిని దుర్గాదాస్! మీ హిందువులకు కాశి, హరిద్వారము, రామేశ్వరము, మున్నగు తీర్థస్థానములున్నవిగదా—యాత్రికు లప్పుడప్పు డచటకు పోయి ధన్యు లగు చుందురుకదా? నేనును మరణించుటకుపూర్వ మొకమాఱు మీదర్శనముచేయుటకై వచ్చితిని.

దుర్గా—(క్షణము సే పూరకుండి) దిలేర్ఖాన్! నే నొకసామాన్య మనుష్యుడను. జీవితములో వీలగునంతవఱకు కర్తవ్యమును పాలించుచు వచ్చుచున్నాను.

దిలే—ఈ పాపయుగములో నీమాత్రము చేయువా రెవరు దుర్గాదాస్? సోదరుడు సోదరుని కంఠము గోయుటకు సిద్ధపడు నీ కాలములో—స్వల్పలాభమునకై జాతి కంతకును హాని కలిగించు నీ కాలములో—ముఖస్తుతిపరాయణులు, మిథ్యావాదులు, ద్రోహులు, వంచకులు నలుదిక్కులం బ్రబలియున్న నీకాలములో... నీవంటివీరుని శుద్ధచరితుని త్యాగిని చూచుటచే ఆత్మ పవిత్రమగుచున్నది. మీ రే విచారించి చెప్పుడు దుర్గాదాసూ! ప్రభువునకై ప్రాణములు సరకు చేయక, దేశమునకై సర్వస్వము నర్పించి, శరణాగతరక్షణకై స్వదేశమును విడిచి అప్సరసనుమించిన సమ్రాజ్ఞిప్రేమను దృణీకరించి, పీడితయగు నబలయుసురులం గాపాడుటకై రొమ్ముసాచి, తుదకు ఒకఉచ్చకులమున జనించిన కన్యకధర్మమును రక్షించుటకై దేశనిష్కాసన శిక్షను స్వీకరించిన మహాత్ముల చరిత్రము మీ పురాణములలో నెందఱిది యున్నది? చెప్పుడు.

దుర్గా—పురాణముల వెదకంబనియేమి దిలేర్ఖాన్! అంతకంటెను ఉచ్చచరిత్రమును జూడంగోరినచో మీచరిత్రమును అద్దము పెట్టి చూచుకొనుడు.

దిలే... నాదియా?

దుర్గా—అవును దిలేర్ఖా! మీదియే. మఱియు నింక నొక మనుష్యుని మీకు చూపువాడను. కాని యతం డిపు డిచట లేకుండుట విచారము. అతడు మీ జాతిసోదరుండగు కాసిము.

(కాసిము ప్రవేశించును.)

కాసిము—ఎక్కడ ! మహారా జెక్కడ ? ఇదిగో నిచటనే యున్నారు. (భూమిపై సాష్టాంగనమస్కారము చేయును.)

దుర్గా—ఇదిగో కాసిమే ! ఎంత ఆశ్చర్యము ! నీ విచ్చోటు వెదకికొని యెట్లు రాఁగల్గితివి కాసిమ్ ?

కాసిము—వెదకికొనుచు వచ్చితిని మహారాజా ! తమరున్నచోటులో వెదకితిని మహారాజా !

దుర్గా— కాసిమ్ ! నీవు మహారాజని యెవరి ననుచున్నావు ?

కాసిము—చిరకాలమునుండియు నెవరి ననుచుంటినో వారినే.

దుర్గా—కాదు కాసిమ్ ! నీకును నాకును మహారా జిపుడు జోధపురము మహారాజగు నజితసింహుఁడే.

కాసిము—వానిపే రెత్తకుఁడు మహారాజా! ఆకృతఘ్నుఁడు-

దుర్గా—కాసిమ్ ! నీ వెవరియెదుట నీమాట ననుచుంటివో యెఱుఁగుదువా ? కృతఘ్నుఁడా ?

కాశిము—ఎఱుఁగుదును. నాహృదయదేవతయెదుట చెప్పుచుంటిని. కాని నే నూరకయుండజాలను. ఎవ్వానిని చెమట యోడ్చి మీా రింత పెద్దవానినిగాఁ జేసితిరో, ఎవ్వాని సంరక్షణమునకును, రాజత్వమునకును మీా జీవితము ధారవోసితిరో, ఎవ్వానిని తల్లి కొడుకును బలె చూచితిరో, అతఁడు మి మ్మీామునలితనములో ... క్షమింపుడు మహారాజా—కంఠము సగద్గద మగుచున్నది. మాటాడఁజాలను.

జయ—కాసిమ్ ! ఇస్లాముమతము నీవంటిమనుష్యులనుగూడ తయ్యారు చేయునా?

దుర్గా—మతము లన్నియు నొకమాటనే చెప్పుచున్నవి. ఒకే మహానీతినే యుపదేశించుచున్నవి. మహారాణా! అప్పటికిని ఎవఁడేని తన మనుష్యత్వమును బోఁగొట్టుకొనినచో—అది మతదోషము గాదు.

మునల్మానులలో కాబలేష్ఖాను నున్నాఁడు. మఱియు దిలేర్ఖాను, కాసిము నున్నారు.

దిలే—మఱియు హిందువులలో శ్యామసింహుఁడు నున్నాడు, దుర్గాదాసు నున్నాఁడు.

కాసిము—మహారాజా! నా యొకవిన్నపము.

దుర్గా—ఏమి కాసిమ్?

కాసిము—తా మిపుడు ఖాణాగారి భోజనమును భుజించు చుంటి రని వింటిని. ఇది కాఁజాలదు.

దుర్గా—ఎందుకు కాఁజాలదు?

కాసిము—నేను జీవించియుండగ తాము పరాయిపంచనుండఁ గిట్టదు. నే నిది చూడఁజాలను.

జయ—ఇది యేమి నీ వేమి చేయనెంచితివి కాసిమ్?

కాసిము—నే నేమి చేయనెంచితినా? వినుడు. నేను మహా రాజునకు భోజనము పెట్టెదను.

జయ—ఎట్లు పెట్టెదవు?

కాసిము...వీలయినట్లు. కూలినాలిచేసి పెట్టెదను. బిచ్చ మడిగి తెచ్చి పెట్టెదను.

జయ—నీ కేమేని పిచ్చియా కాసిమ్! నీ కెక్కడ దొరకును?

కాసిము—ఎక్కడ దొరకునో అక్కడనే పెట్టెదను. నేఁడు మా మహారాణి యున్నచో దుర్గాదాసునకు పొట్టకూటికై మఱియొకరిగడప తొక్కవలసియుండునదికాదు. ఆమె లేదు. కాని నే నుంటిని. నేను కూలిచేసి పెట్టెదను—నూక, చీరు—ఏమిదొఱికిన నది పెట్టెదను.

జయ...ఇది యెక్కడనేని కాఁగల్గునా?

కాసిము—కాఁజాలదా? చూడుడు మహారాజ దుర్గాదాస్! మీ కేది యిష్టమో యది చేయుఁడు. నిర్ణయించుకొనుడు మహారాజా! ఖాణాగారొసంగిన రాజభోగమును భుజించెదరా? నేను తెచ్చిన

రెండుమాడు భుజించెదరా? నిర్ణయించుకొనుఁడు. రాణాగారి పాదములపై నుందురా? నాశిరమున నుందురా? మీచిత్తము ప్రకారము నిర్ణయించుకొనుఁడు.

దుర్గా—నీవు చెప్పునది బాగుగ నున్నది కాసిమ్! దుర్గాదాసు నీవు తెచ్చిన ఎండుమాడు అన్నమునే భుజించును. (లేచి కాసిమును కౌఁగిలించుకొని) సోదరా! కాసిమ్! నేఁడు మొదలు మన మిద్దఱము సోదరుల మైతిమి! (దిలేర్ఖానుతో) చూడుము దిలేర్ఖాన్! కాసి మెంత ఉచ్చహృదయము గలవాఁడో.

దిలే—మీరు నిజము చెప్పిరి దుర్గాదాస్! మీ రిద్దఱు మహాత్ములు, నేఁడు నాయెదుట నిలువుఁడు—ఒకమాఱు కన్నులారఁ జూచెదను. ఖుదా! నీస్వర్గములో నేదేవత లుండిరని యిందుమో వారు వీరి కంటె గొప్పవారలా?

(తెర వాలును.)

సంపూర్ణము.



## తెనుఁగుతల్లి గ్రంథకర్త:- వేదాంతకవి.

విశ్వదాతని కని విశ్వ విఖ్యాతి సంపాదించిన మన తెనుగుతల్లి. తన చిన్నకొడుకుల అధోగతివల్ల దిక్కూ మొక్కూ లేక యేట్లోపడి కొండల్ని కరిగిస్తుంది. అఖండ విశ్వ కవితా సంస్థాన కవిచక్రవర్తిని చెట్టపట్టి కష్టాల్లోంచి గట్టున పడుతుంది. ప్రతివారూ చదివి తీరాలి. నాటకాన్ని చూచి తీరాలి. వెల రు. 1-8-0

## కష్టకాలం గ్రంథకర్త:- వేదాంతకవి.

భాగ్యవంతులచుట్టూ పహారాకాస్తున్న భజనపరులవల్ల యీ కష్టకాలం ప్రపంచానికి దిగింది. కొంపలు ముట్టించింది. నిజానికి నిలబడ్డవాళ్ళని ఖూనీచేస్తున్నది. కష్టకాలంలోవున్న అసహాయశూరులకు ఈ నాటకం వజ్రకవచం వంటిది. వెల రు. 1-8-0.

## ముద్రిక గ్రంథకర్త: పానుగంటి.

మొగుడికి ముండలమీద మోజు, భార్యకు పాతివ్రత్యం అంటే ప్రాణం! చేతులో సిరిచిందులేస్తోంది. ఆజ్ఞకు లోకం అడలిపోతోంది. క్షణక్షణ పరివర్తనపొందే అతని భోగలాలసత్వంక్రింద యెన్నితాళి బొట్లో తగలడిపోయినై, ఎన్నిసంసారాలో మన్నైపోయినై, తుదకాతనికి కామపిశాచానికి బలిగా ఒక సుక్షత్రియ కన్నె బలాత్కారంగా తేబడ్డది. ఆమెను మహారాణిగా చెయ్యాలని ఆ మహారాజు తొందరపడ్డాడు. అవన్నీ చూసి చూసి, అతని భార్యలోవున్న సహనం కాస్త చచ్చిపోయింది. మెత్తమెత్తగా చెవిమెలేసే ఓ దాసీకన్నెను ఆమె చేరదీసింది. అక్కడనుంచి కథ ప్రారంభమైంది.

వలపు పలుకులలో, పలుకు కులుకులలో కులుకుములుకులలో ఆదాసి రాజుగారి వలపు చెలికాని లొంగించుకొని, బుగ్గపోట్లతో నాటకం అంతా నడిపింది. ముసిముసి నవ్వులతో రాజుగారి ముద్రికనపహరించి, ఆయన్ని బంధించి సార్వభౌమునిగౌగిట్లో క్షత్రియకన్నె చిక్కకుండా విడిపించి రాణి కంటినుంచి రత్నాలు కురిపించింది. వెల రు. 1-0-0.

---

